# రామేశ్వర మాహాత్మ్యము.



ఇది

ఏనుగు లక్ష్మణకవి ప్రణీతము

అష్టావధాని

శ్రీరాజా మంత్రిప్రెగడ భుజంగరావు

బహద్దరు జమీందారుగారిచే

మంజువాణియందు ప్రచురింపఁబడినది


ఏలూరు.

మంజువాణీముద్రాక్షరశాల.

1903.

వెల ౦-౮-౦ అణాలు

శ్రీరస్తు.

# రామేశ్వరమాహాత్మ్యము.

## ప్రథమాశ్వాసము.



తుల్యాతటినీమహాజలధిసం-శ్లేషస్థలోపాంత వి।
ఖ్యాతశ్రీగురుజానపల్లిపురని-త్యావాసుఁ డబ్జాత్మకం ' జాతప్రోద్భవసేవ్యుఁ డైందవకళాం-చన్మౌళి
మల్లేశ్వరుం । డాతారార్కముఁ బ్రోచుఁ గావుత
కృపా-యత్తాత్ములన్భక్తులన్ ॥ ౧॥

ఉ. శ్రీరమణీమణిన్ హృదయ-సీమ వహించిన జాణసుందరా।
కారులకగ్రగణ్యుఁ డగు-గాదిలిబిడ్డనిఁ గన్నతండ్రియం।
భోరుహసంభవాదిసుర-ముఖ్యుల నేలిన మేటిలోకర।
క్షారతుఁ డైన వేల్పు విల-సత్కృపభక్తులఁ బ్రోచుఁ గావుతన్ ॥ ౨॥

చ సనకసనందనాదిముని-చంద్రులు నింద్రముఖాఖిలామరుల్।
తనచరణాంబుజద్వయము-దద్దయు భక్తి భజింపఁ గాజగ।
జ్జనని సరస్వతిం గలసి-సాంద్రమరందకణార్ద్రభాసురా।
సనమున నుండు బ్రహ్మ జాఁడొ-సంగుఁ జిరాయువు సజ్జనాళికిన్ ॥ 3॥

ఉ. శ్రీగిరిజాకుమారమద-సింధురవక్త్రవిశాలలోచనున్
భోగికులేశహారుశశి-భూషితమస్తకు వేదశాస్త్రవి
ద్యాగురుమూర్తిభక్తహృద-యాభిమతార్థవిధానదక్షుస
ర్వాగమవేద్యుమత్కృతిస-హాయుగణాధిపతిన్నుతించెదన్ ॥ ౪॥

సీ. వసుమతీధరచక్ర-వర్తిముద్దులపట్టి,
విబుధులపాలిటి-వేల్పుటావు
పతియర్ధదేహంబు-పాలుగొన్న పురంధ్రి,
ముజ్జగంబులుగన్న-ముద్దరాలు
వికచకహ్లారపీఠికనుండుజలజాక్షి,
క్రొన్నెలవిరిఁదాల్చు-కోమలాంగి
వేదాంతవీధుల-విహరించుదైవంబు,
బాలార్కరుచిగల్గు-పరమసాధ్వి

గీ. హస్తతలమునఁబాశాంకు-శాక్షవలయ
పుస్తకంబులుఁధరియించు-పువ్వుఁబోఁడి
పార్వతీదేవినామనః-పంకజమున
నింపుదళుకొత్తఁగావసి-యించుఁగాత ॥ ౫॥

ఆ. మరునిఁగన్నతల్లి-మాధవునిల్లాలు
పాలకడలిపట్టి-పరమసాధ్వి
కలుములిచ్చుచాన-కమలాక్షిసజ్జన
మందిరములనెపుడు-మలయుఁగాత ॥ ౬॥

లయగ్రాహి.

వందనమొనర్తునర-విందభవుసుందరికిఁ,
గుందశరదిందుఘన-చందనసుధాపా
రందరమహీజశర-బృందధవళాంగికిమ,
రందమధురోక్తికిము-కుందశశిభృత్సం

క్రందనముఖత్రిదశ-వందితకువిద్వదళి,
నందితగుణాంబుధిక-మందకరుణాని।
ష్యందకుఁగఙాధరమి-ళిందకుసఖీకృతశి,
వేందిరకుభక్తముఖ-మందిరకుభక్తిన్॥ ౭॥

మ. అగదంకారవిభుం ద్రిమూర్తిమయుఁబ-ద్మాప్తుంద్రయావిగ్రహున్।
జగదానందకరున్ విభాకరుఁదమ-స్సంహారుసర్వేశ్వరుం।
ద్రిగుణాత్ముస్త్రివిధాగమాంతవిదితున్-దివ్యాసురారాధితున్।
భగవంతుంగరుణానిశాంతహృదయు-న్భాస్వంతుసేవించెదన్॥ ౮

క. వినుతింతుననఘుఁగవితా।
జనకురఘుస్వామిపుణ్య-చరితాంబుధిఖే।
లనపరుఁబ్రాచేతసుహృ।
ద్వనరుహసన్నిహితశివును-వల్మీకభవున్॥ ౯॥

క. పంచమవేదగ్రథనవ।
రించెనుబ్రహ్మర్షిగణవ-రేణ్యుం ద్రిదశా।
భ్యంచితునిశ్చలసత్కరు.
ణాంచనపాంగునిఁబరాశ-రాత్మజుఁదలఁతున్॥ ౧౦॥

చ. అనఘునిఁగాళిదాసునిమ-హాకవిహర్షునిభట్టబాణుభా।
సునిశివభద్రుభారవినిఁ-జోరుమయూరునిమాఘుభట్టుదం।
డినిభవభూతివైభవప-టిష్ఠులబిల్హణమల్హణాదులన్।
ఘనులనుబూర్వసత్కవుల-గౌరవమొప్పఁదలంచిమ్రొక్కెదన్॥

క. భారతముఁదెలుఁగుజేసిన।
ధీరాత్మున్నన్నయార్యుఁ-దిక్కనమఖినం।
భోరుహభవనిభునెఱ్ఱసు।
ధీరత్నమునాత్మలోను-తింతున్భక్తిన్॥ ౧౧॥

గీ. మహితచింతామణీదివ్య-మంత్రసిద్ధి।
నైషధాదిప్రబంధసం-దర్భనిపుణు।

సకలవిద్యావిశారదు-సత్కవిత్వ।
పట్టభద్రుశ్రీనాధుఁ-బ్రస్తుతింతు॥ ౧౩॥

క. భీమకవిరామభద్రుని।
సోముని భాస్కరకవీంద్రు-సూరనసుకవిన్।
భూమిని సలి సెన్నికగల।
శ్రీమంతులనాంధ్రకవిప-శేణ్యులఁదలఁతున్॥ ౧౪॥

మ. సరసప్రౌఢవచోవిలాసవిబుధా-చార్యున్స్వవర్ణాశ్రమా।
ధరధీయున్వివిధప్రబంధరచనా-దక్షున్నివధ్యానత।
త్పరచిత్తుంబ్రణమత్సమస్తధరణీ-పాలున్సుభద్రామనో।
హరునింగొల్చెదమప్పిత్రామహునిల-చ్చామాత్యచూడామణిన్॥

గీ. మద్గురుస్వామినఖిలాగ-మస్వభూమి।
సద్వినుతకీర్తిపాండిత్య-చక్రవర్తి।
భక్తిభజియింతునాకర-పల్లికులసు।
ధాపయోనిధిసోముతో-దండరాము॥ ౧౬॥

గీ. అతిమధురకోకిలధ్వను-లాలకించి।
వాయసములోర్వఁజాలక-వఱరుభంగి।
సుకవిసూక్తులకులికియ-సూయఁజెంది।
కుకవులరచినయంతన-కొదువగాదు॥ ౧౭॥

ఆ. కవులమనుచు లేని-కానిపేరూరక।
పూనితమ్ముదారు-పొగడుకొనుచు।
సిగ్గువిడిచితిరుగు-చెడుగులుసర్వజ్ఞ।
నృపసభాస్థలమున-నిలువఁగలరె॥ ౧౮॥

వ అని యిష్టదేవతానమస్కారంబును బురాతినాధుజాతన సుకవి పురస్కారంబునుం గుకవితిరస్కారంబునుం గావించి యొక్క మహాప్రబంధంబుసేయం దలంచియున్న సమయంబున॥ ౧౯॥

సీ. ఏవహాన్యునికుల-దైవంబుగురుజాన,
పల్లిమల్లేశుఁడు-భవ్యమూర్తి।
యేమంత్రితాతభూ-మీశసంపద్గుణ్య,
మహిమోన్నతుఁడుచెన్న-మల్లమంత్రి।
యేమహాత్మునితండ్రి-యింగుచందనకుంద,
బృందనిర్మలకీర్తి భీమమంత్రి।
యేధన్యతల్లిధా-త్రీధరాధిపసుతా,
కలితసౌభాగ్యవి-ఖ్యాతసీత।

గీ. యేమహాత్మునిసోదరుం-డీశ్వరాంఘ్రి।
పూజనాసక్తిమతిసింగ-రాజుశౌరి।
యతఁడుశ్రీభద్రిరాజువం-శాధికుండు।
మహితగుణశాలిమల్లన-మంత్రిశౌరి॥ ౨౦॥

వ. ఒక్కనాడువివిధ విద్వజ్జనపరివృతుండై నిజాస్థాన భవనంబునంగొలువుదీర్చి కూర్చుండి సప్తసంతానప్రముఖనిఖిల ధర్మరహస్యసమాకర్ణనసముదీర్ణసకుతూహలాయత్తచిత్తంబున. ౨౧॥

సీ. శోభితాపస్తంబ-సూత్రవాధూలస,
గోత్రసమస్తస-ద్గుణసమేతు।
వేనుగలచ్చక-పేందుప్రినిపౌత్రుని,
శ్రీమాచిరాజున్న-సింహమంత్రి।
దౌహిత్రభూవరా-స్థానపూజితుఁడుతి,
మ్మనమంత్రికినిఁబేర-మకుఁదనూజు।
ధన్యనవంతప్ర-ధానసోదరువీర,
మంత్రికగ్రజురాజ-మాన్యచరితు।

గీ. నన్ను మతిమంతులక్ష్మణ-నామధేయు।
నమరఁబిలిపించియుచితా-సనముననునిచు।

కవితసత్కారమొప్పఁగ-గారవించి।
పలికెగంభీరభాషణ-ప్రౌఢిమెరయ॥ ౨౨॥

క. నిర్మలకీర్తివిసత్కృతి।
నిర్మాణవిశారదుఁడవు-నిర్మలఛందో।
మర్మజ్ఞుఁడవుశివార్చన।
ధర్మపరుండవునుతింపఁ-దరమేనిన్నున్॥ ౨౩॥

వ. మదీయవిజ్ఞాపనం బవధరింపుము సపాదలక్షగ్రంథ సంఖ్యాసమేతంబును పంచాశత్ఖండ మండితంబును, బహుసంహితో సమాకీర్ణంబునునై యొప్పు స్కాందంబను నాదిమపురాణంబునందు సేతుఖండంబు శ్రీరఘుపతి ప్రతిష్ఠిత రామేశ్వరస్వామి మాహాత్మ్య సంయుక్తంబగుటంజేసి రామేశ్వర పురాణం బనంబరగునది యాంధ్రదేశభాషచేతం బ్రబంధంబుగావించి మదీయకులదైవతం బగు శ్రీగురుజానపల్లి మల్లేశ్వరస్వామిపేర నంకితంబుసేయుము. దీనివలనమాకును మీకును శాశ్వతకీర్తియు సకలాభ్యుదయంబులు సిద్ధించునని బహుప్రకారంబులం బ్రార్థించెనయ్యవసరంబున ౨౪॥

ఉ. రాజమహేంద్రదుర్గరుచి-రంబుగ దేశమునం బ్రసిద్ధిచే।
భ్రాజిలుగాకినాడశల-పాకమహాళ్ళకురెంటికిన్ మహా।
తేజమెలర్పనాసలప-తిత్వముఁగాంచినదిట్టశాశ్వత।
శ్రీజయశాలివైరిగజ-సింహమునందురికామమంత్రియున్॥ ౨౫॥

వ. నన్నుంజూచి లక్ష్మణకవీంద్రా మల్లనమంత్రి విన్నవించిన వచనంబులాదరించి ప్రబంధంబు రచింపుమని వినయ పూర్వకంబుగా భాషించిన నంగీకరించితి నంతట బహుమానంబుగాఁ గర్పూరతాంబూల జాంబూనదాంబర మణిమయాభరణ హిరణ్య ధరణ్యాది మహాపదార్థంబులిచ్చి మల్లనమంత్రి నన్నుం బూజించి వీడుకొల్పి నంజను దెంచి విరించిముఖ నిఖిలబృందారకబృంద మహనీయ హాటకకోటీర సంఘటిత మణిగణ ప్రభాంకూర నీరాజిత చరణార

విందుండగు శ్రీగురుజానపల్లి చెన్నమల్లేశ్వరస్వామినిం గృతికినధీశ్వరుంగావించి రామేశ్వరమాహాత్మ్యంబను మహాప్రబంధంబు నిర్మింపందొడంగితి నమ్మహాదేవునకు. ౨౬॥

## షష్ఠ్యంతములు.

క. శంభునకుగిరిసుతాకుచ।
కుంభస్థలకలితలలిత-కుంకుమచర్చా।
శుంభత్సౌరభవిభవవి।
జృంభితవక్షునకుసవన-జితదక్షునకున్॥ ౧॥

క. కుండలికుండలమండిత।
గండద్వితయునకుఁబాండు-కరడిండీరా।
ఖండలవేదండశర।
త్కాండవపాండురమనోజ్ఞ-గాత్రద్యుతికిన్॥ ౨॥

క. ఇందీవరసందోహక।
ళిందసుతేందిందిరావ-ళీసుందరరుు।
గ్బందీకరణచణశ్రీ।
తుందిలకంతునకకుంత-దోర్దండునకున్॥ ౩॥

క. సురవర్ణితతుల్యాసా।
గరసంగసమీపభూమి-కమనీయగుణా।
భరణగురుజానపల్లీ।
పురవిహరణశీలునకువి-బుధపాలునకున్॥ ౪॥

క. చరణానతశతమఖముఖ।
సురపరివారునకుఁగోటి-సూర్యవిభాధి।
క్కరణప్రవీణతేజః।
పరిపూర్ణాకారునకుఁగృ-పాచారునకున్॥ ౫॥

క. కరిచర్మాంబరునకు వర
సరసిజధృతశరంబునకు-సజ్జనరక్షా
వరకరుణాపాంసునకు
న్నరకభయధ్వాంతభంజ-నపతంగునకున్॥ ౬॥

క. సోమునకు భక్తనిహిత
ప్రేమునకున్ భద్రిరాజు భీమయసుతమ
ల్లామాత్యమానసాంబుజ
ధామునకును నిరుపమాన-తతధామునకున్॥ ౭॥

క. ద్రుహిణాదివిబుధనుతునకుఁ
దుహినాంశుకళావిభూషి-తునకున్ లక్ష్మీ
సహితగురుజానపల్లీ
మహితనివేశునకుఁ జెన్న-మల్లేశునకున్॥ ౮॥

వ. సభక్తిసమర్పితంబుగా నాయొనర్పం బూనిన రామేశ్వర మాహాత్మ్యంబునకుఁ గథావిధం బెట్టిదనిన.

## కథాప్రారంభము.

శా. శ్రీమత్కాంచనగర్భసన్నిభమహ-ర్షిస్తోమధామంబును
త్రామస్తుత్యవిచిత్రవైభవగుణా-ధారంబు సద్గోమతీ
నామద్వీపవతీసమంచితమమం-దజ్ఞానలక్ష్మీమయ
క్షేమోద్దామము నైమిశంబనవన-శ్రేష్ఠంబు వొల్చున్ ధరన్॥ ౧॥

సీ. శాంతమానసముక్త-జాతిమత్సరబద్ధ,
సఖ్యనానాసత్త్వ-సంకులంబు
సంయమిదత్తఘా-సగ్రాసమాంసల,
చారుసారంగికి-శోరకంబు
తాపసేశ్వరనిరం-తరయాగహోమధూ,
మస్తోమవృతనభో-మండలంబు

మునిరాజకన్యకా-జనకృతోద్వాహమై,
భవసుశోభితలతా-పాదపంబు।

గీ. వేదశాస్త్రేతిహాసప్ర-వీణకీర।
శారికాకేకికోకిల-భూరివాద।
వాదమేదురమూర్జితా-నందబోధ।
కారణము వొల్చు నైమిశ-కాననంబు॥ ౨॥

వ. అందు. ౩॥

సీ. అష్టాంగయోగవి-ద్యాసమాసక్తులు,
బ్రహ్మవిజ్ఞానత-త్పరులు లోక।
పావనుల్ నిశ్చల-బ్రహ్మవాదులు మహా,
త్ములు ముక్తికాములు-దురితహరులు।
ధర్మవేదులు సూనృ-తవ్రతులనసూయు,
లపగతక్రోధులు-విపులమతులు।
విజితేంద్రియులు జగ-ద్వినుతశీలురు సర్వ,
భూతదయాపరు-ల్భువనహితులు।

గీ. శౌనకాదిమునీశ్వరుల్-జలజనాభుఁ।
బరమపురుషుసనాతను-భక్తితోడఁ।
బూజసేయుచు సలిపిర-ద్భుతతపంబు।
పుణ్యతమమగు నైమిశా-రణ్యమునను॥ ౪॥

ఆ. భావితాత్ముఁడైన-బ్రహ్మర్షి పుంజరు।
లిరువదాఱువేవు-రెంచిచూడ।
వారిశిష్యజనుల-వారిశిష్యుల నెల్ల।
సంఖ్యఁజేసి పలుక-శక్యమగునె॥ ౫॥

క. వారొక్కనాఁడు గమియై,
భూరిగతిఁ భోగమోక్ష-ములకును పాయం।
బారూధి నెఱుఁగఁదలఁచియు।
దారకథాగోష్ఠి జేసి-రన్యోన్యంబున్॥ ౬॥

క. ఆసమయంబున వేద।
వ్యాసుని శిష్యుండు మాని-వర్యుఁడు నిత్యో।
ల్లాసుఁడు సూతుఁడు కడిఁకా।
గ్రేసరుఁడచ్చటికి వచ్చెఁ-గీతిజితభంగిన్॥ ౭॥

చ. అనలునిభంగిఁ జేజరిలు-నమ్మునినమ్మునినాథులాదరం।
బునఁ గనియర్ఘ్యపాద్యములఁ-బూజనముల్దగఁ జేసియున్నతా।
సనమిడిచాలభక్తినిఁ బ్ర-సన్నునిఁ జేసి జగద్ధితార్థమిం।
పెనయఁగ వారలిట్లడిగి-రమ్ములనొక్కమహారహస్యమున్॥ ౮॥

క. సూతా వింటివి సత్యవ।
తీతనయునివలన సకల-దివ్యపురాణ।
వ్రాతంబులు జగదేక।
ఖ్యాతగుణా నీవుఁ దెలియు-నఖిలార్థములున్॥ ౯॥

క. ఎయ్యవి పుణ్యక్షేత్రము।
లెయ్యవి తీర్థోత్తమంబు-లివ్వసుమతిలో।
నెయ్యెడలఁ బెంచు మోక్షము।
చయ్యన జనులకు భవోగ్ర-జలనిధివలనన్॥ ౧౦॥

గీ. ఎవ్విధమునను మేశర-మేశభక్తి।
గలుగు నరులకు నెద్దాని-వలన దొరకుఁ।
ద్రివిధకర్మఫలంబిది-తెలియఁ బలుకు।
మాదరంబున మాకు మ-హామునీంద్ర॥ ౧౧॥

క. మునివరు లిట్లడిగిన వ్యా।
సునకుం బ్రణమిల్లి పలికె-సూతుండు తపో।
ధనులారమంచి ప్రశ్నం।
బొనర్చితిరి లోకహితము-యోజించి మదిన్॥ ౧౨॥

ఆ. ఈరహస్యతత్త్వ-మిపుడేను లెస్సవ.
చింతు మీకు మును పు-చెప్పలేదు।

చిత్తనిగ్రహంబుఁ-జేసినిశ్చలభక్తి।
పూర్వకముగ వినుఁడు-పుణ్యులార॥ ౧౩॥

సీ. కడఁగి సేతువుఁ జేర-గా నేము కలభించు,
భవకేశవులయందు-భక్తిపుట్టుఁ।
త్రివిధకష్టంబు సి-ద్ధించునన్నోటన,
నించుకంతయుసంశ-యించవలదు।
మనుజుఁ డెవ్వఁడుజన్మ-మధ్యంబునను సేతు,
బంధంబుఁబోడగాంచు-భక్తితోడ।
ధన్యతనరుఁడుమా-తాపితృవంశకో,
టిద్వయోపేతుఁడై రివిమెఱయు।

గీ. బ్రహ్మపదమున నొకక్ర-కల్పమువసించు।
ముక్తుఁడగుఁదారలుపరాగ-ములుగణింప।
శక్యమగు సేతుదర్శన-జనితపుణ్య।
మహీపతికినైన లెక్కి-ంప నలవిగాదు॥ ౧౪॥

వ సేతుబంధంబు సకలదేవతాస్వరూపంబు గావున దానింజూచిన వానిపుణ్యంబు లెక్కింప నెవ్వనివశంబు సేతుదర్శనంబు జేసిన నరుండు సర్వయాగకరుండు, సర్వతీర్థస్నాతయు, సర్వతపంబులుం జేసినవాఁడు సేతువునకుం జనుమని పలికిన పురుషుండు సేతువునకుంజనిన పుణ్యఫలంబునొందు. ౧౫॥

క ధర సేతుస్నానముగల।
గురుపుణ్యుఁడుసప్తకోటి-కులములతోడఁ।
హరిభవనంబునకుంజని।
సురుచిరగతిముక్తిఁబొందు-సువ్రతులారా॥ ౧౬॥

గీ. మానవుఁడు సేతువునుగంధ-మాదనంబుఁ।
శ్రీరామేశుఁదలఁచు మఁ-బితృకులములు।
లక్షకోటులుగూడిక-ల్పత్రయంబు।
శంభుపదముననుండి మో-క్షంబుఁగాంచు॥ ౧౭॥

వ. మఱియు మహాపావస్థయు, వసాకూపంబును, వైతరణీనదియు, శ్వభక్షణంబును, మూత్రపానంబును, తప్తశూలంబును, తప్తశిలయును, పురీషహ్రదంబును, శోణితకూపంబును, క్రిమిభోజనంబును, స్వమాంసభక్షణంబును, వహ్నిజ్వాలాప్రవేశంబును, శిలావృష్టియు, కాలసూత్రంబును, క్షారోదకంబు, నుష్ణతోయంబునను నరకంబులు సేతుస్నాతవిలోకింపండిది నిక్కంబు ౧౮॥

గీ. సేతువునవగాహంబు-సేయువాఁడు।
పంచపాతకముక్తుఁడై-పద్మనాభు।
వీటఁబిత్ర్మాతృకులశత-కోటితోడ।
మూఁడుకల్పంబులువసించి-ముక్తిఁగాంచు॥ ౧౯॥

సీ. క్షారసేచనముపా-షాణయంత్రముమఱు,
త్పతనంబుకరపత్ర-ధారణంబు।
సంధిదాహంబును-శస్త్రిబేదనమును,
కాష్టనిర్మితయంత్ర-కర్షణంబు।
పాశబంధంబునా-నాశూలపీడనం,
బాస్యనాపాలవ-ణాంబుసేక।
మంగారపుంజశ-య్యాశ్రవణంబును,
దళనమర్దనమహి-దంశనంబు।

గీ. తప్తపాషాణభుక్తియుఁ-దప్తసూచి।
భక్షణముఁదప్తతిలతైల-పానధూమ।
పానములుమొదలైనయ-పారనార।
కములుచూడఁడుసేతువుఁ-గాంచునరుఁడు॥ ౨౦॥

వ. మఱియు నధశ్శిరశ్శోషణంబును, గజదంతహననంబును, క్షారాంబుపానంబును, క్షారోదకబిలప్రవేశంబును, మేహాభోజనంబును, స్నాయుచ్ఛేదనంబును, స్నాయుదాహంబును, నస్తిచ్ఛేదనంబును, శ్లేష్మాదనంబును, పిత్తపానంబును, మహాతిక్తనిషేవణంబును, నుష్ణసైకతాస్నానంబును, దష్ట్రాయశ్శయనంబును, సంత

ష్ఠాంబు సేవనంబును, నేత్రనఖసంధిసూచిప్రక్షేపంబును, నండసహిత శిశ్నంబున నయోభారబంధనంబును, వృక్షాగ్రంబువలనం గషోదక కూపంబునం బడంద్రోఁచుటయును, తీక్ష్ణఖడ్గధారాశయనంబును, మొదలగు మహాఘోరనరకంబులు విలోకింపక సేతుస్నాత సుఖించు సేతుయాత్ర గావింతునని తలంచి యెవ్వండేని నూరడుగులు నడచునతండు పంచమహాపాతకంబులు విడనాడి యీచెప్పిననరకంబులం గనుంగొనక కైవల్యంబునొందు. ౨౧॥

గీ. మానవుఁడు సేతుసైకత-మధ్యధూళి।
పాళిఁబొదలుచు నెవ్వాఁడు-పవ్వళించు।
నతనిమెయి నెన్ని రేణువు-లంటినిలుచు।
నన్నిద్విజహత్యలునశించు-నాక్షణంబ॥ ౨౨॥

క. తీరమ్మదు సేతుమధ్యస।
మీరాంకురసముదయములు-మేనులపైఁబం।
పారఁగసోకినజనులక।
పారమహాఘోరపంచ-పాపములడఁగున్॥ ౨౩॥

సీ. మార్గభేదియును బా-హ్మణదూషకుండును,
స్వార్థపాకియునున-త్యాశనుండు।
వేదవిక్రితయు-వీరేవురును బ్రహ్మ,
ఘాతకుల్ తత్తివిప్ర-గణములకును।
ధనముఖ్యవస్తువుల్-తగనిత్తునని పిల్చి,
యంతలేదనిపల్కు-నట్టివాఁడు।
ధర్మరహస్యంబు-తనకుబోధించిన,
గురునితో వైరంబు-గూర్చువాఁడు।

గీ. చెరువునకునీరుదా-వంగఁ-జేయునట్టి।
గోగణంబులమరలించు-కుత్సితుండు।
బ్రహ్మఘాతుకులని చెప్పఁ-బడినవీర।
లనఘులగుదురు సేతుమ-జ్జనమువలన॥ ౨౪॥

క. సురఁ ద్రాఁగి సమసువఁ గలసిన।
పురుషుఁడు గణదేవళాన్న-భోజియుఁ బతితా।
స్నరతుఁడు గణకాన్నాశియుఁ।
బరిహృతహోముఁడును మద్య-పాయి సమానుల్॥ ౨౫॥

క. ఫలకందమూలదుగం।
బులు మృగమదచందనక్ర-ముకకర్పూరం।
బులు గుదాక్షములు నమ్మి।
చ్చినవారు సువర్ణహరులు-సిద్ధము దలఁపఁ॥ ౨౬॥

క. వీరికి మఱి యుందక్కిన।
చోరులకును సేతుతీర-సుస్నానమునన్।
ఘోరాఘములు నశించువి।
చారంబియ్యేషలవలదు-సన్మునులారా॥ ౨౭॥

ఆ. భ్రాతృభార్యఁ బుత్త్రి-భార్య రజస్వల,
భగినిహీనవనితఁ-బశువిహీనఁ।
గల్గుఁ దారిపు వెలఁదిఁ-గలయువాఁడిలగురు।
తల్పగతసముండు-తపసుఁ జార॥ ౨౮॥

వ. వీరునుం దక్కినగురుతల్పగసమానులుం దత్సంయోగులును మహా
సేతునిమజ్జనులై ముక్తిం బొందుదురు. ౨౯॥

సీ. యాగంబు సేయక-యమరలోకాంగనా,
సంగమసుఖవాంఛ-సలుపువారు।
జ్వలనాద్యులను దేవ-తలను పాసింపక,
కుశలంబు మదిలోనఁ-గోరువారుఁ।
తిలమహీహేమతం-డులధాన్యదానంబు,
సేయక స్వర్గేచ్ఛ-సేయువారు।
సతతోపవాసని-ష్ఠలదాప మొందక,
బలశత్రుపురినుండఁ-దలఁచువారు।

గీ. సేతుతీర్థాభిషేకంబు సేయవలయు।
సేతుమజ్జనముననగుఁ-జిత్తశుద్ధి।
యనఘుమతులారజపతపో యజ్ఞహోమ।
దానములు సేతువున మోక్ష-దాయకములు॥ 30॥

క. పాతకవిమోచనార్థము।
సేతువునమునింగినరుఁడు-జితపాపుఁడగున్।
భూతికినైసుశ్రీకిఁగా నవాఁ।
డాతతసామ్రాజ్యవైభ-వాన్వితుఁడగున్॥ 31॥

చ. అమరవధూమణీవ్యజఘన-చామరతిటీమకరీవిలేఖన।
క్రమసువినోదవాంఛమదిఁ-గల్గి భోగులుభక్తియుక్తులై।
యమలమనోజ్ఞసేతుసలి-లాప్లుతదేహులుగావలెన్ జనా।
భిమతము లెల్లనొప్పఁగల-భింపను సేతునిమజ్జనంబునన్॥ 32॥

శా. కైవల్యంబులభించుదోషమడఁగుం-గన్పట్టుఁగళ్యాణముల్।
ధీవిస్తారముసంభవించునభివృ-ద్ధింబొందుధర్మార్థముల్।
శ్రీవైకుంఠకపర్దిలోకసుఖముల్-చేకూఱువేదాదివి।
ద్యావైదుష్యముగల్గుసేతుసలిలాం-తర్నిష్ఠులౌవారికిన్॥ 33॥

క. ఆరోగ్యమురూపంబును।
దారిద్ర్యవిమోచనంబు-ధనవృద్ధియునుం।
గోరిమదిసేతుజలముల।
నారూఢిమునుంగువారి-కవిసిదించున్॥ 34॥

గీ. శ్రద్ధచేనైనమనుజుఁడ-శ్రద్ధనైన।
సేతుసలిలావగాహంబు-సేయువాఁడు।
ఘనతదీపింపనుభయలో-కంబులందు।
బాధలెఱుఁగకసౌఖ్యసం-పదలఁగాంచు॥ 35॥

వ సేతుస్నానంబున సర్వజనులకుం బాపసంచయంబునశించు, ధర్మం బు శుక్లపక్షశశాంకుండునుంబోలె వృద్ధింబొంద, రత్నంబులుసా గరంబునందెఱుఁగునట్లైవడి పుణ్యంబులంతకంతకుం బెఱుఁగు, కా

మధేనువు చందంబునం, గల్పవృక్షంబువడువున, చింతామణి తెరంగున, సేతుస్నానంబు సకలపురుష మనోవాంఛితార్థంబులొసంగు. లేమిం జేసి సేతుయాత్రం గావించ సమర్థుండుగానివాఁడు, శిష్టులగు విప్రుల ధనంబు యాచించునది వారలియ్యరేని క్షత్రియ వైశ్యశూద్రులనైన యాచించి యెవ్విధంబుననైన ధనంబు వడసి సేతుస్నానం బాచరింపవలయు ఎవ్వండేని సేతుయాత్రాపరునకు ధనధాన్యవస్త్రాదికంబులిచ్చి ప్రవర్తింపంజేయు నతనికి నశ్వమేధాది యజ్ఞఫలంబునుం, జతుర్వేదపారాయణ పుణ్యఫలంబునుం, దులాపురుషముఖ్య మహాదానఫలంబును సిద్ధించు బ్రహ్మహత్యాది పాతకంబులు దొలంగు సర్వకామంబులుఫలించు. పరిగ్రహించువాఁడునుం బ్రతిగ్రహదోషంబులేక తత్తుల్య ఫలంబు వడయును.

గీ. సేతుయాత్రార్థమర్థమా-ర్జించిపిదపఁ।
జననిలోభికిఁ దత్సేతు-వునకు నేగు।
వానికిచ్చెదననియియ్య-లేనిలోభి।
కరటుభూసురహత్యయౌ-నండ్రుబుధులు। ౩౭॥

క. ధనవంతుండయ్యుదరి।
ద్రునిగతినెవ్వాఁడు వేఁడఁ-దొడఁగుఁ గులోభం।
బున సేతుయాత్రకొఱకున।
తనినిఁ ద్విజహంతయండ్రు-తత్వవిధిజ్ఞుల్॥ ౩౮॥

క. మానకనరుఁడేవెరవుల।
చేనైనస్సేతుయాత్రి-సేయందగుధా।
త్రీనిర్జరునకశక్తుల।
నూనధనంబిచ్చిపంప-నుచితముధరణిఁ॥ ౩౯॥

ఉత్సాహము. కృతయుగమునముక్తిదొరుకు-నెరుకచేజనాళికిం।
గ్రతువులొసఁగుముక్తి త్రేత-కడమరెండుయుగముల।
న్వ్రతతదానములలభించు-విమలసేతుతీర్థమం।
చితవిధమునముక్తిగలుగఁ-జేయునాల్గుయుగములఁ॥

వ. అనివివరించిన రౌమహర్షణితో శౌనకాదిమునీంద్రులిట్లనిరి. ౪౧

గీ. సూతగంభీరజలధిపై - సేతుబంధ।
మెట్లుగావించె రఘుకులా - ధీశ్వరుండు।
సేతుగతగంధమాదన - క్షితిధరముఁ।
నెన్నఁదగుపుణ్యతీర్థంబు - లెన్ని గలవు॥ ౪౨॥

గీ. కలితరామేశశంభులిం - గప్రతిష్ఠ।
రాముఁడొనరించె నేప్రకా - రమున మున్ను।
తేటపడ మాకు నీకథ - తెలియఁ బలికి।
మముఁ గృతార్థులఁ జేయుము - మౌనితిలక॥ ౪౩॥

వ. అని ప్రార్థించి యడిగిన శౌనకాదిమహర్షులకు సూతుండిట్లని చెప్పం
దొడంగె. ౪౪॥

చ. దశరథునాజ్ఞచేత గుణ - ధాముఁడు రాముఁడరణ్యభూమికిం।
గుశలమతిం బ్రియాంగనయుఁ - గూరిమితమ్ముఁడుఁ దన్ను గొల్చి రా।
వశజనమానసప్రియుఁడు - వచ్చి చరింపుచు దండకాటవిన్।
విశదగతిన్ వసించె నతి - విశ్రుతపంచవటీతటంబునన్॥ ౪౫॥

గీ. అంత మారీచవిరచిత - వ్యాజయుక్తి।
రాజసుతుల వంచించి - రావణుండు।
తపసివేషంబుఁ గైకొని - ధర్మ మెడలి।
జానకీదేవి నిహరించె - సాహసమున॥ ౪౬॥

మ. అనఘుండంతట రాఘవేశ్వరుఁడర - ణ్యాక్షోణులన్ మేదినీ।
తనయాన్వేషణమాచరించుచు సము - ద్యల్లీలఁ గాంచెన్ మహా।
స్వనదంభోజవసద్ద్విరేఫబకహం - సక్రౌంచవంద్యుక్తిగుం।
భనశుంభజ్జలరాట్సభాభవనముం - బంపాసరోరాజమున్॥ ౪౭॥

వ. మఱియు నాసరోవరంబున సభరితబిసఖండంబులు భుజించుతరి
నెడనెడం బొడము పిపాసవలన శతపత్రపాత్రనిక్షిప్తమకరంద
పానీయంబులు గ్రోలుచు నుద్వేలానురాగంబునం దద్బిందుకణం

బులు వరటీసముదాయంబులకుఁ జంచచ్చంచూపుటంబుల నొసం
గిన యదియును వాత్సల్యంబునం గిశోరనికురంబవదనంబులకు మంద
ప్రకారంబున నందించుచున్నం గనుంగొని పరమహర్షవికస్వర
కంఠంబులై కలకలనాదంబులు గావింపుచుం గాంచనచ్ఛాయాపం
చకగరుపించలక్షేపంబు సేయుచు, మనోహరమందగమనంబులం
బుండరీక షండంబులం గ్రీడ గావించు రాజహంసంబులవలనను,
కంఠదఘ్న నీరపూరంబున నపారకౌతుకంబున నోలలాడు చెంచు
గుబ్బెతల కవుంగిళ్ళ డాఁగిలిమూతలాడు బెడంగు సిబ్బెంపు గ
బ్బిగుబ్బలు గనుంగొని స్వబంధువక్త్ర మిథునంబులు వారిచేతం
బట్టువడెనని తలంచి తమ్ముంబట్టుకొందురోయను శంకపుట్టి కోకిల
నికాయంబులతోడ నెగసి పెరచోటులకుం జని యచ్చట భయం
బుపెక్కి చక్కురవిలు కానికేళిం దేలుచుం దమ బాంధవుండగు మా
ర్తాండునిం బొగడు వసువున రుతంబులు సేయుచుఁ దోయంబుల
మునింగి తేలుచు నభిమతగతుల వర్తించు చక్రవాకంబుల వల
నను, నికటవిపిన తరుమూల కుశాసనాసీనమౌనిరాజులం జూచి నే
ర్చిన యవియుం బోలె మునివృత్తి వహించి వనవాసులై స్వచ్ఛత
గలిగి ధ్యానపరాయణంబులై హఠాన్నీరసముత్పతన్మత్తమీనం
బులు రభసంబున నతిదీర్ఘ త్రోటిపుట నికటంబుల వ్రాలిన వానిం
బట్టి కబళించి యదృచ్ఛాలాభసంతుష్టాంతరంగంబుల సుఖించి
మెలంగుచున్న బకంబులవలనను, పునఃపునఃకృతసురత సముదిత
క్లమంబునం దిర్యగావర్తితకంఠంబులై శిరంబులు గరుత్పరంపర
లం గప్పి యేకపాదస్థితిం జెంది తీరభూముల నిదురబోవుచున్న
తటిం గేళీరత సంయమి కన్యకాజనంబులు ఫేనపుంజభ్రాంతిం
దమ్ముంబట్టికొని చన నుద్యోగించునంతలోనం దదీయ కరకమల
సంస్పర్శంబునం బ్రబోధంబునొంది, బెదరి బెదరిచూచి యుల్లం
ఘించి తొంటి తమ విహారణస్థలంబుల వ్రాలి జాలింబడు తమ

చుట్టంబులంగలసి ప్రమదంబున సుఖక్రీడలంబొదలు బాతువుల
వలనను, నభిరామంబై నీలకంఠకాళిమచ్ఛాయాదాయాదమేదుర
దళ విసర విలసిత నవకువలయ సమాజసౌరభ్య సంభరితంబును,
పథికజనానాసాపుటస్ఫుటతరానందసంధాయక పరిమళమిళిత్పరాగ
పుంజమంజుల కంజాత సంజాత మధురమధూళీమాధుర్య రసికమ
ధుకర నిరంకుశ ఝుంకార కోలాహలసంకులంబును, సరస సం
గీతి సమాకర్ణన సమ్మోదమాన జలదేవతాప్రసాదలబ్ధ మధుకరాధీన
తప్తకాంచన పానచషక తిరస్కృత కోకనద విరాజమానంబును,
పాకశాసనిపరివృఢ పర్యట త్పాండురాఖండ యశోమండల సం
భావనాస్పద కుముదసముదయ ప్రభాపరిపూర్ణంబును, తీరభూరు
హశ్రేణీయ కుసుమిత లతానికేతన మకరకేతన కేళీరసానుషక్త శబ
రకాంతాపరిశ్రాంతిహారణ ప్రవీణ విమలజలశీకరకిర త్సరసిజరజ
స్సుగంధిగంధవాహంబును, జలవిలోకిత ప్రతిబింబ శాఖిశాఖా
గ్ర ప్రత్యగ్రపల్లవగ్రహణార్థ పతిత పరిభ్రాంత పరభృత నిర్వా
హక పంచబాణప్రేరిత మారుతప్రయుక్త నిశ్రేణీకృతకూలపాదప
విశాలశాఖాదళచ్ఛన్నంబును, దావపావకదహ్యమాన కాలాగరు
ధూమమాలికాళికాళికాలోకన పరిహృష్యన్మద మయూర నట
నానారూప భృంగాంగనాసంగీతభంగిసంగత సముత్తుంగతరంగ
మృదంగనాదగుంభనకరంభితంబును, మత్తవేదండ శుండాదండ
చులికితపారిజాత పుష్కరచ్ఛటానిర్వాపిత వనవాతోద్ధూత నభ
శ్చుంబినీ బిడాంబుజరాజి పరాగంబును, కోమలశ్యామల బాల
తృణాంకుర చర్వణ సంజనిత పిపాసాపరవశ సమాయాత పీత
విశ్రాంతి వాతాయుయూథ సమాశ్రిత సవిధవివిధ పాదపచ్ఛా
యాతలంబును, సుందరారవింద మందిరవిహారదిందిరాసత్కార
కారి వనదేవతా విశ్రాణిత మహోపాయనాస్తరణాంకవపట
శంకాకరజలోపరి పరిస్యూతాను తటప్రరూఢకదంబమంజరీకుసు

మకేసర విసరంబును, వరుణరాజానుచర మకరనికర మత్స్య కచ్ఛపకుళీర ప్రభృతి సకలజలజంతుసంతాన సంతతసంచార సంకులంబును నగుచు, గగనంబుభంగి రాజహంసభరితంబై, విష్ణుజఠరంబుగతి భువనపరిపూర్ణంబై, అలకానగరంబు తెఱంగున శంఖమకరకచ్ఛప పద్మమండితంబై, క్షీరసాగరంబుమాడ్కి మధురామృతస్థానంబై, ఛందశ్శాస్త్రంబువోలె విచిత్రవృత్తశోభితంబై, దీనార్తిక్రియలఘుజీవనంబై, సాధుజనచరితంబుకరణిపంకరహితంబై, రథంబువిధంబున చక్రసహితంబై, స్వర్గంబుభాతి వాసవ సమృద్ధిసంపన్నంబై, సుందరీగళంబురీతి జలజభాసురంబై, ధనికభవనంబు ప్రకారంబునం గమలాభిరామంబై రాజాస్థానంబుకైవడి కవివాగ్గుంభితంబై, సముద్రంబువోలెఁ గువలయాభరణంబై, కోణపదిగ్భాగంబులాగునం గుముదాశ్రితంబై, యొప్పు పంపాసరోవరంబు గనుంగొని తత్తీరంబున. ౭౨॥

సీ. జానకీపతియొక్క - వానరుం గాంచెన,
కపియును రామునిఁ - గాంచి మ్రొక్కె।
యయ్య మీ రెవ్వరం - చడుగ వానికిఁ దన,
వృత్తాంతమంతయు - విస్తరించి।
యనఘునీ వెవ్వండ - వనిఁ గౌసల్యాత్మ,
జునకునిట్లనియెన - వ్వానచరుండు।
దేవర యేను సు - గ్రీవుని సచివుఁడ,
హనుమంతుఁడను వాఁడ - ననిలసుతుఁడ।
గీ. చెలిమి మీతోడ సేయంగఁ - దలఁచి భాను।
సుతుఁడు పుత్తెంచెనన్ను మీ - రితనికడకు।
వేగ విచ్చేయుఁడనిన భూ - విభుఁడు లెస్స।
యనుచు సౌమిత్రియును దాను - నచటికరిగె॥ ౭౩॥
క. ఇనపుత్త్రునిమదమొప్పం।

గినుఁగొని వేసనగ్ని సాక్షి-కంబుగ సఖ్యం।
బొనరించి వాలిం జంపుదు।
ననివిభుఁడు ప్రతిజ్ఞఁ జేసె నర్క-సుతుండున్ ॥ ౫౦॥

వ. సీతాదేవిం దోడి తెచ్చెదనని ప్రతిజ్ఞ పలికి రిట్లన్నరేశ్వరవానరేశ్వ
రులు సమయంబుఁ గావించి పరస్పరంబు విశ్వసించి నితాంతసం
తోష సమన్వితులై ఋష్యమూక గిరిశిఖరంబునఁ గూర్చుండి రంత.

క. గిరినిభ దుందుభికాయము।
బరువడి రాఘవుఁడు జిమ్మె-బహుయోజనముల్।
చరణాంగుష్ఠనఖంబున।
హరిసూనునిమదికిఁ బ్రత్య-యము పుట్టుటయున్ ॥ ౫౧॥

గీ. మఱియు నతనికి నమ్మిక-మదిజనింపఁ।
గడఁకతో వింటనొకతూఁపుఁ-దొడిగి సప్త।
సాలములు వేలఁ గూలంగ-లీల నేసె।
రాఘవుఁడమోఘతరబాణలా-ఘవుండు॥ ౫౨॥

ఉ. ఆపటువిక్రమంబుఁ గని-యద్భుతమందిదినేంద్రసూతి సీ।
తాపతితోడ నిట్లనియె-దక్షుఁడ నీవు సఖుండ వౌటను,
న్నా పురుహూతముఖ్యసుర-లైనఁ జయింపఁగ లేరు చిత్తసం।
తాపము దీరఁ బఙ్క్తిముఖ దై-త్యునిఁ ద్రుంచెద సీతఁ దెచ్చెదన్ ॥౫౪॥

క. అనవుడు రఘునాథుఁడు నె।
మ్మనమున ముదముప్పతిల్ల-మార్తాండతనూ।
జనిజానుజసహితుండై।
చనియెం గిష్కింధకుఁ బుడు-సరభసవృత్తిన్ ॥ ౫౫॥

సీ. అంతఁ గిష్కింధాను-హాముఖంబున నిల్చి,
రవిపుత్త్రుఁ డగ్రజు-రాకఁ గోరి।
ప్రళయజీమూతంబు-పగిదిగర్జిల్లెనా,
ధ్వనియాలకించియ-వ్వాలి గినిసి।

రయమున నంతఃపు-రంబు వెల్వడి వచ్చి,
యనుజునితోడఁగ-య్యంబొనర్చ
బెట్టిదంబుగ వాలి-పిడికిట సుగ్రీవుఁ,
బొడిచినఁ గడునొప్పి-బడి తొలంగి

గీ. చని యొదశరథరాజనం-దనునికడను
సమ్మహీజాని సుగ్రీవు-నఱుతనొక్క
కుసుమమాలిక గదియించి-గుఱుతుచేసి
యపుడ పురికొల్పె వెండియు-నాలమునకు ౫౬

వ. ఇట్లు పురికొల్పుటయు సుగ్రీవుండు కిష్కింధా ద్వారంబుఁ జేరి భూరిగర్జితంబున వాలిం బిల్చి యతనితోడ బాహుయుద్ధంబు సేయుచుండె నంత ౫౭

క. చాపమున శరముఁ దొడగి మ
హీపతి నిండార దిగిచి-హెచ్చినవీర్యా
టోపమునఁ గూలనేసె భు
జాపటువిక్రమవినోద-శాలిన్ వాలిన్ ౫౮

ఆ. అట్లు వాలి నిహతుఁ-డైన కిష్కింధకు
నరిగి సకలవాన-రాధిరాజ్య
పట్టబద్ధుఁడగుచుఁ-బద్మాప్తసూనుఁడు
ద్వేలహర్షజలధి-నోలలాడె ౫౯

శా. అంతన్ భాస్కరనందనుండు కపిసేనాన్వీతుఁడై రామభూ
కాంతాగ్రేసరుపాదసన్నిధికి వేడ్కన్వచ్చి ధీరున్హనూ
మంతుం బిల్చి ధరాత్మజాన్వేదుకస-న్మానంబుతోఁ బంపెన
త్యంతాటోపసమగ్రుఁడై యతఁడు శ-క్రాదుల్ నుతుల్సేయఁగన్ ॥

క. వనరాశి దాటి లంకకుఁ
జని సీతం జూచి పవన-సంభవుఁ డనయం

బునమరలివచ్చెయాసతి।
పనిచినమానికము రామ-భద్రునకిచ్చెన్॥ ౬౧॥

వ. ఇట్లు హనుమంతుండిచ్చిన యామాణిక్యంబుం గనుంగొని హర్ష శోకపరవశుండై యప్పశుపతిచాపభంజనుండు సౌమిత్రిసుగ్రీవాంజనేయ నలనీలజాంబవత్ప్రముఖ కపివీరులతోడంగూడి యభిజిన్ముహూర్తంబునం బ్రయాణంబువెడలి వివిధగిరి సరిదరణ్యంబులు గడచిచనిముందట ౬౨॥

చ. కనియెరఘూద్వహుండుకట-కస్థలగాఢచరత్కరీంద్రసం।
జనితమదప్రవాహపరి-సర్పదమందసుగంధసాంద్రమున్।
ఘనమణిశృంగగానకల-నారతదేవఘనానిపాదని।
స్వనరచనాక్రమశ్రవణ-చండనగేంద్రమునమ్మహేంద్రమున్॥

గీ. అమ్మహేంద్రధరిత్రీధ్ర రమ్యగడచి।
చక్రతీర్థంబునకు నేగి-జనవిభుండు।
పొసఁగనచటవసించెన-ప్పుడుదశాస్యు।
ననుజుఁడైనవిభీషణుం-డటకువచ్చె॥ ౬౪॥

వ. నలుగురు మంత్రులతో నటకువచ్చిన యామ్మహాత్మునిఁజూచి సుగ్రీవునను గూఢచారుండను శంకవొడమి రఘువీరుండతని హితసముచితచేష్టలరసి దుష్టుండుగాఁడని తెలసి సంభావించియవ్విభీషణునను సకలరాజ్య పట్టాభిషేకంబు సేయించి రవిపుత్త్రనట్లమంత్రిప్రవరుంజేసి చక్రతీర్థంబుడాసి. ౬౫॥

క. చింతింపుచు రామమహీ।
కాంతుఁడుసుగ్రీవుఁడాది-గాఁగలకపిసా।
మంతులకునవనియెనీదు।
ర్దాంతపయోరాశియెట్లు-దాఁటుదమింకన్॥ ౬౬॥

క. జలనిధినుస్తరమికకపి।
బలములసంఖ్యమ్ములేయు-పాయమునకుం।

గలదియ్యెడమర్కటసే।
నలతోడంగూడియివ్వ-నధిదాఁటిచనన్॥ ౧౭॥

మ. అతిగంభీరపయఃపరిపూరముసము-ద్యన్మత్స్యసంచారము।
ద్గతనక్రగ్రహచక్రఘోరముమహో ధావత్కుళీరంబనా।
రతవాతాహ్వతనీలనీరధరవా-రంబియ్యకూపారమే।
గతిచెనిప్పుడుదాఁటువారమువనా-కస్సైన్యముల్ గొల్వఁగాన్॥

మ. ప్రళయాంభోధరగర్జితప్రతిభటప్రస్ఫీతనిర్ఘోషదో।
హాలమైదుస్సహబాడబజ్వలనగా ఢార్చిచ్ఛటాక్రాంతమై।
విలుఠద్వీచినటాంటుప్రచారణో-ద్వృత్తాభ్రమైయున్నయి।
జ్జలధిందాఁటనుపాయమెద్దివగునీ-శాఖామృగశ్రేణికిన్॥ ౧౯॥

క. శతయోజనవిస్తారం।
బతిఘోరముతిమితిమింగి-లాకరమంతే।
ద్గతనగమగునీసరితాం।
పతిఁగడువఁగవశమెమనకు-మతిచేనైనన్॥ ౨౦॥

గీ. తలఁచిచూడంగవిఘ్నముల్-తరుచుగలవు।
పుడమికన్నియనేరీతిఁ-బడయువాఁడ।
నధికసంకటమిచటసం-ప్రాప్తమయ్యెఁ।
గార్యసిద్ధికుపాయంబు-గానరాదు॥ ౨౧॥

గీ. అకటరాజ్యంబుగోల్పోయి-యడవిఁజేరి।
తండ్రిపోకకువగచిభూ-తనయఁబాసి।
యెంతయునుగాసిఁబొందితి-మంతకన్నఁ।
గడుఁబ్రయాసంబుమున్నీరుఁ-గడచుతెరఁగు॥ ౨౨॥

గీ. నీవురావణుఁదెగటార్చి-నిఖిలదోష।
శాంతికైగంధమాదన-శైలమునకు।
నరుగుమనియున్నగుంభజుం-డానతిచ్చె।
నమ్మహామునిభాషణం-బమృతమగునె॥ 23॥

తరల. అనిపురాంతకచాపభంజనుఁ-డానతిచ్చిన వాక్యముల్।
వినికృతాంజలులై వలీముఖ-వీరులర్క-సుతాదులు।
య్యనఘశీలునితోడ నిట్లని-రయ్య నావలు దెచ్చి సాం।
పెనయఁ దెప్పలుగట్టి దాఁటెద-మిమ్మహాలవణాంబుధిన్॥ ౭౪॥

వ. అప్పుడు కపిసేనలనడుమ నిలచి విభీషణుండిట్లనియె. ౭౫॥

క. శరధిన్ దశరథసూనుఁడు।
శరణొందుట సముచితంబు-సగరకృతంబీ।
కరుణాలయంబు తక్కు-ల।
పరిపాలకుఁడగుటఁదోడు-పడు రామునకున్॥ ౭౬॥

సీ. అనవుడు రఘురాముఁ-డగచరవీరుల,
నాదరింపుచుఁ బల్కె-ననఘులార।
తెప్పలచేఁ గపు-లిప్పయోనిధి నూరు,
యోజనంబులు దాఁట-నోపువారె।
పెక్కు-నావలుగల్గ విక్కపిసేనకు,
వైశ్యులగతిమన-వంటివారు।
కలములచే నబ్ధి-గడతురే గడచునో,
నెడచేసి పగవార-లిడుము సేతు।

గీ. రట్లు గావున మీయుపా-యంబు నాకు।
సమ్మతము గాదు మఱి విభీ-షణుని పలుకు।
మదికి నింపగుచున్నది-మార్గసిద్ధి।
కర్థితో నిప్పయోధిను-పాస్తి సేతు॥ ౭౭॥

గీ. పెంపుతో నిట్లు త్రోవఁజూ-పింపకున్న।
ననలగంధవహాత్యుజ్వ-లాస్త్రదీయ।
భాసురామోఘదివ్యాస్త్ర-పటలమునను।
నిమ్మహోదధిగురి జేసి యేపడంతు॥ ౭౮॥

క. అనిపలికి సానుజుండై।
జనకసుతావల్లభుండు-శాస్త్రోక్తవిధిన్।
వనధికి నెదురుగ నయ్యెడ।
ఘనకుశతల్పమున నుచిత-గతి శయనించెన్॥ ౨౯॥

క. మేదురదర్భాస్తీర్ణవ।
హోదధితీరమున రాఘ-వోర్వీనాథుం।
డాదరమున శయనించెన్।
వేదిపయి న్వెలుఁగు జాత-వేదుఁడు బోలెన్॥ ౩౦॥

చ. సురుచిర శేషభోగనిభ-శోభితసవ్యభుజోపధానుఁడై।
నరపతి నవ్యదర్భశయ-నంబున నొప్పుగఁ బవ్వళించి తా।
త్వరమతి తోడ సాగరును-బ్రార్థి యొనర్చు చునుండెఁ గావిభా।
వరులోకమూడు సూర్యకుల-వర్యునకుం గడిచెం గ్రమంబునన్॥

వ. ఇట్లు త్రిరాత్రోషితుండై నయమార్గంబు నదలక మార్గలాభంబు గోరి వారాశి నుపాసించిన నతండు మూఢభావంబునం బొడసూపకున్నం గోపరక్తాంతలోచనుండై రఘువీరుండు లక్ష్మణునితో నిట్లనియె.

క. పాయక యమోఘతరమ।
త్సాయకనిర్భిన్నమకర-సముదయములచేఁ।
దోయధి నిరుద్ధసలిలం।
బై యుండఁగఁ జేతు నిప్పు-డతివేగమునన్॥ ౩౩॥

మ. అనుజా నన్ను సమర్థుఁగాఁ దలఁచెనీ-యంభోనిధానంబు దు।
ర్జనుచో టస్సహనంబుయుక్తమగునే-సామంబు చేనాత్తద।
ర్పన మీనోపఁడు సాగరుండు వెసన-స్మత్క్రూరబాణాగ్ని నీ।
తని శోషింపఁగఁ జేతుఁ గోతులకుఁ బా-దన్యాసముల్గల్గఁగాన్॥ ౩౪॥

ఆ. మేర మీఱి నిక్కు-మిన్నందితరగల।
నలఘు యెల్లదిక్కు-లాక్రమించి।

మొనసియున్న యాస-ముద్రినడఁగింతు।
బాణవహ్ని శిఖల-పాలు జేసి॥ ౮౫॥

క. భూభారకరసురారిగ।
ణాభీలంబైనయీమ-హాంభోనిధిసం।
క్షోభితమొనరించెదఁగీ।
లాభీకరసాయకాన-లస్ఫురణమునన్॥ ౮౬॥

వ. ఇట్లుపలికి కోదండపాణియుం గ్రోధపర్యాకులేక్షణుండునై రఘుకులాధ్యక్షుండు త్రిపురసంహరణోద్యుక్తుండగు రుద్రుండువోలెఁగనుపట్టి చాపాకర్షణంబుఁజేసి శరంబులువిగుడించి జగంబులుగంపింప నతినిశితోగ్రవిశిఖంబులు మఱియును సముద్రంబునం బ్రయోగించిన నవియును బ్రజ్వలింపుచు ఘోరంబులై దశదిశలు వెలింగింపుచు మహాదానవసంకులంబగు సాగరంబుఁబ్రవేశించెనంత సముద్రుండు భీతచిత్తుండై కంపింపుచు దిక్కులేకపాతాళంబువలన వెడలివచ్చి కృతాంజలియై రాఘవునిశరణంబుఁజొచ్చి యిట్లనినుతించె. ౮౭॥

క. సురబృందసేవ్యములుసుఖ।
కరములహల్యాగ్రశాప-ఖండనరేణూ।
త్కరకలితములగునీపద।
సరసిజములుగొలుతురామ-చంద్రమహాత్మా॥ ౮౮॥

సీ. దండంబుతాటకా-తనువిదారణనీకు,
ప్రణతికౌశికయాగ-రక్షనీకు।
శంకరచాపభం-జనమస్కృతినీకు,
నభివాదనంబుమ-హాత్మనీకు।
జమదగ్నిసుతగర్వ-శమనజేజేనీకు,
నంజలిదైత్యసం-హారనీకు।

కేలు మోడ్చి కృపాల-వాలమానసనీకు,
వందనంబు మునీంద్ర-వరదనీకు।

గీ. రూఢఖరదూషణత్రిశి-రోనిశాట।
గహనదహనాయమానభీ-కరశరాస।
ముక్తదివ్యాస్త్రసముదాయ-మ్రొక్కు నీకు।
శరణు రఘురామ నిఖిలదు-ర్జనవిరామ॥ ౬౯॥

గీ. రఘుకులంబున దేవకా-ర్యంబు సేయ
నవతరించిన వారికి నా-రాయణునకుఁ।
బుండరీకాక్షునకు జగ-న్మూలమునకు।
భక్తిచే మ్రొక్కెదను రామ-భద్రనీకు॥ ౭౦॥

క. కోపంబు సంహరింపుము।
నీపదకమలములు గొలిచి-నిలిచిన నన్నుం।
జేపట్టుము మ్రొక్కెద నా।
చాపలము సహింపు రామ-సద్గుణధామా॥ ౭౧॥

వ. దేవా మహానుభావా! భావజజనక, జనకసుతా మనోహర, హరవిరించి పురందరాది సురపూజిత, జితదానవ, నవజలధరనీల, నీలకంఠచాపభంజన, జననాదివికారరహిత, హితమితసత్యమృదు మధురభాషాధురంధర, ధరణీభారహరణార్థకృతావతార, తారకబ్రహ్మస్వరూప, రూపలావణ్యవిలాసవినిర్జితకోటికందర్ప, దర్పాంధబంధకంధసింధురమృగరాజ, రాజశేఖర, ఖరదూషణాది రాక్షససంహార, హారకేయూరకిరీటకుండల కంకణాద్యలంకార శోభిత దివ్యమంగళవిగ్రహ, గ్రహరాజవంశాభిరామ, రామ, నావిన్నపంబుఁ జిత్తగింపుము, నా నేరములు సహింపుము. నా ప్రార్థనంబుఁ గైకొనుము, నన్ను రక్షింపుమని మఱియు నిట్లనియె. ౭౨॥

క. చెలువదొర వేయుమోములఁ।
గలిగియు నీగుణము లెన్నఁ గాలేఁడనఁగాఁ।

గలితభవద్గుణవర్ణన।
మలవిరతిమూవంటిజడుల-కాదినుపురుషా॥ ౯౩॥

గీ. భూజలాదికమగుపంచ-భూతతతికి।
నెద్ది సైజంబుగారచి-యించెధాత।
యట్టికట్టడివిడువక-నియమిలుము।
మత్స్వభావముగాధత్వ-మహిమసుమ్ము॥ ౯౪॥

క. రాగమునలోభమునభయ।
యోగంబుననైనన న్వయో-చితధర్మ।
త్యాగముకత౯వ్యముగుణ।
సాగరయీభాషణంబు-సత్యముగాడే। ౯౫॥

క. వనచరసేనలులంకకుఁ।
జనుటకు నేనాచరింతు-సాహాయ్యము నీ।
కనివిన్నపంబుఁజేసిన।
జనపతియిటులానతిచ్చె-జలనిధితోడన్॥ ౯౬॥

సీ. తరుచరవాహినీ-పరివారములతోడ,
జనియెదలంకక-శంకవృత్తి।
నిప్పుడజనపూర-మింకించితెరువిమ్ము,
నావుడిట్లనియెన-దీవిభుండు।
సావధానుండనై-యవధరింపుము దేవ,
వినిసేయవలసిన-పనియొనర్చు।
మయ్యనీయాజ్ఞని-ట్లాచరించితినేని,
కార్ముకవిద్యాప్రగల్భులైన।

గీ. ఘనులునిటువలెనియమింపఁ-గలరునన్ను।
గానఁదరణారమొక్కటి-గలదుపాయ
మదివచించెదవిశ్వకర్మా-త్మజుండు।
వానరుండిందునలుఁడను-వాఁడుగలఁడు॥ ౯౭॥

గీ. శిల్పిసమ్మతుఁడధికుఁడ-నల్పబలుఁడు।
హరికులశ్రేష్ఠుఁడతఁడు నా-యందు వైచు।
తృణశిలాదారుబృంద మొ-ద్దికధరించు।
నదియుదృఢముగ సేతు వై-యమరియుండు॥ ౯౮॥

క. ఆ సేతుమార్గమున సే।
నాసహితుఁడ వైనిశాట-నాథునిపురికి।
బ్జాసనవందితచరణమని।
యా సాగరుఁడరిగెనంత-నంతర్హితుఁడై॥ ౯౯॥

ఉ. అంతట జానకీరమణుఁ-డంచిత బాహుబలున్ నలున్ దృఢ।
స్వాంతుని(జూచిరమ్ముకపి-వర్య రచింపుము సేతుబంధమ।
త్యంతదృఢంబుగా జనకు-నంతటివాఁడవు శిల్పశక్తిని।
శ్రాంతవినిర్మలోన్నతయ-శంబులు జేకురునీకు నీక్రియన్॥ ౧౦౦॥

చ. అనవిని జానకీపతికిఁ-బ్రాంజలియైపలికెన్నలుండుమ।
జ్జనకుఁడు విశ్వకర్మకడుఁ-జక్రిని మందిరశైలసీమమ।
జ్జననికి ముందుదావరమొ-సంగెను మత్సమవీర్యుఁడైననం।
దనుఁడు జనించు నీకనుచుఁ-దామరసప్రియవంశదీపకా॥ ౧౦౧॥

క. ధీరుఁడగు విశ్వకర్మకు।
నారసపుత్త్రుఁడన శక్తి-నతనికి సముఁడన్।
వారక నేనర్తించెద।
పారావారమున సేతు-బంధనమధిపా॥ ౧౦౨॥

సీ. అనివిన్నవించిన-వినియన్న రేందుఁడు,
శుభవాసరంబున-శుభముహూర్త।
సమయంబునందుఁగుం-జర రాజవదనులం,
బోదరు హేరంబు-వేద వేద్యు।
నావాహనముఁ జేసి-హారిమాణిక్యసిం,
హాసనంబుననుంచి-యర్ఘ్యపాద్య।

పంచామృతస్నాన-భవ్యకృత్యముదీర్చి,
గంధంబులందియ-క్షతములొసఁగి।

గీ. లలితదూర్వాంకురంబులు-నలినకుముద।
చంపకాశోకపున్నాగ-జాతివకుల।
పాటలాదిప్రసూనము-ల్భత్తినొసఁగి।
ధూపములదీపములనునం-తుష్టిసలిపి॥ ౧౦౩॥

వ. అనంతరంబ జంబూ రంభా కపిత్థ ఖర్జూర పనస నారికేళ బదరీ చూతఫలపుండ్రేక్షుగోక్షీరదాక్షారసక్షౌద్రఘృతపాయసమోదుకాపూప బహువిధభక్ష్యసమన్విత మహోపహారంబులు సమర్పించి సకలోపచారంబుల సపర్యగావించి యనేక పరికారంబులం గైవారంబులొనర్చి గణపతిం బ్రసన్నునింజేసి. ౧౦౪॥

గీ. అంతమిథిలేశకన్యకా-ప్రాణనాథుఁ।
డచటనున్నమహాదేవి-నాదిశక్తి।
మహిషదానవమర్దని-మహితచరిత।
నధికభక్తినిఁగొల్చిత-దాజ్ఞవడసి॥ ౧౦౫॥

క. వాణీపతిముఖసురసం।
త్రాణైకధురీణమైన-తనహస్తమునన్।
క్షోణీనాథుఁడునవపా।
షాణస్థాపనముఁజేసె-జలనిధిలోనన్॥ ౧౦౬॥

క. ఈరీతిసేతుబంధ।
ప్రారంభముఁజేసిరామ-భద్రుఁడుదన్వ।
త్తీరంబుననలరచితమ।
హారమ్యసుభద్రపీఠి-కాసీనుండై॥ ౧౦౭॥

సీ. బలవంతులైనట్టి-ప్లవగవీరులఁజూచి,
సేతునిర్మాణంబు-సేయుఁడనిన।

నట్టివారునుగరు-డానిలవేగులై.
నలుగడనున్న కా-నలకు నేఁగి।
గిరులునుదరులును-గిరిశృంగములుఁదరు,
శాఖలుదారుపా-షాణతతులుఁ।
దృణభారములుసారె-దెచ్చినవానినిఁ,
గైకొనియలవిశ్వ-కర్మసుతుఁడు।
గీ. నలుఁడుమున్నీటిపైఁజేర్చి-నిలిపిశిల్ప।
సమయపద్ధతిదశయోజ-నములుపరుపు।
నెమ్మిశతయోజనంబులు-నిడుపునమర।
సేతువొనరించెనధికసు-స్థిరముగాఁగ॥ ౧౦౭॥
క. బుధులునుతింపఁగలవణాం।
బుధిపైఁగట్టించెఁబదిల-ముగరాఘవుఁడీ।
వ్విధమునసేతువులంకా।
పధిగానలముఖ్యకీశ-వర్యులచేతన్॥ ౧౦౯॥
గీ ఇట్టిసేతువునకుఁజని-యెట్టిపాప।
కర్మలునుముక్తదోషులై-ధర్మయుక్తి।
నఖిలవాంఛితభోగంబు-లనుభవించి।
ముక్తిఁగాంతురుతాపస-ముఖ్యులార॥ ౧౧౦॥
క. దానతపోవ్రతహోమవి।
ధానంబులచేఁబ్రసన్న-తంజెందఁడుగా।
రీనాయకుండుసేతు।
స్నానంబునఁజెందుకరణి-సన్మునులారా॥ ౧౧౧॥
క. భానునితేజముతోడస।
మానంబగుతేజమొకటి-మఱిలేనిగతిన్।
జ్ఞానప్రదమగుసేతు।
స్నానమునకుసాటిపుణ్య-చయమున్నదియే॥ ౧౧౨॥

గీ. రూఢిరఘుపతిచేత నా-రూఢమైన।
వలవినిర్మిత సింహాస-నంబు గాంచి।
మ్రొక్కు నెవ్వాఁడు పులకిత-మూర్తి యగుచు।
నతనికిలభించు మోక్షసిం-హాసనంబు॥ ౧౧౩॥

గీ. తనరుఁబడమటికోణంబు-దర్భశయ్య।
తూర్పుకోణంబు మెఱుఁగుడు-దుర్గపురము।
సేతుమూలంబులనిరెండుఁ-బాతకార్తి।
భంజనసమరములు మహా-పావనములు॥ ౧౧౪॥

క. సీతారామునిఁబరము।
జ్యోతిర్మయునాత్మఁదలచు-చున్నన్నగవి।
ఖ్యాతశుభహేతువునకున్।
సేతువు-కునరులుబ్రణుతి-సేయఁగవలయున్॥ ౧౧౫॥

శ్లో॥ రఘువీరపదన్యాస పవిత్రీకృతపాంసవే।
దశకంఠశిరచ్ఛేద హేతవే సేతవే నమః॥ ౧౧౬॥

శ్లో॥ సేతవే రామచంద్రస్య మోక్షమార్గైకహేతవే।
సీతాయామానసాంభోజ భానవే సేతవే నమః॥ ౧౧౭॥

క. అనుమంత్రములఁ బఠించుచు।
మునుపుగఁ దైర్థికులు సేతు-మూలంబుఁగనుం।
గొనిసాష్టాంగనమస్కృతు।
లొనరింపఁగవలయుభక్తి-యోగము పేర్మిన్॥ ౧౧౮॥

వ. ఈప్రకారంబున శ్రీరామునిచేత నిర్మితంబగు సేతుబంధంబున ననే
కకోటి తీర్థంబులుగలవు వానినామంబులు, సంఖ్యయును వాక్రు
చ్చివర్ణింప శేషుండును సమర్థుండుగాఁడు. చతుర్వింశతి తీర్థంబు
లు ప్రధానంబులైయుండు. చక్రతీర్థంబును, బేతాళవరదంబును,
పాపవినాశనంబును, సీతాసరంబును, మంగళతీర్థంబును అమృ
తవాపికయు, బ్రహ్మకుండంబును, హనూమత్కుండంబును, అగ

స్త్యతీర్థంబును, రామతీర్థంబును, లక్ష్మణతీర్థంబును, జటాతీర్థంబును, లక్ష్మీసరంబును, అగ్నితీర్థంబును, చక్రతీర్థంబును, శివతీర్థంబును, శంఖతీర్థంబును, యామునతీర్థంబును, గంగాతీర్థంబును గయాతీర్థంబును, కోటితీర్థంబును, సాధ్యామృతంబును, మానసంబును, ధనుష్కోటితీర్థంబును, సేతుమధ్యగతంబులై ప్రకాశించు వీనిలక్షణంబులు వివరించెద. గాలవుం డను మునీశ్వరుఁడు విష్ణుపూజాపరుండై దక్షిణతీర సముద్రతీరంబున దపంబు సేయుచు నొక్కనాఁ డొక్క రక్కసుని చేతం జిక్కువడి కావవే యని హరిం బ్రార్థించిన హరిప్రేరితంబై సుదర్శనచక్రం బారక్కసుని దునిమి యమ్మునిఁ గాపాడి యాతీర్థంబున సన్నిహితంబైయుండెనది చక్రతీర్థంబనం బరఁగె. దానిం దలంచినవారికి గర్భవాసంబు గలుగ నేరదు సుదర్శనుం డను విద్యాధరసుతుండు గాలవముని కన్యకం గాంతిమతియను దానిం జూచి కామమోహితుండై కేశాకర్షణంబుఁ జేసిన నమ్మునియలిగి భేతాళత్వంబుఁ జెందుమని శపించె నతం డట్లు భేతాళుండయి కొంతకాలంబు పరిభ్రమించి పుణ్యవశంబున సేతువునకుం జని చక్రతీర్థసమీపంబునం గల యొక్క తీర్థంబు తటంబున నిల్చి తజ్జలశీకరస్పృష్టగాత్రుండై శాపమోక్షంబునొంది దివంబునకుం జనియె నది భేతాళవరదంబయ్యె. తొల్లి దృఢమతి యను శూద్రునకు వైదికకర్మోపదేశంబుం జేసి సుమతియను విప్రుండు చిరకాలంబు నరకంబు లనుభవించి నీచయోనులం బుట్టి క్రమంబున బ్రాహ్మణుండయి జనించి బ్రహ్మరాక్షసుండయ్యె. తద్బాధంబు సహింపక యతనితండ్రి యగస్త్యునిశరణొంది యాముని చెప్పినచొప్పున సేతువునకుం బోయి తనపుత్త్రునొక్కతీర్థంబున ముంచె నందువలన నతండు రక్షోముక్తుండయ్యె నా శూద్రుండును బెద్దకాలంబు నరకంబులనుభవించి గృధ్రంబై పాదమియొక్క వాఁడు తత్తీర్థజలపానంబుఁ జేసి పాపముక్తుండయ్యె నిట్లు పాపం

బులనశింపఁజేయుటఁ బాపవినాశంబనఁ నొప్పె. రాఘవప్రత్యాగా
రంబు సీతామహాదేవి వహ్నిప్రవేశంబుఁ జేసి వెడలి వేల్పులువొగ
డ నొక్క తీర్థంబు నిర్మించి యందు స్నానంబుఁ గావించె దానివలన
నాతీర్థంబునకు సీతాసరంబను నామంబుగల్గె నందుఁ గృతాభిషే
కుండై పాకశాసనుండు బ్రహ్మహత్యావిముక్తుండయ్యె నిది సీతాస
రోమహిమంబు మనోజవుండను రాజు పాపకర్మవశంబున రాజ్య
భ్రష్టుండై యడవులంబడి యిడుమలపాలై పరాశరహితోపదేశం
బున సేతువుఁ జేరి మంగళతీర్థంబున మాసత్రయంబు గ్రుంకి మహా
నుభావుండై రిపులఁ ద్రుంచి యిష్టభోగంబులు భుజించి శరీరాంతం
బునం గైవల్యంబుఁ గాంచె నందు సీతారాములు లోకరక్షార్థంబు స
న్నిహితులై యుండుదురు సర్వమంగళకారణంబగుట నిది మంగళతీ
ర్థంబయ్యె హిమవత్పార్శ్వంబున నగస్త్యభ్రాతభూతేశుం గూర్చి
తపంబు జేసినం బ్రత్యక్షుండై విరూపాక్షుండు ముముక్షుండగు
నమ్మునిం జూచి సేతుమధ్యంబున మంగళతీర్థంబు సన్నిధి నొక్క మ
హాతీర్థంబుఁ గలదు దానియందు స్నానంబు సేయుము ముక్తిం బొం
దెదవని బోధించె నతండట్లయేఁగి మూఁడేండ్లు స్నానంబుఁ గావించి
యంత ముక్తిం జెందె అగస్త్యభ్రాత యమృతుండైన కారణం
బున నది యమృతవాపియయ్యె. తొల్లి బ్రహ్మవిష్ణులకుఁ గలహం
బు జనించె నయ్యెడ నయ్యిద్దఱకు నడుమ నొక్క జ్యోతిర్మయలింగం
బుద్భవించె దానియాద్యంతంబులు చూచినవాఁడ జగత్కర్తయ
గునని సమయంబుఁ గావించి హంసవరాహరూపంబులు ధరించి
వారు చనిరంత గోవిందుండు మరలివచ్చి చూడనైతినని సత్యంబు ప
లికె. నలువవచ్చి లింగంబుతుదఁ జూచితినని యనృతంబు వలికె నది
సహింపక యపూజ్యుండవు గమ్మని విధికి శాపంబిచ్చి నంత బ్రహ్మ
దేవుండు శివుని బ్రార్థించినం బ్రసన్నుండై గంధమాదనపర్వతమం
దు యాగంబు సేయుము దీననీకు మిథ్యావాదదోషంబు నశించు

శ్రౌతస్మార్తకర్మంబులుఁ బూజలుఁ గలుగునని చెప్పినట్లు బహుయ
జ్ఞంబుల ననుష్ఠించి పరమేష్ఠి కృతార్థుండయ్యె నయోధ్యాగ్రపాలంబుఁ బ
స్త్రకుండంబనంబరగ అందు నఘనాశనంబు బొవరించు వాయున
దత్కుండధిసితంబు ధర్మసఖుం డను రాజపుత్త్రికుండై గురూ
పదేశంబున సేతువునకుం జని హనూమత్కుండంబుఁ జేరి తీరంబు
నం బుత్త్రికామేష్టి యాచరించి శతభార్యలయందు శతపుత్త్రు
లం బడసి చిరకాలంబు రాజ్యంబు పాలించి పుత్త్రులకు రాజ్యం
బు విభజించి హనూమత్కుండంబుఁ జేరి సభార్యుండై తపంబుఁ జే
సి శివసాయుజ్యంబుఁ గాంచె నిది హనూమత్కుండ ప్రభావంబు
కతువంతుండను తాపసుండు తొల్లి యుదంకునన్నిధి సాంగవే
దాధ్యయనంబుఁ జేసి తగుపదిష్ట ప్రకారంబున గంధమాదనంబున
కేగి అగస్త్యతీర్థంబునం బ్రత్యహంబు స్నానంబు సేయుచుమూఁ
డేండ్లుండి యంతం దత్తీర్థజలవినిర్గతంబైన చతుర్దంతగజంబు లెక్కి
యమ్మునికుమారుండు మధురాపతియైన స్వనయభూపతిం గాంచి,
యతనిచేత నభినందితుండై యా రాజకన్యక మనోరమ యనుదా
నిం బెండ్లియై గృహస్థధర్మంబు లనుష్ఠించె నిది యగస్త్యతీర్థవైభ
వంబు. కుంభసంభవుని శిష్యుండు సుతీక్ష్ణుండు రామమంత్రో
పాసనాగ్రేసరుండయ్యెఁ దత్తీరతటంబున రామచంద్రుండు శివ
లింగంబు నిల్పి లోకానుగ్రహార్థంబుఁ బూజించె నా సరోవ
రంబునం గృతమజ్జనుండై ధర్మజుం డనృతవచనదోష నిర్ము
క్తుండై రాజ్యంబుఁ బాలించె నిది రామతీర్థప్రభావంబు. బలభ
ద్రుండు నైమిశారణ్యంబునకుం జని మునులకు నఖిలపురాణకథలు
వచింపుచున్న సూతుం బ్రమాదంబున వధించి యోగబలంబునం బు
నరుజ్జీవితుం జేసి దోషనివృత్తికై గంధమాదనంబునకుం జని లక్ష్మణ
వినిర్మితంబగు తీర్థంబున మునింగి లక్ష్మణేశ్వరలింగంబు దర్శించి

బ్రహ్మహత్య నశింపఁజేసె నాతీర్థంబు శోకదారిద్ర్య మహా పాపవినాశనంబిది. లక్ష్మణతీర్థమాహాత్మ్యంబు. రావణుం ద్రుంచి రాఘవుం డేతీరతోయంబున జటాక్షాళనంబుఁ జేసె నది జటాతీర్థంబయ్యె నందవగాహంబు సేయువారికిఁ జిత్తశుద్ధి సిద్ధించు నని రాఘవుండు వరంబిచ్చె వరుణపుత్త్రుండు భృగుండును, వ్యాసపుత్త్రుండు శుకుండును, గురూపదేశంబునం జేసి వచ్చి తజ్జలంబులం దోఁగి చిత్తశుద్ధిఁ బడసిరి తజ్జలావగాహమాత్రంబున మనశ్శుద్ధి సంభవించు నిది జటాతీర్థాతిశయంబు తొల్లి కుబేరుం డేతీరంబు సేవించి నిధీశ్వరుం డయ్యె నది లక్ష్మీప్రదంబగుట లక్ష్మీతీర్థంబున విఖ్యాతి నొందె నందుఁ గృతస్నానుండై నలకూబరుండు రంభాసంభోగంబుఁ గాంచె ధర్మజుండునుఁ గృష్ణోపదేశంబున నిమజ్జనమాచరించి పుణ్యవైభవంబున దిగంతంబులు గెల్చి రాజసూయంబనుష్ఠించి చక్రవర్తి యయ్యె నిది లక్ష్మీతీర్థ సముత్కర్షంబు. రావణవధానంతరంబున రాఘవుండు సురమునివానర సమేతంబుగా సేతుమార్గంబున గంధమాదనంబునకు వచ్చి సీతాశోధనార్థం బుచ్చోట నగ్నిదేవునావాహనంబుఁ జేసె నా ప్రదేశంబగ్నితీర్థంబయ్యె నది మహాపాతకశోధనంబును బిశాచత్వాదిమోచనంబును మహాతీర్థంబనునిది యగ్నితీర్థప్రశంస. పూర్వకాలంబున గంధమాదనశైలంబున సుదర్శనచక్రంబుఁ గూర్చి యహిర్బుధ్న్యుండను మహర్షి తపంబుఁ జేసె నది సహింపక రాక్షసులతని బాధింపఁ జక్రంబు వారిం ద్రుంచి మునిరక్షణార్థము నిరంతరంబు నేతీర్థంబున నిల్చె నది చక్రతీర్థనామంబుఁ బూనె నందుఁ గ్రుంకినవారికిఁ గోర్కెలు లభించు నంధ మూక బధిరత్వాది వైకల్యంబుల్ దొలంగు నిది చక్రతీర్థఘనత్వంబు. జగత్కర్తృత్వాహంకారదూషితుండగు నజుని పంచమముఖంబు ఛేదించి శివాంశభవుండు భైరవుండు హత్యాదోషనివృత్తికై సర్వతీర్థంబులు సేవించి కాశికిం బోయియే

కభాగావశిష్టంబగు హత్యాపాపంబుతోడ గంధమాదనంబునకుం జని శివతీర్థ సేవఁజేసి నిశ్శేషనష్టపాతకుం డయ్యె నిది శివతీర్థ ప్రభావంబు. శంఖుండనుమునిముఖ్యుఁ గంధమాదనంబునం దపంబుసేయుచు స్నానార్థం బచ్చోట నొక తీర్థంబు గల్పించె నది యతనిపేర శంఖతీర్థంబనందగె. తల్లిదండ్రుల నవమానించువారును గృతఘ్నులును నందొకమారు స్నానంబుఁ జేసి ముక్తుల గుదురిది శంఖతీర్థమహిమ. చైత్యుండు సంయుగ్వంతుండు, రైక్వుండు నను పర్యాయనామంబుల నెగడిన మునివరుండు గంధమాదనగిరియందుఁ దపంబుసేయుచుండ మంత్రబలంబునచ్చోటికి గంగాయమునాగయా తీర్థంబుల నాకర్షించియందు నభిషవంబొనర్చె నమ్మహాయోగి ప్రసాదంబున జానశ్రుతియను రాజు తత్తీర్థత్రయాభిషేకంబుఁ జేసి శుద్ధచిత్తుండై ముక్తిం జెందెనిది యమునాగంగాగయాతీర్థ వైభవంబు. రాఘవుండు గంధమాదనంబున శివలింగంబు నిల్పి ధనుష్కోటిచే భూతలంబు భేదించి తద్వివరనిర్గత గంగాతోయంబుల రామేశ్వరు నభిషేకించె దానివలనఁ గోటితీర్థం బయ్యె నందు స్నానంబుఁ గావించి గంధమాదనంబు వీడ్వక తైర్థికుండు మగుడవలదు నది సకలతీర్థరాజంబిది కోటితీర్థమాహాత్మ్యంబు. పురూరవుండను చక్రవర్తి సాధ్యామృత సేవఁ గాంచి యూర్వశీసంభోగసుఖంబుల ననుభవించె నందు నఘమర్షణమాత్రంబున యజ్ఞదాన తపోబ్రహ్మచర్యాదులవలనం గలుగు సుగతి లభించు దాని మహిమంబు తెలిసన కాదులకుఁ జతుర్ముఖుండు వివరించెనిది సాధ్యామృత వైభవంబు భృగువంశజుండైయున సుచరితుండను మునిజాత్యంధుండు గావునఁ దీర్థయాత్ర సేయ శక్తుండుగాక గంధమాదనంబున శంకరునుద్దేశించి తపంబుఁ జేసెనంత నమ్మునికిఁ బ్రత్యక్షంబై శివుండు వరంబు వేఁడుమనిన సర్వతీర్థస్నానంబు సేయుట నాకభిమతంబని వి

స్నపించిన నట్లు శంకరుండు సర్వతీర్థంబుల నాహ్వానంబుఁ జేసి స్నానంబు సేయుమని యాజ్ఞాపించెనామునియు నట్లు కృతాభిషేకుండై మహాసుందరమూర్తియై తత్తీర్థంబుఁ గీర్తించె నందు స్నానమాత్రంబునం గైవల్యంబులభించు. శివుండు తన మానసంబుచేతం దీర్థంబుల నెల్ల సాకర్షించెఁ గావున మానసతీర్థాభిధానంబునుం గలిగె నిది మానసతీర్థమాహాత్మ్యం బింక ధనుష్కోటితీర్థవైభవంబు వివరించెదఁ దదీయస్మరణమాత్రంబున బ్రహ్మసాయుజ్యంబు గలుగునని యిట్లనియె. ౧౧౯॥

సీ. అంధతామిస్రము-హారౌరవాదిదు,
ర్గమజాతయాతనా-ఖండనంబు।
మహితాశ్వమేధాది బహుధాధ్వరక్రియా,
తతిపుణ్యవిభవసం-ధాయకంబు।
భువనాభిసురతునా-పురుషప్రభృతిమహా,
దా. ఫలోత్కర్ష-దాయకంబు।
బ్రహ్మహత్యాసురా-పానహేమస్తేయ,
గురుతల్పగమనాఘ-కోటిహరము।

గీ. బ్రహ్మచర్యోపవాసాది-పరమనిగమ।
గమ్యబహువిధపుణ్యలో-కప్రదంబు।
కామితార్థవితరణ-కల్పతరువు।
ధీరులారధనుష్కో-టి-తీర్థవరము॥ ౧౨౦॥

ఉ. రావణునాజిఁ ద్రుంచి ఘను-రాముఁడులంకకునవ్విభీషణున్।
శ్రీవిలసిల్లఁగానధిపుఁ-జేసి సురాసురసిద్ధసాధ్యసం।
ఘావృతుఁడై వెసన్మరలి-యంచితభూతనిగంధమాదన।
గ్రామముఁజేరెలోకములు-రంజిలసేతుమహాపదంబునన్॥ ౧౨౧॥

సీ. అంతరామునిఁజూచి-ప్రాంజలియైసత్య.
భాషణుండైనవి-భీషణుండు।

పరీక్షిత్ దేవనీ-భక్తునివిన్న ప,
మవధరింపుముపీరు-లైనయాన్య।
మనుజేశులును సేతు-మార్గంబువలనలం,
కనువవ్విపీడింపఁ-గలదుగానఁ।
జెలఁగిధనుష్కోటి-చేసెను భేదనం,
బాచరింపుముకరు-ణార్ద్రచిత్త॥

గీ. అనుచుఁబ్రార్థింపగాకనుఁ-డట్లచేసె।
నందువలనధనుష్కోటి-యయ్యెదాని।
దర్శనంబునజంతుసం-తతికిముక్తి।
గలుగునవగాహఫలమేమొ-తెలియరాదు॥ ౧౨౨॥

గీ. రామ కరచాపకోటిని-రచితసేతు।
రేఖకైలాసమునకువి రించిలోక।
మునకు వైకుంఠపట్టణం-బునకుస్వర్గ।
మునకుఁదెలుపదితాపస-ముఖ్యులార॥ ౧౨౩॥

వ. మఱియు బ్రహ్మవిష్ణుమహేశ్వరులును, వాణీలక్ష్మీపార్వతులును, వసురుద్రాదిత్యవిశ్వమరుదశ్వ గంధర్వకిన్నరకింపురుషాదులును పితృదేవతలును, దశకోటి తీర్థగణంబులతోడ ధనుష్కోటి తీర్థంబునసన్నిహితులై వసింతురు, దేవమునిగంధర్వాదు లందుఁ దపంబుఁగావించి మహాసిద్ధిం జెందిరి. తజ్జలంబులం బితృదేవతాతర్పణంబు సేయువారు సర్వపాపముక్తులై సత్యలోకంబునం బూజనొందుదురు. భక్తిపూర్వకంబుగా నచ్చోట నొక్కభోజంబిడినవారికి ననంతఫలంబుసంభవించు సేవాతీరంబునం దపంబును, గంగాతటంబునమరణంబును, కురుక్షేత్రంబున దానంబును, మహాపాతకంబుల నశింపఁజేయు. ఏతత్త్రయంబును ధనుష్కోటియందుఁ బ్రాప్తంబయ్యేనేని ముక్తినొసంగు. సకలాభీష్టంబులుసిద్ధించు. ధనుష్కోటిస్నానంబేకవారంబైన నాచరించినవారికి సి

తా సితసరిత్తోయంబుల నేమిప్రయోజనంబు. ధనుష్కోటి దర్శించిన ధన్యులకుం గాయక్లేశకరంబులగు తపోయాగాధ్యయనతీర్థాటనంబుల నేమిలాభంబు. ధనుష్కోటితీర్థంబుతోడ సమానంబగు తీర్థంబు లోకత్రయంబునం గలుగదు. సత్యంబు చెప్పితి నిది ధనుష్కోటితీర్థవైభవం బీతెరంగున సేతుబంధ నిబంధనప్రకారంబును. చతుర్వింశతితీర్థవైభవంబును సంగ్రహప్రకారంబున మీకు వివరించితి. సవిస్తరంబుగా వచింప ననేకయుగంబులకైన శక్యంబు గాకయుండు. నీయుపాఖ్యానంబు సుచిత్తంబుగా విన్నవారికిం జతుర్విధ పురుషార్థంబులు సిద్ధించునని సూతుండు చెప్పిన శౌనకాదిమహామునులు శ్రీరామేశ్వరశివలింగవైభవంబు వచింపుమని ప్రార్థించిన.

మ. కనకక్ష్మాధరచాపపాపభయహృ-త్కల్యాణచారిత్రమి।
త్రనిశాధీశకృశానులోచనయనం-తప్రస్ఫుటానందచం।
దనకుందేందుసితాంగమంగళకరో-దంచత్కృపాపాంగభృం।
గనవేందీవరనీలకంధరనిరా-ఘాటప్రభావోన్నతా॥ ౧౨౫॥

క. తరుణతరశశిరకరశే।
ఖరసరసిజభవశతార-కరముఖనిఖిలా।
మరమకుటఘటితమణిఘృణి।
పరిషద్రుచిరుచిర-చరణ-పంకజయుగళా॥ ౧౨౬॥

మాలిని. శ్రితకమలపతంగా-శ్రీశివాసంయుతాంగా।
ధృతతరుణకురంగా-దివ్యగోరాట్తురంగా।
రతిపతిమదభంగా-రాజభాస్వద్రథాంగా।
క్షితిరచితశతాంగా-చెన్నమల్లేశలింగా॥ ౧౨౭॥

గద్య:— ఇది శ్రీమదుమామహేశ్వర కరుణాకటాక్షవీక్షాపాత్ర, యేనుగ లచ్చయామాత్యపౌత్ర, తిమ్మనామాత్య పుత్త్రి, వివిధ విద్వజ్జనవిధేయు, లక్ష్మణకవినామధేయప్రణీతంబయిన రామేశ్వరమాహాత్మ్యంబను మహా ప్రబంధము నందుఁ బ్రథమాశ్వాసము.

శ్రీ. శ్రీ. శ్రీ.

శ్రీరస్తు.

# రామేశ్వరమాహాత్మ్యము.

## ద్వితీయాశ్వాసము.

---




మత్సమస్తసుజన।
పేరిమాస్పదభద్రిరాజు-భీమయసుతమ।
ల్లామాత్యనిత్యవైభవ।
క్షేమప్రదపార్వతీశ-శ్రీమల్లేశా॥ ౧॥

వ. అవధరింపుము శౌనకాదిమహర్షులకు సూతుం డిట్లు శ్రీరామేశ్వర లింగవైభవంబు వచింపందొడంగె. ౨॥

క. రామస్థాపితలింగం।
బేమానవుఁడేకవార-మీక్షించునతం।
డోమునులార శశాంకశి।
ఖామణిసాయుజ్యమొందు-గతకల్మషుఁడై॥ 3॥

సీ. మునులారకృతయుగం-బునదశవత్సరం,
బులచేతనగునట్టి-పుణ్యఫలము।
సాధించఁబడుమహా-జనులచేనొకవత్స,
రంబునఁద్రేతాయు-గంబునందు।
మాసంబుచేతన-మ్మహితపుణ్యముసంభ,
వించుద్వాపరయుగ-వేళయందు।
నొకవాసరముననఁ-య్యున్నతసుకృతంబు,
కలికాలమునశీఘ్ర-గతిలభించు।
గీ. ప్రతినిమేషంబుఁదత్పుణ్య-ఫలముకోటి।
గుణితమగుచునిరూఢిచే-కురునురామ।
నాథశివలింగసందర్శ-నంబుసేయు।
వారలకుసంశయముసేయ-వలదువలదు॥ ౪॥

క. రామేశ్వరలింగంబున।
ధీమన్నుతసకలపుణ్య-తీర్థములుసమ।
స్తామరపితృదేవముని।
స్తోమములువసించునెపుడు-సువ్రతులారా॥ ౫॥

గీ. అరితోమూఁడువేళల-నైనరెండు।
వేళలందైనమతియొక-వేళనైన।
రామలింగంబుఁదలఁచువా-రలకుఘోర।
పాపమునశించునిర్వాణ-పదముగలుగు॥ ౬॥

గీ. రామచంద్రసమర్చిత-రామలింగ।
నామసంస్మరణంబున-నఘులకెల్లఁ।

ప్రబలమైనట్టియమదూత-భయముదొలఁగు।
నఖిలతీర్థాభిషేకపు-ణ్యములభించు॥ ౭।

క. శ్రీరామేశ్వరలింగస।
మారాధనమాచరించు-మనుజులుమనుజుల్।
గారుమహేశ్వరమూర్తులు।
వారకమదిసంశయంబు-వలదియ్యెడలన్॥ ౮॥

గీ. హేళితోఁదానురామలిం-గార్చనంబు।
సేయఁడెవ్వాఁడుదుర్మార్గ-శీలుఁడగుచు।
వాఁడుపెక్కేండ్లుదరిలేని-వనటఁజెందు।
ఘోరగంభీరసంసార-కూపమునను। ౯॥

ఉ. పూనికరామచంద్రపరి-పూజితునవ్యయురామనాథునీ।
శానునిఁజూచునెవ్వఁడొక-సారెతపోనిధులారవానికిన్।
దానతపోధ్వరవ్రతవి-ధానములేటికివన్యదేవతా।
ధ్యానములేటికిన్వివిధ-ధర్మములేటికికర్మమేటికిన్॥ ౧౦॥

చ. శ్రుతిమయురామనాథుఁదన-చూడ్కులకింపుగఁజూడఁడేనరుం।
డతఁడుజడుండుమూఢుఁడత-డంధుఁడతండుకరాంఘ్రివర్జితుం।
డతఁడుదరిద్రుఁడాతఁడురు-జార్తుఁడతండుఖలుండతండుత।
త్సుతధనధాన్యమందిరప-శుప్రకరంబునశించునెంతయున్॥ ౧౧॥

ఉ. మానుగదుర్లభంబయిన-మానుషజన్మముఁబూనిభూమిలో।
మానవులెవ్వరేనిఫణి-మండనమండితురామనాథుఁబం।
చాననుగాంచిమ్రొక్కివిన-యంబునఁబూజలొనర్తురాజనుల్।
మానివరేణ్యులారమతి-మత్ప్రియుల్కృతకృత్యులిద్ధరన్॥ ౧౨॥

గీ. రామనాథునిఁద్రిభువన-స్వామిఁదలఁచు।
వారలకుఁబూజనముసేయు-వారలకును।
బద్మలోచనపద్మసం-భవపురంద।
రాదిసురపూజనంబుని-రర్థకంబు॥ ౧౩॥

గీ. ఆవని రామేశశివభక్తు-లైననరుల।
యందు నెవ్వారలకుభక్తి-యమరియుండు।
వారుచూడరుభేదమే-వంక నైనఁ।
జనరుదారుణసమవర్తి-సదనమునకు॥ ౧౪॥

గీ. విప్రహత్యాసహస్రంబు-విలయమొందు।
మద్యపానాయుతంబులు-మడసిపోవుఁ।
కాంచనస్తేయగురుతల్ప-గమనదోష।
లక్షలునశించురామేశు-వీక్షణమున॥ ౧౫॥

మత్తకోకిల.

భూరిసంతతభోగలాభముఁ-బూజ్యనిర్జరరాజ్యముల్।
గోరుధీరులుచంద్రశేఖరు-గూఢపాద్గుణకార్ముకున్।
హీరవర్ణునిరామనాథమ-హేశ్వరున్జగదీశునోం।
కారమూర్తిన్నమస్కరింతురు-గాఢనిశ్చలచిత్తులై॥ ౧౬॥

సీ. ఉభయలోకములన-తూర్జితానందంబు,
సతతరామేశ్వర-స్మృతినిఁగల్గు।
గోటిజన్మార్జిత-ఘోరపాతకనివ,
ర్తనమగురామేశు-దర్శనమున।
నఖిలమానవవాంఛి-తార్థసంసిద్ధులు,
గృపసేయురామేశ-కీర్తనంబు।
శాశ్వతంబగురుద్ర-సాయుజ్యవిభవంబుఁ,
బొందించురామేశు-పూజనంబు।

గీ. దావవహ్నివిజృంభించి-దారుతతులఁ।
గాల్చిపొడిసేయుకైవడి-ఘనతరోగ్ర।
కలుషవిసరమశేషంబుఁ-గడఁగిద్రుంచు।
సిద్ధరామేశశివలింగ-సేవనంబు॥ ౧౭॥

సీ. మునులార వివరింతు - వినుఁడష్ట విధములఁ,
జెప్పెందు రామేశ - శివుని భక్తి।
తద్భక్తులందు వా - త్సల్యంబుగ లుగుట,
పూజావిధానము - ప్రాంగికనుట।
తాఁబూజ సేయుట - తత్పూజనారంబు,
దేహమెచ్చుట నైనఁ - ద్రిప్పికొనుట।
కరమర్థిఁ దత్పుణ్య - కథలాలకించుట,
స్వరదృగంగ వికార - శాలియగుట।
గీ. యెలమి నెప్పుడు రామేశుఁ - గొలిచి వినుట।
విత్తము తదర్పితంబుగా - వించిమనుట।
యిట్టి శివభక్తిగలుగు వాఁ - డెవ్వఁడైన।
బ్రహ్మసాయుజ్యపదవికిఁ - బాత్రమఁతడు॥ ౧౮॥
శా. వేదాంతశ్రవణైకసంభవమహా - విజ్ఞానలక్ష్మీయుతుల్।
ఖేదామోదవివర్జితుల్ యతులుము - క్తింబొందుచందంబునన్।
వేదాత్మున్ని వు రామనాథునభవు - న్వీక్షించుధన్యుల్ జనుల్।
ఖేదాపాయక రాపవర్గముశుభ - క్తింగాంతు రెప్పట్టునన్॥ ౧౯.
శా. వైరాగ్యంబు యతిత్వముఁ శ్రుతిశిరో - వాక్యార్థవిజ్ఞానముం।
గోరంగాఁబని లేదు మానవులక - క్షోభంబుగా నేరికిన్।
శ్రీరామేశ్వరలింగదర్శనమునన్ - సిద్ధించు మోక్షంబు దా।
త్కారుణ్యాతిశయంబ సాధనమగుం - గైవల్య సంప్రాప్తికిన్॥ ౨౦.
గీ. క్రిమికులంబు శకుంతముల్ - కీటములును।
జనులు బృందారకులు తపో - ధనులు మునులు।
పుణ్యరామేశ్వర క్షేత్ర - భూమియందు।
సములు రామేశ్వరుని సుప్ర - సాదకలన॥ ౨౧.
గీ. పుణ్యుఁడనటంచు గర్వంబు - బూనవలదు।
పాతకి నటంచు మనమున - భయము వలదు।

సొంపుదీపింపరామేశుఁ-జూచిరేని।
యెల్లజనములునుసములని-యెఱిఁగికొనుఁడు॥ ౨౨

గీ. కన్నులారంగరామేశు-గరళకంఠుఁ।
గాంచమనెవ్వాఁడుసద్భక్తి-కలితుఁడగుచుఁ।
జర్చచేసిననతనికి-సాటిగాడు।
విప్రకులవర్యుఁడగుచతు-ర్వేదియైన॥ ౨౩.

ఉత్సాహము. హాళిమెరయరామనాథు-వందుభక్తిగలుగుచం।
డాలునకునుదానముంగ-డంకతోడనీదగున్।
మేలుగాదుభక్తిలేని-నిఖిలవేదశాస్త్రవి।
న్నాళికిడినఫలములేశ-మాత్రమైనఁగల్గునే॥ ౨౪.

గీ. నెమ్మిరామేశ్వరక్షేత్ర-నిలయులైన।
వారుశశిశేఖరులుపంచ-వదనులురగ।
భూషణులుఫాలనేత్రులు-భూతికలిత।
దేహులుమహేశులగుదురు-ధీరులార॥ ౨౫॥

క. కడువేడ్కఁబొందములసం।
దడిగొనశ్రీమంతురామ-నా జూడన్।
బడిబడినేగదుసుజనుల।
కడుగడుగునకశ్వమేధ-యాగఫలముగున్॥ ౨౬॥

గీ. రామసేతువునకుఁజని-రామనాథ।
శంకరునకుఁబ్రియంబుగ-సద్విజునకు।
గ్రామమొకటినొసఁగిన-భూమిపతికి।
నఖిలభూచక్రదానపు-ణ్యములభించు॥ ౨౭॥

క. దళమునుకుసుమముఫలమును।
జలమునుశ్రీరామనాథ-శంకరునకుని।
శ్చలభక్తినొసఁగుజనముల।
నలరామేశ్వరుఁడుబ్రోచు-ననవరతంబున్॥ ౨౮॥

క. కరుణానిధియగు రామే।
శ్వరభజనము పూజనంబు-స్తవము ను నామ।
స్మరణము నుమానవులకుఁ।
ధరణింగడు దుర్లభములు-తాపసులారా॥ ౨౯॥

గీ. భక్తితోడమహాదేవు-భవుని రామ।
నాథుశరణంబు వేడిన-నరుల కెల్ల।
శాంతమతులార లాభంబు-జయము గల్గు।
నరయనిహపరలోకద్వ-యంబునందు॥ ౩౦॥

గీ. పరమకారుణ్యరసపూర-భరితహృదయుఁ।
డైనరామేశునందునె-వ్వానిబుద్ధి।
పగలు రేయును గదలక-దగిలి నిలుచు।
ధాత్రిలోపల నాతండు-ధన్యతరుఁడు॥ ౩౧॥

క. శ్రీవిశ్రుతరామేశ్వర।
సేవావైభవమువలన-సిద్ధించని చే।
తోవాంఛితశుభఫలములు।
వావిరి బ్రాపింపుమ సితర-వరధర్మములన్॥ ౩౨॥

ఉ. పంకజగర్భవంద్యపద-పంకజు నాగమవేద్యు గూఢపా।
త్కాంకణు రామనాథు శశి-కంధరు నంధకవైరి నిందురే।
ఖాంకురమౌళి నీశ్వరునొ-కప్పుడుఁ జూడని దుర్జనుండిలన్।
సంకరజాతి గాక పితృ-సంభవుఁడే మది నెంచిచూచినన్॥ ౩౩॥

క. రామేశ్వర రామేశ్వ।
రామేశ్వరయను మజనులు-ప్రత్యూషమునన్।
నేమంబుతోఁ బఠించిన।
నామేటికిఁ బూర్వదినకృ-తాఘము వాయున్॥ ౩౪॥

క. నరులార ముజ్జగములకు।
దొరభక్తత్రాణదీక్షి-తుఁడు శ్రీరామే।

శ్వరుఁడుండఁజెంద నేటికి।
వర కాలయఘోరయాత-నాసంప్రాప్తుల్॥ 3౫॥

గీ. విశ్వలోకకుటుంబిరా-మేశ్వరుండు।
సాంద్రకరుణాపయోధిప్ర-సన్నుఁడైన।
వివిధదుర్వారయాతనల్-విలయమొందు।
మంచుతపనోదయమునన-శించుకరణి॥ 3౬॥

గీ. అవనినెవ్వాఁడుప్రాణని-ర్యాణవేళ।
రామనాథునిగిరిసుతా-రమణుఁదలఁచు।
వతఁడుగ్రమ్మరమాతృగ-ర్భాంతరమున।
నధివసింపకశంకరుఁ-డైవెలుంగు॥ 3౭॥

గీ. రామనాథమహాదేవ-రాజమకుట।
భర్గరక్షించునన్నుగృ-పానిధాన।
యనుచునెవ్వాఁడుబలుకున-హర్నిశంబుఁ।
గలుగదతనికినేమియుఁ-గలిభయంబు॥ 3౮॥

సీ. నందివాహనరామ-నాథజగన్నాథ,
నీలలోహితరుద్ర-నిర్మలాంగ।
శితికంఠహరసదా-శివమహాదేవరా,
మేశశంకరవ్యోమ-కేశయభవ।
అంతకాంతకత్రిపు-రాంతకరామేశ,
శర్వమహేశప-శవ్యల్లలాట।
కాలకూటాశన-గౌరీమనోహర,
భర్గరామేశ్వర-భవగిరీశ।
గీ. యనుచుసంతతమనురాగ-మునవచించు।
నరుఁడుమాయకుఁజిక్కక-దురితములకు।
బట్టుపడఁబోకకాముని-బారిఁబడక।
క్రోధహితుఁడునుగాకచే-కొనుసుఖంబు॥ 3౯॥

సీ. రామనాథునిమంది-రముదారువులఁజేయు,
మనుజుండుసురలోక-మునఁద్రికోటి।
కులయుతుఁడైనిల్చు-కుడురుగానిటుకఁగ,
ట్టినవాఁడువైకుంఠ-మునవసించు।
శిలలచేఁగట్టించు-నలఘుపుణ్యుఁడుబ్రహ్మ,
పట్టణంబుననెప్డు-బాయకుండు।
స్ఫటికాదిబహువిధో-పలములరామేశు,
భవనంబునిర్మించు-పావనుండు।

గీ. భానుమండలతులితవి-మానమెక్కి।
సురవధూకరచారుచా-మరమనోజ్ఞ।
మారుతాంకూరసంవీజ్య-మానుఁడగుచు।
హరునిలోకంబునకుఁజను-సురలువొగడ॥ ౪౦॥

గీ. ధీరుఁడైవాఁడురామేశు-దేవళంబు।
వెండిపలకలరచియించు-వేడ్కమీఱ।
భవ్యశంకరసారూప్య-పదవిఁగాంచు।
నతఁడుశివుమాడ్కి-నానంద-మనుభవించు॥ ౪౧॥

గీ. మట్టుమీఱంగరామేశు-మందిరంబుఁ।
గలిమిగలవాఁడుగట్టించుఁ-గాంచనమున।
పూనిమట్టినిఁగట్టించు-లేనివాఁడు।
తెలియనిరువాగునకుఁబుణ్య-ఫలముసమము॥ ౪౨॥

గీ. శక్తికొలఁదినివివిధో-పచారములును।
పూనిరామేశ్వరునిఁగొల్వఁ-డేనరుండు।
భుక్తినిముక్తికిని రాజ్య-మునకునతఁడు।
భాజనముగాఁడుపరమని-ర్భాగ్యుఁడతఁడు॥ ౪౩॥

వ. మఱియుభక్తితాత్పర్యంబుల రామనాథేశ్వరుంబూజించువాఁడు భుక్తిముక్తిరాజ్యభాజనంబగు రామనాథార్చనసమంబునుం, దద ధికంబునునగుపుణ్యంబులేదు. రామనాథేశ్వర లింగద్వేషియగు

మూఢుండు బ్రహ్మహత్యాయుతంబు గాంచిన పాతకంబుం జెందు. తత్సంభాషణమాత్రంబున నరుండు నరకంబునం బడు. వేదంబులు యజ్ఞంబులు, ధర్మంబులు, రామనాథపరంబులై వర్తించు. తదన్యం బగు పదార్థం బెద్దియుం గలుఁగ నేరదు కావున సర్వంబు విడనాడి రామనాథేశ్వరు నీశ్వరు నాశ్రయించునది. ఆమ్మహాదేవు శరణుం జెందిన జనుండు నరకంబుఁ గనుంగొనక శివలోకంబునకుం జను. సకల యజ్ఞతపోదానతీర్థస్నానంబుల వలనం గలుగు ఫలంబు కోటిగుణితంబై రామేశ్వరసేవావైభవంబునం గలుగు॥ ౭౭॥

సీ. నాగభూషణు రామ-నాథేశ్వరుని రెండు,
గడియలు చింతించు-ఘనుఁడు వేవు-
రేకవింశతికులో-పేతుఁడై శివలోక,
మునకేగి సంతోష-మున వసించు।
బత్తిమీఱంగ నొక్క-పగలు చూచినవాఁడు,
పాపవిముక్తుఁడై-ఫలము నొందు।
కడఁక వేకువ లేచి-గౌరీశు రామేశుఁ.
దలఁచునరుండు ప్ర-త్యక్షశివుఁడు।

గీ. రామనాథునిఁ బొడగాంచు-నేమహాత్ముఁ
డతనిఁ జూచినయంతన-యఖిలజంతు
సంతతికి రాకవాదిదు-రంతనరక
యాతనాహితదురితసం-ఘాతమడఁగు॥ ౭౮॥

క. మధ్యాహ్నవేళ మునిహృద
యధ్యేయుని రామనాథు-నభవుని జగదా
రాధ్యునిఁ గనుఁగొను జనులక
సాధ్యసురాపానదోష-చయనాశమగున్॥ ౭౯॥

మాలిని. నతజనహితు గౌరీ-నాథు శ్రీరామనాథున్।
జితమదను గృపారా-శిం బ్రదోషంబునందున్।

శ్రుతివినుతచరిత్రుం-జూచుసద్భక్తినెవ్వం।
డతనికిగురుతల్పా-వాప్తిదోషంబడంగుక్॥ ౪౭॥

క. సాయంకాలంబునశుభ।
దాయకు రామేశుబహువి-ధంబుల స్తవముల్।
సేయునరుండుసువర్ణ।
స్తేయసహస్రంబునడఁగు-దేవునికరుణక్॥ ౪౮॥

గీ. మానులారధనుష్కోటి-మజ్జనమునఁ।
దారకంబగురామేశు-దర్శనమున।
శివునియర్చనమునన-శించునరుఁడు।
ముదితుఁడైశివసాయుజ్య-పదముగాంచు॥ ౪౯॥

వ. రామేశ్వమహాదేవుని మజ్జనశాలాంగణంబునఁద్రిసంధ్యంబును నృత్యగీతఘంటాకాహళ భేరీమృదంగశంఖవేణువీణాపటహపణవగోముఖమడ్డుడిండిమఝర్ఝరాదిమహావాద్యఘోషంబుల మహోత్సవంబుగావించువాఁడు మహాపాతకవిముక్తుండై రుద్రలోకంబునసుఖుంబుండు. రామేశ్వరునభిషేక సమయంబున రుద్రాధ్యాయంబును, చమకంబును, బురుషసూక్తంబును, త్రిసుపర్ణంబును, బంచశాంతులునుం, బావమానసూక్తంబులును, జపించువారును, పంచగవ్యంబుల నభిషేకంబుసేయువారును నరకంబుఁజూడరిది సత్యంబు॥ ౫౦॥

చ. కృపగలరామనాథునకుఁ-గేవలభక్తిదలిర్పగోఘృత।
స్నపనముసేయువాఁడుబహు-జన్మశతార్జితపాపముక్తుఁడై।
విపులసుఖంబుఁజెందుఁగడు-వేడుకఁబాలనొనర్చువాఁడుశీ।
లపరతనేకవింశతికు-లంబులతోహరుఁజేరునొప్పగక్॥ ౫౧॥

సీ. దధినిరామేశ్వరుఁ-దడుపుమానవుఁడకుఁ,
గమనీయవిష్ణులో-కంబుగలుగు।
మధువునభిషేక-విధియొనర్చినవాఁడు,
నలినగర్భునిపట్ట-ణమునవిలుచు।

మొనసి తైలాభ్యంగ - మొనరించు మనుజుఁడు,
షణ్ముఖలోకవా - సంబుఁదొరకు।
రామేశ్వరుని నిక్షు - రసపూరమున ముంచు,
నతఁడు చందురునింట - నమరి మెలఁగు।

గీ. రామనాథునిఁ ద్రిభువన - స్వామి నభవుఁ।
శాకవిదళితపరిమళ - భరిత చూత।
ఫలరసాసాలకలనఁ జొ - బ్బిలఁగఁ జేయు।
పుణ్యశీలుండు పితృలోక - మునవసించు॥ ౫౨॥

శా. సంతోషంబున నారికేళసలిల - స్నానోపచారంబు మా।
కాంతాభర్తకు రామనాథునకుఁ జ - క్కంజేయు మర్త్యుండు దు।
ర్దాంత బ్రహ్మవధాదిభూరికలుష - వ్రాతంబులన్నిర్మలు।
స్వాంతుండై పరిమార్చు భోగపరుఁడై - వర్తించు నెప్పట్టునన్॥ ౫౩॥

క. లలితపచేళిమరంభా।
ఫలరసముల రామనాథ - భవలింగము జొ।
బ్బిలఁ జేయు భాగ్యవంతుఁడు।
పొలుపుగ సామీకలోక - మునవసియించున్॥ ౫౪॥

ఆ. వస్త్రపూతవిమల - వారిని రామనా।
థాభిషేకకృత్య - మాచరించి।
నరుఁడు వరుణలోక - పరమసౌఖ్యము నొందు।
వానివంటివాఁడు - వసుధఁ గలఁడె॥ ౫౫॥

గీ. ఎలమి నెవ్వాఁడు రామనా - థేశ్వరునకుఁ।
జందనోదకధారల - జలకమార్చు।
నతఁడు గాంధర్వలోకవి - ఖ్యాతమత్త।
కాశినీదివ్యసంభోగ - కలనఁ గాంచు॥ ౫౬॥

సీ. పుష్పవాసితతోయ - ముల రామనాథున,
కభిషేకమొనరించి - యమరసాధు।

నరాసనం బెక్కి-యతిసౌఖ్యమున నుండు,
పాటలపున్నాగ-పంకజాత।
కువలయకహ్లార-కుసుమవాసితవారి,
ధారావగాహనో-త్సవముఁ జేసి।
కలుషవిముక్తుఁడై-కనుపట్టుమానవుం,
డితరవిచిత్రవి-శ్రుతసుగంధి।

గీ. సుమచయామోదసమ్మిళి-త్సురభిసలిల।
పూరమున రామనాథు నా-ప్లుతునిఁ జేసి।
సకలభువనమహోన్నత-శంభులోక।
శాశ్వతసుఖాంబునిధి దేలి-సలుపుచుండు॥ ౫౭॥

క. ఏలాలామజ్జకహిమ।
వాలుకలం బరిమళించు-వారి నిస్నానం।
బోలిన రామేశ్వరునకు।
లోలితఁ గావించవిప్ర-లోకము గలుగున్॥ ౫౮॥

చ. చెలువగు రామనాథునభి-షేక మొనర్చుటకై మనోజ్ఞమౌ।
త్కలశము లిచ్చునట్టి శుభ-కర్తుఁడుఁ గాంచుఁ జిరాయురున్నతుల్।
విలసితతామ్రకుంభములు-వేడ్కనొసంగినవాఁడు నిర్జరాం।
జలిపుటలాలితోన్నతవి-శాలపదంబుననుండు నెప్పుడున్॥ ౫౯॥

గీ. చేరి రామేశ్వరుని యభి-షేకవిధికి।
దివ్యతీర్థజలంబులు-దెచ్చికొనుచు।
వెండికుండలు నెమ్మది-నిండు వేడ్క।
నిడెడువాఁడు వసించు వా-ణీశు పురిని॥ ౬౦॥

క. బంగారుబిందెలిడియుఁ।
పొంగుచు ముక్కంటిపీటఁ-బోలుచు సురతనం।
పుంగడవలుగ డు వేడ్కనొ।
సంగిన నెలదారిచెంతఁ-జక్కఁగ నిలుచున్॥ ౬౧॥

గీ. పాసగ రామేశునభిషేక-మునకుభక్తి।
బొదలఁబాలిచ్చు పెనుసాధు-మొదవునిడిన।
భాగ్యశాలికిహయమేధ-ఫలముదొరకు।
నభవుసారూప్యమమరదే హాత్యయమున॥ ౬౨॥

క. సేతువునధనుష్కోటి।
ప్రీతినిరామేశునీశుఁ-బేర్కొని పురుషుం।
డేతోయమునమునింగిన।
సేతునిమజ్జనఫలంబు-శివకృపఁగలుఁగున్॥ ౬౩॥

వ. మఱియు రామనాథలింగంబు సుధాలిప్తంబుగావించినవాని పుణ్యఫలంబు వక్కాణింప శతసంవత్సరంబులకైన సమర్థుఁడఁగాను. రామేశుమందిరంబు శిధిలంబగునేని వెండియునూతనంబుగానమర్చిన పురుషునకుఁ బూర్వకర్తకన్న శతగుణంబగు మహాపుణ్యంబుఁ జెందు పదివేలబ్రహ్మహత్యలు నశించునాస్వామి యగ్రభాగంబున, దీపంబులిడిన జనులవిద్యాపటలంబు భేదించి పరబ్రహ్మ సాయుజ్యంబుఁ జెందుదురు. ఘృతతైలముద్గతండులగుడశర్కరాదిపదార్థంబులు సమర్పించువారు దేవేంద్రస్థానంబున వసింతురు. రామేశ్వరమహాదేవలింగంబు దర్శించినఁ బూజించిన స్మరించిన స్పృశించిన నెల్లవారికి సకలపాపంబులును దొలంగు.

గీ. కంచుగంటయునద్దంబు-కానుకగాఁగ।
నెలమితోరామనాథున-కిడినప్రోడ।
భాసురవిమానశతభోగ-పరతనొంది।
శ్రీమహాదేవుపురినివ-సించుఁదడవు॥ ౬౪॥

సీ. డమరుక డిండిమ-ఢక్కాదుందుభి,
పణవగోముఖశంక-పటహాలటహ।
వంశకాంస్యాదిక-వాదిత్రములునవ్య,
వాద్యవిశేషము-ల్వలనువిూఱ।

సమకూర్చి రామేశ-శంకరు సేవించు,
ఘనులు మహాభోగ-కలితులగుచు।
వాద్యఘోషాన్విత-వరవిమానము లెక్కి,
శివునిలోకమునకుఁ-జేరితడవు।
గీ, నిలుతు రెవ్వాఁడు ప్రేమచే-నిఖిలభర్త।
రామనాథేశునద్రిజా-రమణు గురించి।
కొంచెమేని యొసంగునా-గుణపయోధి।
కమితఫలమగునదిసంశ-యంబువలదు॥ ౬౬॥

క. రామేశక్షేత్రంబున।
రామేశునిచెంగటన్ని-రంతరము మహా।
ప్రేమమున నుండుజనునిక।
నామయమోక్షంబుకరత-లామలకమగున్॥ ౬౭॥
చ. సిరులును జవ్వనంబు మతి-జీవనముల్ సుతదారవర్గముల్।
వెరవరి యేగు క్షేత్రపశు-విత్తగృహాదులు రాజతస్కరా।
ద్యురుతరబాధచేనణఁగు-నార్జిత మెద్దియుఁగాదు గానఁద।
త్పరిచితమాని మానవుఁడు-భవ్యవిరాగముఁబూనిధీరుఁడై॥ ౬౮॥

క. కరుణానిధియగు రామే।
శ్వరు బిరబిర నేగి కాంచి-శరణొందవలెన్।
వరదుండగు నద్దేవుని।
స్మరణంబును గీర్తనంబు-సలుపఁగవలయున్॥ ౬౯॥
క. అపన్నార్తినివృత్తి।
వ్యాపారధురీణు దీన-వత్సలు నగరా।
ట్చాపుని రామేశ్వరుఁగరు।
ణాపరుఁగొల్చినను గర్భ-నరకము దప్పన్॥ ౭౦॥
క. రామేశ్వరదేవునకున్।
గ్రామములిడువాఁడు పుణ్య-గౌరవకలితుం।

డై మేలుఁ జెందితుదిహిమ।
ధామకళాధారియైయు-దంబుననుండున్॥ 21॥

క. పాత్రములలోనను త్తమ।
పాత్రము రామేశ్వరుండు-పరమార్థముత।
త్పాత్రసమర్పితమగునణు।
మాత్రమునువిశేషఫలస-మగ్రతఁజేయున్॥ 22॥

గీ. నందివాహనుగౌరీస-నాథురాము।
నాథుఁబొడఁగనునంతను-నరునివెంట।
నంటితిరుగును విప్రహ-త్యాదులయిన।
కలుషపుంజంబులంతట-విలయమొందు॥ 23॥

చ. గొడుగులు తాళవృంతములు-కుంచియలున్ సితచామరంబులుం।
బడగలు తామ్రకాంస్యమయ-పాత్రచయంబును వెండిగిన్నెలుం।
గడుబెడగైనచిత్రమణి-కాంచనకుంభములున్సుభక్తిచే।
నిడియెడివాఁడఖండితమ-హీతలమేలుభవాంతరంబునన్॥ 24॥

వ. మఱియు రామేశ్వరస్వామికి వివిధసురభికుసుమ మాలంబులు గల్పించిన పుణ్యాత్ముదయులకు హయమేధయజ్ఞఫలంబుగలుగు చందనాగరుకుంకుమ కర్పూర కస్తూరి గుగ్గులు దేవదారు ద్రవ్యంబులును, పునుగుచాదుజవ్వాది పన్నీరు మొదలయిన సుగంధంబులును, నానావిచిత్రదుకూల వస్త్రంబులును, కిరీటకుండల కేయూరహార కంకణాది మణి భూషణంబులును సమర్పించువారు ధన్యాధ్న్యులును. వేదపారగులునై జన్మింతురమ్మహాదేవుని కణుమాత్రంబునునిచ్చువాఁడును, చక్రవర్తియైపుట్టు నద్దేవుని పూజానమస్కారస్మరణశ్రవణదర్శనంబుల దుర్లభంబనునది యెద్దియుం గలుగదు. గంగాతోయంబులు దెచ్చి యభిషేకంబుఁ జేసిన భాగ్యవంతుఁడు సాంబశివుని చేతం బూజవడయు నమ్మహాలింగమూర్తిని సేవించం బోవువానింగనుంగొని తత్పాపంబులన్నియు భయంబునం బరుగు

లిదుంగావున నింద్రియంబులు వికలంబులుగానిముంద, ముదిమి రా
నిముంద, మఱిచలింపనిముంద, ముముక్షు లగువారు వందనార్చన
ధ్యాన. స్మరణకీర్తనస్తుతి శ్రవణదర్శనంబు లాచరించి రామేశ్వరు
నారాధింపవలయు తత్పూజాసమానం బయిన ధర్మంబు సకలపు
రాణ ధర్మశాస్త్రంబులయందు లేదు. నిత్యంబును భక్తి తాత్పర్య
విశ్వాసంబులనతని సేవించు పుణ్యశీలురు భూలోకంబునం బుత్త్ర
దారధనధాన్యసంపన్నులై పెద్దకాలంబు సకలశుభంబు లనుభవిం
చి శరీరాంతంబున శివసాయుజ్యముక్తింబొందుదురిది రామేశ్వరు
వైభవంబు దీనివినినంజదివిన నెల్లవారికి రామేశ్వర సేవాఫలంబు
ను, ధనుష్కోటితీర్థస్నానపుణ్యంబును సిద్ధించునని సూతుండు శౌ
నకాది మహామునులకు వివరించిన నమ్మహానుభావులు శ్రీరామచం
ద్రుండెటువలె శివలింగప్రతిష్ఠంబు గావించెం దత్ప్రకారంబును,
నమ్మహాలింగమూర్తి మహిమంబును సవిస్తరంబుగా నుపదేశించిమ
మ్ముం గృతార్థులం గావింపుఁడని ప్రార్థించిననతండిట్లనియె. ౭౫॥

ఉ. రాముఁడులోకరక్షకుఁడు-రాక్షసమాయలఁజిక్కి-కాసలో।
భూమితనూజఁబాసిరవి-పుత్త్రుఁగనుంగొని మైత్రిచేసి శా।
ఖామృగసేనఁగూర్చిదశ-కంఠజయార్థమొనర్చె విక్రమ।
శ్రీమెరయన్ సముద్రమున-సేతువుమోక్షసుఖైకహేతువున్ ॥౭౬॥

గీ. ఇట్లగాధపయోధిపై-నెలమిగదుర।
సేతువుఘటించిరాముఁడా-సేతుసరణి।
పూర్ణిమాతిథి రావణు-పురికి నేగె।
బహుళకపివీరపరివార-సహితుఁడగుచు॥ ౭౭॥

వ. ఇట్లు లంకకుజనిసువేలశైలంబెక్కి నిలిచెననంతరంబ. ౭౮॥

చ. కరుకుదనంబుమీఱఁగజ-గజ్జనయుత్రిని ధాత్రిపుత్త్రికిం।
జెరగొనితెచ్చిపట్టణము-చెంతకు రాముఁడువచ్చినప్పుడు।

న్వైరుపక సీతనీయకయు-నీతికిఁ జొచ్చెదశాస్యుఁడంచు నే।
డ్రైరరుషఁ బూనెనోయనఁగఁ-దిగ్మకరుండువహించె రక్తిమన్ ॥౭౯॥

సీ. మహనీయత్రిభువన-మధ్యస్థశాఖితా,
పసమస్తకములకుఁ-బల్లజడలు।
తారకాపథభద్ర-దంతావళమునకు,
నవనవరక్తరాం-కవపటములు।
యాధోధిరాజవ-హాస్యరేఖకు,
లంబమానకోమల-కిసలయములు।
నిఖిలహరిత్పురం-ధ్రీలలాటములకు,
సింధూరధాతువి-శేషకంబు।

గీ. లగుచుఁ గింశుకముకుళర-క్తాబ్జబంధు।
జీవకంకేళికుసుమరు-చిప్రబంధ।
బాంధవములైనవృద్ధప్ర-భాకరారు।
ణాతపములుదనర్చిన-య్యవసరమున॥ ౮౦॥

శా. ఘోరాపారగభీరమైనజలధిం-గోదండముక్తోజ్వల।
కూ్రరాస్త్రంబులనింకఁ జేసియి దెకా-కుత్స్థుండులంకేశనం।
హారేచ్ఛంజను దెంచెమీకునిఁక సౌ-ఖ్యంబం చులోకాళికిం।
పారంజెప్పఁగ నేగె నాఁజనియె ఛా-యానాథుఁ డస్తాద్రికిన్ ॥ ౮౧॥

గీ. జరఠదినకరపశ్చిమ-జలధిపతన।
సమయతద్దీప్తిహారఝార-జలవినిర్గ।
తోరదుర్వారకీలంబు-లనఁగనంబ।
రమునఁగనుపట్టెనవసాంధ్య-రాగరుచులు॥ ౮౨॥

చ. అగణితవీరవానరబ-లావృతుఁ డైవిజిగీషరాముఁ డో।
ప్పఁగఁ జనిలంకపైఁగవిసె-భూరిరణంబగుఁ దోడుగావలెం।
దగినగతిం దశాస్యునకుఁ-దారసిల్లియె లెడనున్న రక్క-సుల్।
బిగువుగఁ గూడివచ్చిరన-భీషణవృత్తినిఁ గ్రమ్మెఁ జీఁకటుల్॥ ౮౩॥

సీ. అస్తోకశోకప్రపి-యావియోగాగ్నిసం,
భూతోగ్రధూమసం-ఘాతమనఁగ।
విరహిసంహరణత-త్పరపంచశరనవో,
త్పలశిలీముఖకాంతి-పటలియనఁగ।
రమణీయదశదిశా-రమణీమణీకుచో,
ద్దీపితమృగమదా-లేపమనఁగఁ।
గమనీయరోదసీ-కాసారశైవాల,
మంజులమంజరీ-పుంజమనఁగఁ।
గీ. బతిసమాగమకుతుకసం-భృతమనోజ్ఞ।
యామినీకామినీమధు-వాణ్నిచయ।
ఖచితసముచితభూషణ-రుచిరరుచివి।
తానమనసంధకారంబు-దనరెఁ దెసల॥ ౮౪॥
గీ. రాజురాక కుఁగగనమా-ర్గమునమృగము।
దమునఁగలయంపివెట్టిది-గ్గమణులాణి।
ముత్తియఁపుఁ బ్రముగ్గులిడిరన-మొనసితిమిర।
కలితఘనవీధినక్షత్ర-గణములమరె॥ ౮౫॥
చ. అనయముదూరదేశగతుఁ-డైననిజేశునిమేలురాకకై।
గొనకొనియిష్టదేవతలఁ-గొల్వఁగఁబూనిమిళన్మధువ్రతాం।
బననిజదృగ్విమూలనము-సల్పికరంబునుధ్యాననిష్ఠఁగై।
కొనెనలినీకులంబనని-గూఢరుచిన్ముకుళించెనబ్జముల్॥ ౮౬॥
చ. అమరెదుసాంధ్యరాగకిస-లాంచితనిర్జరమార్గశాఖికిం।
దిమిరతతుల్వికంబులన-విండినఖండితకాంతిదారకల్।
సుమములనంగ నెంతయును-శోభిలెఁబండినపండనంగను।
త్తమనవరాగసంపదసు-ధాకరబింబముదోఁచెనత్తరిన్॥ ౮౭॥
చ. మొనయుచునిండిపారెదుద-మోయమునవ్విదళించిదాటుచూ।
పినబలుఁడోయనంగశశి-పెంపెసఁగెన్ దివివానివల్వనాఁ।

దనరెమనోజ్ఞలాంఛనము-తత్తనుకాంతులనందగన్నర।
ద్ఘనఘనసారహారగుళి-కాదరసోదరసాంద్రచంద్రికల్॥ ౮౮॥

శా. కాసారంబులు పెల్లుగాఁ గురిసెనీ-హారాంశుపాషాణముల్।
కాసారంబులఁ గుందెఁ గోకవితతుల్-కన్నీరుమున్నీరుగా।
కాసారంబులఁ బాంథబృందములసం-ఖ్యాతవ్యథం జెందెరా।
కాసారంగధరప్రకాశములు వీ కం బైపయిం బర్వఁగాన్॥ ౮౯॥

క. పారావారము గర్వము।
పారముగావిరహితతికి-భారముగాఁగం।
భూరుహములకువికాసము।
దూరముగావలయుముకొనివి-ధుప్రభలమరెన్॥ ౯౦॥

సీ. పసస్థాణుమతిసైనఁ-బల్లవింపఁగఁ జేయఁ,
జాలుపుష్పాస్త్రునియు-శంబవంగ।
లోకంబులెటువంటి-జోకాంతునను వేడ్క,
వచ్చిత్రిమ్మరుదుగ్ధ-వార్ధియనఁగ।
వరచకోరులుపిండి-వంటకైయారిందు,
శాలితండులచూర్ణ-పాళియనఁగ।
వైరియిట్లనిక్రోధ-వహ్నిమారుఁడు గాంచఁ,
గరగినీరగువెండి-గట్టనంగ।

గీ. నిఖిలభువనాంతరసిత-నీలవస్తు।
ధవళిమాపాదనప్రౌఢ-తరనిరూఢ।
పాండురాఖండచంద్రికా-మండలంబు।
పుండరీకభవాండంబు-నిండి మెరసె॥ ౯౧॥

వ. అయ్యెడ. ౯౨॥

ఉ. పెన్నిధిసన్నిధిం గనిన-బీదలభంగిఁ జెలంగియాడుచుం।
బున్నమవెన్నెలల్ చెలుల-పొత్తునఁ గుత్తుకబంటిగ్రోలుచుం।

క్రొన్నవవిల్తుకేళి నెల-కొన్న సుఖాంబుధినోలలాడుచున్।
సన్నుతలీల వేడ్కఁ గొన-సాగఁ జరించెఁ జకోరదంపతుల్॥ ౯౩॥

వ. ఇట్టిసాంద్రచంద్రికా వికాసనికామ భాసురనిశాసమయంబున.

ఉ. పంబిన వేడ్కతోడఁ గను-పట్టుహిరణ్మయశృంగతుంగసౌ।
ధంబుననున్న రావణునిఁ-దప్పక కన్గొని భానునూనుఁడు।
ర్వ్వంబడఁ బ్రోచెఁ దన్మణికి-రీటము వాఁడునుబన్న మందిరో।
షంబున నందునిల్వక వె-సం జనియెన్ సదనంబులోనికిన్॥ ౯౪॥

గీ. అంతసుగ్రీవుతోఁ గూర్మి-యనుజుతోడ।
సేనతోఁ గూడి రఘువంశ-శేఖరుండు।
కడఁగ నగ్గిరిడిగ్గిలం-కాపురంబు।
చెంగటనునీకములవిడి-యంగఁ జేసె॥ ౯౫॥

వ. అంతజతనంబుగ విడిసిన యవ్వానరవీరులంగనిసిన, ఆయుధపాణులును, మహాకాయులును, సైనికసమేతులునగు రావణానుచరులు పర్వణుండును, పూతనుండును, జృంభుండును, ఖరుండును, క్రోధవశుండును, హరియును, ప్రరుజుండును, అరుజుండును, ప్రహస్తుండును మఱియుం బెక్కురక్కసులుటుక్కు మీఱి యదృశ్యులయి పోరుచున్న విభీషణుం డంతర్ధానవధంబుఁ గావించె. బలవంతులగు హరియూధపులు దూరపాతులయి విజృంభించిన రాత్రించరులు నిహతులయి పుడమిం బడిరవ్వార్తవిని సహింపక రావణుండు.

క. కరమలిగి దనుజసేనా।
పరివృతుఁడై బయలువెడలి-పటుదోర్గర్వ।
స్ఫురణంబు మెఱయ నతిశిత।
శరములనొప్పించె వృక్ష-చరులం బెలుచన్॥ ౯౬॥

వ. అంత. ౯౭॥

చ. కలువలదాయముజ్జగము-కన్నువెలుంగులనిండుప్రోగుచు।
కల్గలదొరజోడుతమ్మిచెలి-కాఁడుకడానిపసిండిఛాయను।

న్నెలవగువాఁడుజక్కవల-నెచ్చెలిపచ్చగుఱాలజోదుగా।
ములయొకిమీఁదుదోఁచెజగ-ముల్ గదువేడుకఁజెందనత్తరిన్॥౧౦౦॥

గీ. వ్యూహరచనఘటించిర-ఘూద్వహుండు।
బలమునందందఁదగుభంగిఁ-బదిలపరచి।
కపిఁకనిగుడంగరావణుఁ-గదిసిపోరెఁ।
గలహమపుడయ్యెనారెండు-బలములకును॥ ౧౦౧॥

గీ. మేఘనాదుండుపోరెసౌ-మిత్రితోడ।
రవిసుతుండువిరూపాక్షుఁ-గవిసితాకె।
నంగదునితోడఖర్పటుం-డనియొనర్చెఁ।
జాంద్రకుఁడుసేసెనలునితో-భండనంబు॥ ౧౦౨॥

క. పుటశుఁడనుదనుజవీరుఁడు।
పటుశక్తిందురముఁజేసెఁ-బనసునితోన।
చ్చటదనుజభటులకునుమ।
ర్కటులకునందటికిద్వంద్వ-కలహంబయ్యెన్॥ ౧౦౩॥

వ. అయ్యిరుదెరంగులజోదులు మత్సరంబునం గచ్చకొని పెచ్చుపెరిగి విచ్చలవిడినిట్లు వ్రేల్లాడుచున్నం బోరు ఘోరం బయ్యె నవంతరంబ. ౧౦౪॥

క. ఘోరపరాక్రములగుహరి।
వీరశిఖామణులుబిట్టు-విదళించివనిం।
ద్రారాతిచమూనాథులు।
శూరతచెడితిరిగిలంకఁ-జొచ్చిరిభీతిన్॥ ౧౦౫॥

ఉ. ఈగతినాజిలోనబల-మెల్లవినాశముఁజెందనంతటన్।
వేగదశాననుండనుప-విక్రమధుర్యుఁడుమేఘనాదుఁడ।
భ్యాగతుఁడైవలీముఖుల-నందఱినొంచెమహావిషోజ్వల।
న్నాగశరంబువేసినర-నాథులబదులఁజేసెనీసునన్॥ ౧౦౬॥

క. చేసినయాపిమ్మటవిన।
తాసుతుఁడ-గ్చోటికలిము-దంబఱఁగ వేం।
చేసెనుపాశవిముక్తులఁ।
జేసెను రాసుతులఁగడువి-శేషప్రీతి౯॥ ౧౦౭॥

ఉ. అందువిభీషణుంగని ప్ర-హస్తుఁడుగొబ్బున డాసియార్చి వా।
సిందన రారుఘోరగద-చేఁ బ్రహరించినఁ గంపమేమియుం।
జెందక నిల్చె నద్దనుజ-సింహము శీతనగంబుమాడ్కి నా।
చందముఁ జూచి డెందముల-జానుగ నచ్చెరువొందిరందఱు౯॥

వ. అంత విభీషణుండు. ౧౦౮॥

గీ. అష్టఘంటమహాశక్తి-నడరి పూని।
యలప్రహస్తునిశిరముల-క్ష్యముగ నేసె।
వాఁడును హృత్తోత్తమాంగుఁడై-వజ్రపాత।
భగ్నభూజము వలెఁ జూడఁ-బడియె నపుడు॥ ౧౧౦॥

చ. అనిమొనన ట్లుగూలిన ప్ర-హస్తునిఁ గన్గొని ధూమ్రలోచనుం।
డనుబలురక్కసుండతిర-యంబునఁ గోతులఁ బాఱఁద్రోలినం।
గని సిమహీరుహంబున నొ-గి౯ హనుమంతుఁడు వానిఁ ద్రుంచెనా।
జనిహతు వానిఁ జూచి హత-శేషులు లంకకు నేగిరత్తఱి౯॥ ౧౧౧॥

వ. చని వారు సమరవృత్తాంతంబంతయు రావణునితో విన్నవించిన.

మ. అసురాధీశుఁడు కుంభకర్ణునతని-ద్రాసక్తు మేల్కొల్పి శ।
త్రుసమూహంబు వధింపఁ బంచె నతఁడు౯-దోర్గర్వమే పారయు।
దసముత్సాహము మీఱ వచ్చి కపులం-దాకెం గృతాంతాకృతి౯।
వెస బ్రహ్మాస్త్రమునన్ సుమిత్రకొడుకు-ర్వ్యంగూల్చె నద్దానవు౯ ౧౧౩॥

గీ. దూషణుని తమ్ములరిభయ-దూరమతులు।
వజ్రదేహప్రమాదుల-న్వారుగాడ్పు।
కొడుకుచే నీలుచేఁ ద్రుంచఁ-బడిరి పత్త్రి।
పవనుమదిలోన౯ఁ గలుగుదు-ర్మదముదొలఁగ॥ ౧౧౪॥

సీ. వజ్రదంష్ట్రుండను-వానిఁ బీచమడంచెఁ,
ప్లవగోత్తముఁడు మహా-బలుఁడు నలుఁడు।
బహువిధసమరలం-పటు నకంపను బట్టి-
కుముదుండు రణభూమిఁ-గూల్చి యార్చె।
నతికాయబలమదో-దతుఁడైన త్రిశిరుని,
సౌమిత్రి దురమున-సమయఁ జేసె।
మును పుగ దేవాంత-కునిఁ ద్రుంచి పదపడి,
యినసుతుండు నరాంత-కుని వధించెఁ।

గీ. కుంభకర్ణాత్మజుల గాడ్పు-కొడుకు దునిమె।
ఖరుని కొమరుని మకరాక్షుఁ-గడఁగి పొడిచి।
పేరణంగించె గరలివి-భీషణుండు।
దురమునకు నంత నింద్రజి-త్తుండు వచ్చె॥ ౧౧౫॥

క. ఆయింద్రజిత్తు దారుణ।
సాయకములు వరపి రామ-సౌమిత్రులస।
ద్గేయచరిత్రుల వీరులఁ।
శాయకమోహితులఁ జేసి-ఖండనభూమిన్॥ ౧౧౬॥

ఆ. వాయుపుత్రుని వాత-వాజియై యమ్మేటి।
నింగికెగసి నిలిచి-నిశితకనక।
పుంఖమానమైన-భూరిశిలీముఖా।
సారములనుగపుల-బీరమడఁచె॥ ౧౧౭॥

క. ద్యోవీథి నున్న యారణ।
కోవిదు శరవృష్టి నిగిడెఁ-గుముదాంగదసు।
గ్రీవనలజాంబవంతుల।
తో వానరులెల్లఁ ద్రెళ్ళి-దుర్దశ నొందన్॥ ౧౧౮॥

వ. ఇత్తెరంగున నింద్రజిత్తుండు తత్తరంబున నంగోతి మొనగాని మొత్తం
బులతోడ నయ్యుత్తమవీరుల నత్తరి విపత్తి నొందించి వియత్తలంబు
నంతర్హితుండయ్యె నంత. ౧౧౯॥

ఉ. ఎలమి విభీషణుండు మిథి-లేశసుతాపతికిం బ్రణామముల్।
బలుమరు నాచరించి తగఁ-బ్రాంజలియై పలికె న్మహాత్మజ।
న్కులయొకమాని యూనతిని-గుహ్యకుఁడీతఁడు మంత్రపూతమా।
సలిలము నీదుపజ్జనె-సంగొని వచ్చినవాఁడు భూవరా॥ ౧౨౦॥

క. హితవృత్తి మెరయ నంత।
ర్హితభూతవిలోకనార్హ-మిజ్జల మెసఁగెన్।
ధృతి నీవు ధనేశ్వరుఁడా।
శ్రితరక్షక నేత్రశుద్ధి-సేయుము దీనన్ ౧౨౧॥

వ. ఇట్లు గావించిన నంతరిక్షంబున నంతర్హితంబులైన భూతంబులు నీ
కు దృష్టిగోచరంబులగు నెవ్వారికెవ్వారిం గృపసేయుదు నవ్వార
లును గగనంబున నంతర్హితంబులగు భూతంబులం జూతురని విభీ
షణుండు విన్నవించిన ౧౨౨॥

శా. ఆతోయంబుఁ బరిగ్రహించి రఘువం-శాధీశుఁ డెంతేనియుం।
జేతఃప్రీతిని నేత్రశుద్ధియొనరిం-చెన్ లక్ష్మణుండున్ సగో।
జాతాప్తప్రియపుత్త్రుఁడాదియగు కీశశ్రేష్ఠులున్ హాళిమై।
సీతావల్లభదత్తమంత్రజలసం-స్పృష్టాక్షులైరందఱున్॥ ౧౨౩॥

క. రవినందనహనుమజ్జాం।
బవదంగదనీలగంధ-మాదనమైందా।
ద్వివిదాదికపులు గాంచిరి।
దివి నణఁగిన యింద్రజిత్తు ధీరోదాత్తున్॥ ౧౨౪॥

గీ. అంతట నభోంతరంబున-నణఁగియున్న।
యింద్రజిత్తును బొడగాంచి-యదిరిపాటిపి।

కోపమేపారదుర్వార-ఘోరబహుళ।
కాండములఁజెండెఁటలక్ష్మ-ణుండువాని॥ ౧౨౫॥

క. మును శక్రకిరీటహరుఁడు।
కినవోలెమహావిచిత్రగతులఁగదంయో।
ధనమురెన్యాసుమిత్రిసం।
దనునకునమ్మేఘనాదు-నకునఁ బ్చేటన్॥ ౧౨౬॥

ఉ. అంతనిసర్గదుర్గమభు-జార్గళపక్షులఁడులక్ష్మణుండుక।
ల్పాంతకృతాంతభీషణుఁడు-రంతమహోగ్రతఁజేర్చిఖేచరుల్।
సంతసిలందృతీయదిన-సంబునసంగరభూమిఁగూల్చెను।
దాంతపరాక్రమక్రమవి-ధానవినోదునిమేఘనాదునిన్॥ ౧౨౭॥

వ. అంత ఖరాంతకుండు మూలబలంబులం బొలియించె నిట్లు లక్ష్మణునిచేత నింద్రజిత్తు పొలియుట హతశేషదోషాచరులవలన విని రావణుండు కోపంబుతోడఁ బుడమికన్నియం ద్రుంచ నుద్యోగించి పెద్దలచే నివారించంబడి మగుడి నిబిడసమరసన్నాహసాహససముత్సాహదోహలుండై వెపెలి మణిగణప్రచుర వైజయంతికా విరాజమానంబును, తప్తచామీకర మాలికా జాలకావృతంబును, తరుణారుణప్రభారమణీయంబును, సకలశాస్త్రశోభితంబును, మహాజవ బహుతురంగసమేతంబును, రత్నకింకిణీనాదమేదురంబును, మహోదారసారథికంబును నగు నొక్క దివ్యరథంబెక్కి సముద్దండకాంచనకోదండధరుండై ప్రచండమండలాగ్ర ముసల ముద్గర పరశు పట్టిస పరిఘ గదాశూల భిండివాల ప్రాస శరశరాసన చక్రాది ప్రహరణప్రాణులును, శతాంగ మాతంగ తురంగ సింహ శార్దూల శరభ వరాహాది మృగవాహనారూఢులును, ప్రళయసమయ సమారంభ సంరంభ సముజ్జృంభణ శుంభ దంభోధర గంభీర నిర్ఘోష ప్రతిభటచటుల వికటాట్టహాస భాసుర కఠోర కంఠహుంకారులును నగు నసంఖ్యాతయాతు

ధానసైనికులు బలసి పరివేష్టించి కొలువ, హేషాగంధసింధుర బృంహిత దనుజ వీరభట సింహనాదంబులు భేరీమృదంగ శంఖ కాహళ ప్రణవ గోముఖాది మహావాద్య ధ్వానంబులతోడ నేకీభూతంబులై భూనభోంతరంబులు నిండింప నఖండిత త్వరాహంకారపరాభూతమాతరిశ్వ మహాశ్వ నికర ఖురపుట నిర్దళిత ధరా పరాగ పటలంబు లంబుజాప్తబింబక బళనంబొనర్ప, సూతమాగధ వందిసందోహ సముచ్చార్యమాణ జయజయ శబ్దంబులు చెలంగ నభంగుర సంగరోత్కంఠుండై దశకంఠుండు పురంబు నిర్గమించి నడచె నయ్యెడం గడు దుర్నిమిత్తంబులు వొడమె నవి సరకు గొనక కఱకుదనంబున నురువడించి చని రణవేదికా ప్రజ్వలన్మహాజ్వలనంబువోలె నున్న యన్న రేంద్రసార్వభౌముని జూచి కదియనడిచె నయ్యవసరంబున. ౧౨౭॥

చ సురమునిసిద్ధసాధ్యబల-సూదనలోకనివాసమేదినీ।
శ్వరవృషభుల్ ప్రభాతరవి-సన్నిభ హేమవిమాన కాంతి వి।
స్ఫురణమునన్ దిశల్వెలుఁగ-భోరన వచ్చినభంబునందుని।
ల్చిరి దశకంఠుతోడ నని-సేయన జేయుని రాముఁ జూడఁగన్ ౧౨౮॥

ఉ. ఆతరిమాతరిశ్వహృద-యాతిగవేగహరిత్తురంగమో।
పేతమరాతిభీమమహి-మేతరభానువిభాప్రభావవి।
ఖ్యాతము నౌరథంబుకడ-కన్ బలశాసనుశాసనంబునన్।
మాతలి దెచ్చె మెచ్చుగఁ-మాతలనాథకు లేంద్రుచెంతకున్ ॥౧౩౦॥

ఉ. భూతలభర్త యెక్కె-పరి-భూతసమీరతరస్తురంగము।
ద్యోతరథాంగమున్ మణిశి-లోచ్చయభాసురశృంగతుంగమున్।
కేతుపటానిలోద్భవద-కించనవాకధునీతరంగిమ।
జాతహితోపమానరుచి-సంగము నిర్జరరాట్ఛతాంగమున్ ॥ ౧౩౧॥

వ. అట్లు పురందరస్యందనారూఢుండై దశరథనందనుండు దశముఖు
నకభిముఖుండైనపుడె నబ్బెదురుకొని యద్దనుజేంద్ర మనుజేంద్రులి
ద్దఱుం బరస్పరవిజయాభిలాషంబుల నశేషదివ్యాస్త్రశస్త్రంబుల
నతివిచిత్రప్రకారంబునం బోరిరంత యుగాంత భీషణుండు యు
గాంతకుపితకృతాంతభీషణుండును నిదాఘసమయ మధ్యాహ్న
మార్తాండ దుర్నిరీక్ష్యుండును త్రిపురసంహారణ ప్రచండఖండ
పరశుమహారౌద్రుండునునై రామభద్రుండు గిరిభేదనంబు సరి
చ్ఛోషకంబు నరణ్యదాహకంబు నశనిజనకంబు గ్రహభుజనంబు
జ్యోతిర్మయంబు, మహానిష్ఠురంబున ప్రతిహతంబు దూరపాతి
యు, దుర్విభావ్యంబు, శత్రుసూదనంబు, బలకరంబు, జయదా
యకంబు, సర్వాస్త్రరాజంబు, నత్యుత్తమసాధనంబు, సమంత్ర
కంబునగు, బ్రహ్మాస్త్రసాయకంబు రావణావదారణంబు చాపంబున
సంధించిన.

మ. క్షితిగంపించె సముద్రముల్గలఁగెఁ బ్రమ్మొ-గ్గెన్ దిగ్గజశ్రేణి ప
ర్వతసంఘంబు వడంకె మిన్నుమొరసెన్-రాలెన్ మహోల్కాతతుల్
గతిదప్పెన్ గ్రహపఙ్క్తిక్రింబడియె-నుగ్రస్ఫీతనిర్ఘాతముల్।
దితిజవ్రాతము నేలఁగూలెఁ గవసెన్-దిగ్ధూమముల్వెల్లుగన్ ॥ 133

వ. ఇట్లతిరౌద్రరసాదిర్భావ దుర్భరంబుగా బ్రహ్మాస్త్రంబు వింటస
ధించి వారాశిబంధించిన యాధనురాగ్రేసరుండు రావణాసురు
ని శిరంబవలీలఁద్రుంచి విజయలక్ష్మీసమేతుండై తేజరిల్లెనంత ది
క్కులు వికాసంబునొందె సురభిశీతలమంద పవనంబులొలసెనా
దిత్యాదిగ్రహంబులు ప్రకాశించె. లోకంబులు నిర్భీకంబులయ్యె.
పురందరాది బృందారకులమందానందంబు డెందంబులం గ్రందుకొ
న దేవదుందుభిధ్వానపూర్వకంబుగాఁ బుష్పవర్షంబు గురిసె గంధర్వ
గానంబు చెలంగె రంభాదిసురాంగనాలాస్యప్రసంగంబు రాణించె సి
ద్ధమునిచారణవిరచితాశీర్వాదనాదంబులు బోరుకలంగె. ఈప్రకారం

బునరావణసంహారంబుగావించి విభీషణునకు లంకారాజ్యపట్టాభిషే
కంబు సేయించి సురగరుడగంధర్వకిన్నరసిద్ధసాధ్య విద్యాధరత
పోధనసముచ్చితుండును సుగ్రీవాదివానరసైనికపరివృతుండు
ను సీతాలక్ష్మణసహితుండును నై పుష్పకంబెక్కి యకౌసల్యాసూ
నుండు సకలజగజ్జేగీయమాన పుణ్యశ్లోకధురంధరుండై గంధమాద
నపర్వతంబునకుం జనియెను। ౧౩౪॥

క. సురమునిసన్నిధి రాముఁడు।
తిరముగ శోధింపఁ బుడమి-త్రిజగన్మాతం।
గిరిజోపేతంగోముల।
చరణసరోజాతనవి-జాతన్ సీతన్॥ ౧౩౫॥

వ. అంత॥ ౧౩౬॥

శా. సీతాలక్ష్మణసంయుతున్ వికచరా-జీవాస్యు భాస్వత్తనూ।
జాతాదభ్రవగారివ్రాతున్ దివిజసం-సత్పూజితుం దాపసో।
పేతున్ రాముని రావణాంతకు గుణా-బ్ధిన్ దండకారణ్యవి।
ఖ్యాతావాసులు మూఁడవచ్చిరి మునుల్-కౌతూహలంబొప్పఁగన్॥

గీ. వచ్చిమౌనులు జయజయ-ధ్వనులు చెలఁగ।
రాముఁ డభిరాము జానకీ రమణుఁ గాంచి।
యెదుట సంభ్రమంబునఁ గుఱుకొని-హృదయవీధి।
నింపు జెలుపొత్తనుతి జేసి రిప్పినమున। ౧౩౭॥

గీ. జగదనుగ్రహకారికి శాశ్వతునకు।
జగమరావణమొనరింప-జగతియందు।
నవతరించినవారికి-వారికి రామ-
చంద్రునకు మొక్కెదము నీకు-జలజనాభ॥ ౧౩౮॥

గీ. తాటకాంతకునకుఁ గాధి తనయయాగ।
పాలునకు దుష్టమారీచ-భంజనునకు।

ఘోరబాహుసుబాహుసం-హారునకును।
బ్రణతులొనరించెదము నీకుఁ-బరమపురుష॥ ౧౪౦॥

క. గౌతమపాణిగృహీతీ।
పాతకమోచనవిధాన-పటుతరపదకం।
జాతస్ఫీతపరాగ।
వ్రాతునకాద్యునకు నీకు-వందనమభవా॥ ౧౪౧॥

గీ. ఖండపరశుశరాసన-ఖండనునకు।
జనకకన్యాకరగ్రహోత్సవకరునకు।
భార్గవవినిర్గళాగ్రహ-భంజనునకు।
నంజలిపుటించెదము సరో-జాక్ష నీకు॥ ౧౪౨॥

గీ. ఎలమిఁ గైకకువరయుగం-బడినతండ్రి।
పలుకునిక్కముపాలింప-భార్యతోడ।
ననుఁగుసైదోడుతోడఁ గా-ననము జేరి।
నిలిచినగుణాంబురాశికి-నీకుశరణు॥ ౧౪౩॥

సీ. భరతసంప్రార్థనా-బలపత్తపాదుకా,
ద్వయునకు శరభంగ-తాపసేంద్ర।
సురలోకసంప్రాప్తి-కరునకు సాధువి,
రోధివిరాధని-రోధనునకు।
ప్రాప్తగృధ్రకులాది-రాజసఖ్యునకును,
మాయావిమారీచమర్దనునకు।
బాహుమదాంధక-బంధచ్ఛేదనునకు।
శబరిసమర్చిత-చరణునకును।

గీ. వానరాధీశసఖునకు-వాలివధవి।
ధాయికినగాధసింధుబం-ధనునకఖిల।
రాక్షసవినాశకరునకు-రావణాంతి।
కునకునర్పింతువందనము నీకు-వనజనాభ॥ ౧౪౪॥

క. దారుణసంసారార్ణవ।
తారకపాదారవింద-దాసవివత్సం।
హారజగదేకరక్షణ।
కారణమొసిగెక్కొదమునీకుం-గరుణాజలధీ। ౧౪౫॥

గీ. భక్తరక్షణదీక్షితపరమపురుష।
సచ్చిదానందవిగ్రహ-సర్వజనక।
నామరూపకజనదోష-నాశయీశ।
కేశవనిరీశమమ్ముర-క్షించుమభవ॥ ౧౪౬॥

క. రక్షోరక్షితదశముఖ।
రాక్షసునివధించిజగము-రక్షించితిసో।
పేక్షణమమురక్షింపుము।
రక్షింపుములోకనాధ-రఘుకులతిలకా॥ ౧౪౭॥

వ. ఇట్లుస్తోత్రంబుచేసిసకలమునులూరకుండిరి. ఈరామస్తోత్రంబు త్రిసంధ్యంబు భక్తిపూర్వకంబుగాఁ బఠించువాఁడు భుక్తిముక్తు లుపడయు ప్రయాణకాలంబునఁ బఠించువానికి భయంబునివ ర్తించు. భూతప్రేత భేతాళగ్రహంబులునశించు. సకలలోక బాధలడంగు॥ ౧౪౮॥

సీ. పుత్త్రకాముఁడుగాంచుస-త్పుత్త్రమణుల।
కన్యచక్కనిపతిఁబొందు-ఘనతమెఱయ।
మోక్షకాముఁడుగన్గొను-మోక్షమర।
కాముఁడగువాఁడుజెందుఁబు-ష్కలధనంబు॥ ౧౪౯॥

క. ఈరామస్తవరాజం।
బారూఢిఁబఠించునట్టి-యనఘాత్ములకుం।
గోరికలెల్లలభించును।
శ్రీరామస్వామికరుణ-చేననిశంబున్॥ ౧౫౦॥

సీ. అంతరాఘవుఁడు సం-యమిపుంగవులకు సా,
ష్టాంగప్రణామంబు-లాచరించి।
సమధికభక్తినం-జలిపుటంబు ఘటించి,
యిట్లని పల్కె ము-నీంద్రులార।
సంశుద్ధికై సర్వ-జనసంఘములకేను,
ప్రాప్యుఁడ మద్దృష్టి-పథముఁ జేరు।
జంతువు మోక్షభా-జనము నందియము తే,
దైవనిచ్ఛలు నిర-హంకృతులను.

గీ. స్వాత్మలాభ సంతుష్టుల-నధిక శాంత।
చిత్తులను సర్వభూతసు-హృత్తములను।
దాంతులను విప్రులను సర్వ-దా భజింతుఁ।
ప్రేమమిగురొత్త బ్రాహ్మణ-ప్రియులనగుట॥ ౧౫౧॥

క. మిమ్మెక్కటి యడిగెదఁ జీ।
త్తమ్ములఁ జింతించి నిశ్చి-తము జేసి గతా।
హమ్మతులార వచింపుఁడు।
సమ్మదమున నాకు మీరు-సౌహార్ద్రమునన్॥ ౧౫౨॥

గీ. పఙ్క్తికంధరవధమునఁ-బాపమెద్ది।
గలిగె నాయందు నమ్మహా-కలుషమునకు।
నిష్కృతి వచింపుఁ డెద్దాని-నేనొనర్చి।
పాపముక్తుఁడనగుదునో-భవ్యులార॥ ౧౫౩॥

వ. అని యడిగిన నమ్మహాత్మునకమ్మహామును లిట్లనిరి. ౧౫౪॥

గీ. నిత్య సత్యవ్రతాచార-నిగమవినుత।
లోకరక్షాధురంధర-లోకనాథ।
కలుషసంహారలోకోప-కారముగశి।
వార్చనము సేయుమంబుజా-తాయతాక్ష॥ ౧౫౫॥

ఉ. ఏపున గంధమాదనమ-హీధరశృంగమునందు లింగసం।
స్థాపనమాచరింపుదురి-తవ్రజశాంతికి లోకసంగ్రహా।

వ్యాపృతబుగ వెధవళి-వారిజలోచనశంభులింగసం।
స్థాపనజన్య పుణ్యము వి-ధాతకు నైనవచింపశక్యమే॥ ౧౫౬॥

గీ. శ్రీలు మెఱయభవత్ప్రతి-ష్ఠితమహీశ।
లింగదర్శనమునజనా-ళికలభించుఁ।
గాశిశివలింగదర్శన-కలనకంటెఁ।
గోటిగుణితఫలంబుస-ద్గుణపయోధి॥ ౧౫౭॥

క. ఈలింగమునీనామము।
చేలోకమునం బ్రసిద్ధిఁ-జెందునిప్పుడా।
భీలాంహోఘగహనోగ్ర।
జ్వాలానలమగుచుసాధు-జనసులభంబై॥ ౧౫౮॥

క. రామేశ్వరనామంబున।
సీమహిసీమహితలింగ-మిమ్ముగ వెలయున్।
రామువిలంబము సేయక।
సేమముగశివప్రతిష్ఠ-సేయుము నెమ్మిన్॥ ౧౫౯॥

క. అవినవినిపుణ్యకాలము।
జనపతిదివ్యముహూర్తముగ వి-చారించి ప్రభం।
జనతనయుని నెనరెనయం।
దనచెంతకుడాయఁబిలచి-తగనిట్లనియెన్॥ ౧౬౦॥

గీ. ఆంజనేయుహనూమంత-యనిలతనయ।
శంభుపదమగు కైలాస శైలమునకుఁ।
బొరిమనోవేగశాలివై-పొమ్ముసంప్ర।
తిష్ఠ సేయంగలింగంబుఁ-దెమ్మునీవు। ౧౬౧॥

క. పతియిట్లాజ్ఞాపించిన।
నతిశయముగఁ బుణ్యకాల-మతఁడుముహూర్త।
ద్వితయవ్యవధానముగా।
మతినెఱిఁగి ప్రమోదమాన-మానసుఁడగుచున్॥ ౧౬౨॥

కల్పితసురతాంతిమ శ్రమాపనోదక నవకిసలయతల్పంబులచేతను తరుణారుణకిరణసంతతి ప్రతిమల్లపల్లవసముల్లసద్బిల్వ తరువాటికాంతరనిరంతర పురాంతక చింతనామృతరసానుభవపులకితప్రతీక యోగికులాగ్రగణ్యులచేతను నికుంభకుంభోదర భృంగిరిటాది మహాప్రమథపరిచారక నిరంతరసంతాడ్యమానఢక్కాడమరుడిండిమపటహపణవాదివాదిత్ర నాదసంగతమారుతపూరితగుహాఘోషంబులచేతను, పంచబ్రహ్మపంచాక్షరప్రముఖనిఖిలశైవమంత్రరాజజపానుష్ఠాన నిష్ఠోత్సుకశుకపికశారికామయూర సమాశ్రితవితతవివిధవాసనానవాధసకలర్తు ప్రత్యగ్రప్రసూన పరిష్కృతలతావితానపరిరంభసంభోగ సుఖాలసమలయపవనసంచారసమంచితోపవనంబులచేతను, ప్రియాంగనాభుజాలింగితకంధరగంధర్వపాణిపంకజపరిగృహీతయాతాయాతజాతరూపడోలికాపాశపరిణద్ధవిటపవిలసదనిమిషతరువాటికానికామ రమణీయాధిత్యకాభాగంబులచేతను, నభిరామంబై పార్వతీపరమేశ్వరయశోరాశియుంబోలెం బ్రకాశించుకైలాసపర్వతరాజంబు దర్శించిరోమాంచకంచుకితశరీరులై అనేకదండప్రణామంబులు గావించియందులింగరూపధరుండైన మహేశ్వరుండు దృష్టిగోచరుండుగా కున్న మరున్నందనుండు ప్రాగగ్రకుశాసనసమాసీనుండును, ఊర్ధ్వబాహుండును నిరాలంబుండును, నిరుచ్ఛ్వాసుండును, జితేంద్రియుండునునై తపంబుగావించి పరమేశ్వరునారాధించి ప్రసన్నునిం జేసి లింగంబువడసి నంతలోనందత్వవేత్తలగు మహామునులు హనుమంతునాగమనంబు లేమియుం బుణ్యకాలంబు స్వల్పావసిష్టంబగుటయు నెఱింగి రఘుపుంగవునితో నిట్లనిరి. ౧౭౫॥

క. అయ్యా హనుమంతుఁడు రాఁ
డయ్యె నుమటిపుణ్యకాల మతిసన్నిహితం౧।

బయ్యోనికమించిచనునీ।
వియ్యోడఁదడవేలచేసె-దినకులతిలకా॥ ౧౬౬॥

గీ. పావనాచారజానకీ-దేవిరొద్ది।
లీలఁగావించెవాలుకా-లింగమిచట।
నిదియనీవుప్రతిష్ఠింపు-మిపుడుదీని।
కంటెనుత్తమమైన లిం-గంబుగలదె॥ ౧౬౭॥

క. అనిమునులువిన్నవించిన।
వినిజానకితోడరామ-విభుఁడెలమినిగ్।
కుర్వనిత్తరిఁగృతమంగళ।
ఘనకౌతుకుఁడగుచుమౌని-గణములతోడన్॥ ౧౬౮॥

వ. జ్యేష్ఠమాససితపక్ష దశమీ సౌమ్యవారంబున హస్తనక్షత్రంబున వ్యతీపాతయోగంబునం, గన్యయందుఁజంద్రుండు, వృషభంబున సూర్యుండునుండ నిట్టి దశయోగ పుణ్యకాలంబున సేతు మధ్యంబున గంధమాదనపర్వతంబునందు. ౧౬౯॥

ఆ. నిలిపెరాఘవుండు-నీలకంధరునిలో।
కైకగురునివాంఛి-తార్థకరుని।
చంద్రశేఖరునిన-గేంద్రకన్యామనో।
హరునిలింగమూర్తి-ధరునిహరుని॥ ౧౭౦॥

క. లింగస్థితునీశానున్।
గంగాధరునభవునీల-కంధరుగౌరీ।
సంగతునిఁబుంగవేంద్రగతు।
రంగునిశివుఁబూజచేసె-రఘుపతిభక్తిన్। ౧౭౧॥

ఆ. అంతలింగమూర్తి-యందునిల్చినసాంబ।
శంకరుండుకడుఁబ్ర-సన్నుఁడగుచు।
రాఘవునకులోక-రక్షకునకువరం।
బిచ్చెఁగరుణవెలయ-నివ్విధమున॥ ౧౭౨॥

ఉ. భూతలనాథచంద్రరఘు-పుంగవనిశ్చలభక్తినిండునీ।
చేతఁబ్రతిష్ఠితంబయిన-శ్రీశివలింగముఁజూచియీమహా।
పాతకులైనవారికినిఁ-బాపములెల్లవినాశమొందుఁగా।
జ్ఞాతహితప్రకాశమున-సంతనుసంబులణంచుక్తైవడిన్॥ ౧౭౩॥

గీ. మనుకులేంద్రధనుష్కోటి మజ్జనమున।
రామనాథేశలింగద-ర్శనమువలన।
నవిశదుస్తరదురితము-ల్విలయమొందు।
సత్యమీవచనంబుసం-శయములేదు॥ ౧౭౪॥

క. ఇత్తెఱఁగున నత్తఱి నిమ।
హోత్తరము నవర మొసంగి-యాభవుఁడు హిమాభ్రూ।
భృత్తనయేశుఁడు రవివం।
శోత్తమునకు రాఘవునకు-నుపతరకరుణన్॥ ౧౭౫॥

క. అందముగ రామనాథుఁ।
ముందట నందీశుఁ బ్రమథ-ముఖ్యనమందా।
నంద్రప్రచు నిలిపెశ।
స్యందనసందనుఁడౌవిభు-లభినందింపన్॥ ౧౭౬॥

క. పాత్రికటముగ నీశ్వరుఁ గ్రి।
షే కారనుచాపకోటి-చేనాపుణ్య।
శ్లోకుఁడు ధరఁ భేదించెను।
హాసుంఘంబోటిఁజేసె నచ్చటనంతన్॥ ౧౭౭॥

క. తజ్జలములఁగొని శివునకు।
మజ్జనవిధిఁ బలిపె రామమనుజేంద్రుఁడుఁగా।
మజ్జనముతేమ తీర్థము।
సజ్జనములాపకోటి సంజ్ఞవహించెన్॥ ౧౭౮॥

మ. సురలున్ సిద్ధులుసాధ్యులుస్సులుయ-క్షాల్ నాగగంధర్వు।
న్నరవిద్యాధరులప్సరోగణమునా-నావానరుల్ హాలితో।

సురనిష్ఠావిభవానుషక్తమతులై-యొక్కొక్క లింగంబుని।
ల్పిరి సేతుస్థితగంధమాదనమహా-పృథ్వీధరేంద్రంబునన్॥ ౧౭౯॥

గీ. ఇట్లు వివరించితిని మైథి-లీశకృతహ।
రప్రతిష్ఠాపనప్రకా-రంబు మీకు।
నిది పఠించిన వినిన రా-మేశలింగ।
సేవనఫలంబు మోక్షంబుఁ-జెందు నరుఁడు॥ ౧౮౦॥

వ. అని సూతుండు చెప్పిన విని శౌనకాదిమహర్షులు తదనంతర కథావి
ధం బెట్టిదని యడిగిన ౧౮౧॥

మ. వనిత్రేపతటాక దేవగృహ శా-ఖ్యబ్రాహ్మణోద్వాహనం।
దనసంజ్ఞాసముదగ్రసప్తవిధసం-తానస్వతంత్రార్థ్యము।
ల్లనమంత్రీశ్వరమానసాంబురుహ షట్-లాలోలరోలంబకాం।
చనగర్భాదిసుపర్వరక్షణకళా-జాగ్రత్కృపావీక్షణా॥ ౧౮౨॥

క. పశ్వల్లలాటదురితా।
వశ్యాయసహస్రకిరణ-వర్షాకాలా।
భర్మశ్యామలకంధరధృ।
గ్దృశ్యపరిజ్ఞానవేద్య-దివ్యాకారా॥ ౧౮౩॥

## భుజంగప్రయాతము.

ఫణిస్వామిమంజీర-భాస్వత్పదాబ్జా।
రణత్కోణివిభ్రాత-రాజించరాఘా
గణేశాదిశైవాగ్ర-గణ్యాభినంద్యా।
గుణీభూతదృక్కర్ణ-గోత్రేంద్రచాపా॥ ౧౮౪॥

గద్య:— ఇది శ్రీమదుమామహేశ్వర కరుణాకటాక్షవీక్షాపాత్ర,
యేనుగ లచ్చయామాత్యపౌత్ర, తిమ్మనామాత్యపుత్త్రి,
వివిధ విద్వజ్జనవిధేయ, లక్ష్మణకవినామధేయ ప్రణీ
తంబయిన రామేశ్వరమాహాత్మ్యంబను
మహా ప్రబంధము నందుఁ
ద్వితీయాశ్వాసము.
శ్రీ. శ్రీ శ్రీ.

శ్రీ ర స్తు.

# రామేశ్వరమాహాత్మ్యము.

## తృతీయాశ్వాసము.



రుచిరకలశజలధిగ।
క్షీరోత్స్నతభద్రిరాజు-క్షీమాగ్రతనూ।
జారాధితచరణకృపా।
పూరితగురజానపల్లి-పురమల్లేశా॥ ౧॥

వ. అవధరింపుము శౌనకాదిమహర్షులకు సూతుండిట్లనియె. ౨

చ. ఇటువలె రామచంద్రుఁడుమ-హేశ్వరలింగమునిల్పనంతటం।
బటుజవశాలియైనహను-మంతుఁడుకాశ్యనగంబునుండియు।
త్కటగతిరెండులింగములు-గైకొనివచ్చికుతూహలంబుని।
వ్వటిలఁగఁజేరిమ్రొక్కెరఘు-వర్యునకున్ ధరణీతనూజకున్॥ ౩॥

క. ఆవెనుకను లక్ష్మణుఁడు।
గ్రీవులకున్ మ్రొక్కి-యతఁడు-గృతమతిసీతా।
దేవీసైకతలింగము।
శ్రీవెలయఁగఁ బూజసేయు-శివభక్తినిధిన్॥ ౪।

ఆ. మునిసమేతు రాఘ-వునిఁ జూచి కోపంబు।
గిరలఁ బరమఖేద-ఖిన్నుఁడగుచుఁ।
దనపరిశ్రమంబు-పనిలేక చెడుటకు।
ఏగచిన్నపుచ్చకనియె-వాయుసుతుఁడు॥ ౫।

సీ. కేవలక్లేశభు-క్తికి నైజగంబునఁ,
బుట్టినాఁడను నేను-భూతలేంద్ర।
యున్కు-మీఱినపెన్కు-రక్కసిమూకచే,
ననిలోనఖిన్నుండ-నైతిమిగుల।
జగతినోకానోక-సరసిజాతాక్షియుఁ,
గనదుగానావంటి-కాన్పునెచట।
భవసాగరంబులో-పలమునింగియునంత,
బాధలకల్లఁ బా-ల్పడితినహహ।

ఆ. మున్ను సేవఁజేసి-ఖిన్నుండనైతిని।
కలహభూమిఁ జాల కష్టినైతి।
నమితదుఃఖరాశి-నైతినీచేనవ,
మానమొందియుండు-మనుకులేంద్ర॥ ౬॥

క. సేవించెభార్యకై సు।
గ్రీవుఁడునిను రాజ్యసిద్ధి-కి న్సేవించెన్।
రావణానితమ్ముఁడూరక।
సేవించితి నేనుభక్తి-సేవధినిన్నున్॥ ౭॥

క. వానరుల నేనులుండఁగ।
నేనాజ్ఞాపించఁబడితి-నీ శేషవలిం।

గాంచియు నార్తము రొప్పఁగ।
హాసగ మునకరుగుమనుచు-నంబుజనయనా॥ ౯॥

శా. కైలాసాద్రికి జానకీరమణ శీఘ్రంబేగి లింగాకృతిన్।
నీలగ్రీవుని నందుఁ గానక తపో-నిష్ఠన్ మహాదేవునిన్।
బాలేందూజ్జ్వలమౌళి సాంబశివునిన్-ఫాలాక్షు మెప్పించి నే।
పాళించ తత్ప్రపలింగముం బడసియు-యాప్యావచ్చితిన్ గ్రక్కునన్।

క. ఇతరంబగు లింగము నై।
కతమునఁ గావించె దేవ గంధర్వముని।
ప్రతితుల తోడన్ సత్కృ।
ప్రతియిటు బూజింపుమన్న-వాఁడె వృకోఁకన్। ౧౦॥

గీ. దేవరజితాద్రినుండి నా-తెచ్చినట్టి।
యీమహేశ్వరలింగము-నేటికహాహా।
యువతిలోమందభాగ్యంపు-నైననాదు।
తనువుభారంబునకయప-తారమొందె॥ ౧౧॥

ఆ. ఊదురంతశోక-మేను సహింపఁగాఁ।
జాలనయ్యె ధరణి-పాలసల్లకి।
యేమి సేతునింక-నెప్పటికేనుదు।
తెలిసి చూడ నాకు-దిక్కులేదు॥ ౧౨॥

క. కావున దేహత్యాగముఁ।
గావించెదనను మునీప్ర-కారంబున నెం।
తేవగచి పుడమిఁ బడియు।
వ్వావదిగ దుర్గోపశోక-పరవశుఁడయ్యెన్। ౧౩॥

ఆ. అతనిఁ జూచి మంద-హాసంబు సేయుచు।
సురలు మునులుఁ గపులుఁ-జూచుచుండ।
మధురభాషణముల మారుతాత్మజు శోక।
మెల్లఁ దొలఁగ రాముఁ-డిట్టులనియు॥ ౧౪॥

ఆ. మహిని జాతజాయ-మానమృత ప్రాణి।
వర్తనంబు నాత్మ వర్తనంబు।
నంతటంగ సీమ-నంతయు నెఱుఁగుదు
నెల్ల చేష్టలందు-నిజతేజ ౧౪॥

ఆ. పుట్టు వెఱుఁగు మఱుదుఁ-బొలియు నొక్కట-ఁజేరి।
కంబుఁ జెందు జనుఁడు-కర్తగాని।
పరమపుణ్యశీల-పరమాత్ముఁ డెప్పుడు।
నిర్గుణుండు సుమ్ము-నిత్యమహిమ॥ ౧౫॥

సీ. ఇట్టి తత్త్వము నిశ్చ-యించి శోకము మాను,
మగఁటి వీగని-రంజనంబు।
లింగత్రయ విముక్త-ముం గేవలము నిరా,
శ్రయము నునిర్వికా-రంబు జ్యోతి।
రాత్మకంబును నైన-యాత్మ నుదర్శింపు,
మాత్మబోధ నిరోధ-మైన శోక।
మేలచేసెద వునీ-వెల్ల కాలముఁ దత్వ।
నిష్ఠఁ గైకొనుము ని-ర్నిద్ర దృష్టి।

గీ. ఆత్మచింత యొనర్పు దే-హాదికమున।
మమత విడువుము ధర్మంబు-మట్టుపరము।
మనఘమానము పాలింపు-మనము సాఘు।
జనుని సేవింపు మింద్రియా-జయముఁ గనుము॥ ౧౬॥

క. పరనింద సేయకుము హరి।
హరముఖ్య సమస్త దేవ-తార్చనము నిరం।
తర మొనరింపుము సుగుణా।
కర పలుకుము సూనృతంబుఁ-గల కాలంబున్॥ ౧౭॥

ఆ. తాను బ్రహ్మ మగుట-తత్త్వంబెఱుంగమి।
ప్రబలమగు చుమోహ-భరము గమ్మెఁ।

బొసఁగ దానియందుఁ-బొసఁగె శుభాశుభ
భ్రాంతి నిజము వోలెఁ-బవనతనయ॥ ౧౯॥

గీ. శుభము గాని పదార్థంబు-శుభము వోలెఁ
గానఁబడు మోహవైభవ-కలన వలని
భ్రాంతులకు రాగ ముదయించు-రాగపాశ
బద్ధులై పుణ్యపాపైక-పరతఁ జెంది॥ ౨౦॥

క. సుర విద్యాధర యోనుల
నరిదిగఁ బ్రభవింతు రుగ్ర-యాతనలకు నా
కరమగు నరకముఁ జెందుదు
రరిసూదన మోహవశత-నఖిలప్రాణుల్॥ ౨౧॥

సీ. కస్తూరి చందనా-గరు సుగంధంబులె
ద్దానినంటిన మలం-బై నశించు
భక్ష్యభోజ్యాది భ-వ్యపదార్థంబులె
ద్దాని సోకిన నశు-చిత వహించు
ధవళదుకూలవ-స్త్రంబులెద్దానినిం
గమన మాలిన్యంబు-గడు భరించుఁ
గలిత సుగంధి శీ-తలజలపూర మె
ద్దాని సంగతి నిమూ-త్రమనఁ బరగు॥

గీ. నట్టి దేహంబు సుఖకరం-బగుట యెట్లు
వినుము చెప్పెద నంజనా-తనయ నీకుఁ
బరమతత్త్వరహస్యంబు-భవమునందు
జంతువులకును సౌఖ్యలే-శంబు లేదు॥ ౨౨॥

ఆ. మొదట జన్మమొందుఁ-బదపడి బాల్యంబుఁ
జెందు జవ్వనంబుఁ-జెందు మఱియు
నంతముదిమిఁ జెందు-నంతట మరణంబుఁ
జెందు మరల జనన-మొందు నరుఁడు॥ ౨౩॥

క. మానవుఁడివ్విధమునన।
జ్ఞానంబున వాటఁ జెందు-సంతతమయ్యా।
జ్ఞానము దొలఁగిన నుత్తమ।
మైనమహాసుఖముఁ జెందు-ననిలతనూజా। ౧౪॥

క. జ్ఞానమువలనం జెడును।
జ్ఞానము కర్మమునఁ జెడదు జ్ఞానము నాఁబ్ర।
జ్ఞానిలయము పరబ్రహ్మ।
జ్ఞానము వేదాంతవాక్య జనితంబును మీ॥ ౧౫॥

గీ. అట్టియెరుక విరక్తుఁడౌ-నట్టిమాన।
వునకు నుదయించుఁ గాని యు-న్యునకుఁ గాదు।
జగతి ముఖ్యాధికారికి-సంభవించు।
జ్ఞానవిభవంబు గురునిప్ర-సాదమహిమ॥ ౧౬॥

గీ. అంతరంగస్థితములు కా-మాదులెపుడు।
విడుచు మానవుఁ డాత్మసం-వేదియగుచు।
నపుడు బ్రహ్మస్వరూపుఁడై-యమరు నతఁడు।
శాంతమానస వినుము కే-సరికుమార॥ ౧౭॥

క. మేలుకొనునతని నిద్రా।
శీలుని భుజియించునతని-స్థితుఁడగువానిం।
బాలిశును స్వత్తుంగల।
కాలముఁ జేకొను మనుండుఁ-గాలుఁడు జనులన్॥ ౧౮॥

గీ నిశ్చయము సంక్షయాంతముల్-నిచయములు స।
ముచ్ఛ్రయంబులు పతనాంత-ములు దలంప।
నరయ సంయోగములు వియో-గాంతములగు।
జీవితము మరణాంతంబు-సిద్ధమనఘ॥ ౧౯॥

క. పతనమునకుం బెఫలసం।
తతులకుఁ బెరచోటభయము దగలనికరణిన్।

క్షితిఁబొడమినజంతువులకు।
మృతికంటె భయంబులేద-మిథ్యావచనా॥ 30॥

సీ. పటుతరస్తంభసం-ఘారమైనగృహంబు,
కాలంబుచనజీర్ణ-కలనఁజెందు।
నశియించుకరణి నా-నాప్రాణినికరంబు,
వాలాయమునుగమృత్యు-వశతనడఁగు।
దినములు రాత్రులు-చనచనసర్వమా,
నవులకాయుష్యంబు-నాశమొందు।
నాత్మనుశోకింప-నగునన్యమునకేల,
శోకంబెదవుతెల్వి-లేకనీవు।

గీ. నెరయఁబరుపెత్తుచున్న వా-నికినిలిచి।
యున్నవానికి నైననా-యువునశించుఁ।
దానిసమవర్తియునుజను-దానినిలము।
దూరమరిగియుమృత్యువు-తోనమరలు॥ 3౧॥

క. పలితులుద్భవించుమేనం।
దల వెండ్రుకలెల్ల నెరియు-దంతములూడున్।
బలముడుగు శ్వాసకాసము।
లలముకొను స్మృతినిదేహ-మలజడినొందున్॥ 3౨॥

గీ. వరదకట్టియయొకచోట-వనధియందుఁ।
గలసియంతటవిడిపోవు-కరణిదార।
పుత్రబాంధవధనపశు-క్షేత్రవర్గ।
మొక్కచోఁగూడునెడఁబాయు-నొక్కవేళ॥ 33॥

సీ. చనుచున్న తెరువరిఁ-గనితోవనొకతెరు,
వరినేనునీతోడ-వచ్చెదనని।
యంతవారిద్దఱుఁ-గొంతకాలముగూడి,
చనిపెండియును భిన్న-సరణిజనిన।

పగిది భార్యాసుత-పరిభృతులకూటమి,
నశ్వరంబగుఁ గపి-నాథ వినుము।
మేని పుట్టువుతోడ మృత్యువు జనియించు,
నందేహమింతయుఁ-జెందవలదు।

గీ. భవవిమరణంబుఁ దప్పింప-బ్రహ్మకైన।
నలవి గాదు శరీరి దేహాంత వేళఁ।
గర్మవశుఁడై స్వతంత్రుఁడు-గాని నన్య।
తనువుఁ గైకొని మును వంటి తనువు విడుచు॥ ౩౮॥

క. కేసరిసుతకలకాలము।
నాసంబోకల్గోటఁ బ్రాణి-వర్గంబునకుం।
దాసమనూహదుకర్మము।
చేసర్వజనుల్వియుక్తిఁ-జెందుదురెందున్॥ ౩౫॥

క. ప్రాణంబులు దేహంబులు।
పోణిమి చెడుమనుజుఁ బ్రథమము లంజెందుజగ।
త్రాణాత్మజజన్ముని।
ర్యాణంబుం గలుగ నేర-వాత్మకు నెపుడున్॥ ౩౬॥

గీ. కాన శోకహరంబు వి-జ్ఞానమద్వ।
యంబు సద్రూపము మలంబు-నైన బ్రహ్మ।
మాత్మ భజింపుము-నారతంబు।
విగతశోకుఁడవగుము వి-వేకధుర్య॥

గీ. త్వత్కృతంబగు కార్యంబు-మత్కృతంబు।
మత్కృతంబగు కార్యంబు-త్వత్కృతంబు।
లీల నాయొనరించిన-లింగపూజ।
లీల నీయొనరించిన-లింగపూజ॥ ౩౭॥

వ. కావున నీనామంబున లింగప్రతిష్ఠఁ గావించిన ముక్తుండ వగుదువు. హరదత్తంబగు హనుమన్నామక లింగంబు చర్చించి రామనాథేశ్వ

రుం జూచిన నరుండు కృతకృత్యుండగు యోజనసహస్రదూరంబు
ననైన హనుమల్లింగంబు సంస్మరించి రామేశ్వరునిం దలంచి సా
యుజ్యంబు వడయుచుండునని రాఘవుండు మఱియు నిట్లనియె.

ఆ. అతఁడు చేసినాడు - యజ్ఞంబు లన్నియు।
సకలతపము లతఁడు - సలిపినాడు।
హర్షముప్పతిల్ల - హనుమదీశ్వర రాఘు।
వేశ్వరుల ను జూచు నెవ్వఁడైన॥ ౮౦॥

వ. హనుమత్ప్రతిష్ఠిత లింగంబును, రామేశ్వరలింగంబును, జానకీ లింగంబును, లక్ష్మణేశ్వరలింగంబును, సుగ్రీవకృతలింగంబును, సేతుకర్తయగు నలుండు నిలిపిన లింగంబును, అంగదేశ్వరలింగంబును, నీలస్థాపితలింగంబును, జాంబవదీశ్వరలింగంబును, విభీషణుండు గావించిన రత్న లింగంబును, ఇంద్రాది దేవతా ప్రతిష్ఠిత లింగంబును, శేషాది నాగరాజపూజిత లింగంబును, నను ద్వాదశరూపంబుల శివుండు సాక్షాత్కరించి రాజిల్లు సార్వకాలంబు నీలింగంబులందు మహేశ్వరుండు సన్నిహితుఁడై యుండుఁ గావున పాపక్షయార్థంబు శివలింగస్థాపనంబుఁ గావింపుము. ౮౧॥

క. కాకున్న మత్ప్రతిష్ఠిత।
సైకతలింగంబు కడు వె-సం దివియు మూర్ధా।
ర్వ్యాకరయుంత ట నిలిపెనఁ।
జేకొని నీ తెచ్చినట్టి - శివలింగంబున్॥ ౮౨॥

క లలిఁ బాతాళంబు రసా।
తలమతలము సుతలము నువి-తలలోకతలా।
తలములు భేదించి సము।
జ్జ్వలమైయీలింగము మరె వారదముఖ్యా॥ ౮౩॥

ఉ. నేనుముత్తోడ నేనిచట-నిల్పినయీశివలింగమూర్తినీ।
సామినివీకతోఁదివియఁ-జాలెదులావరియున్న వాఁడెసం।
గ్రామజయాఢ్యలింగమిటఁ-గైకొనిపెల్లగిలంగఁజేయుము।
ద్దామతనీదులింగము-దంబునవిల్పుముమామశోకముల్॥ ౪౪॥

చ. అనవుఁడుసంత,సంబునద-శాననవైరికిమ్రొక్కియంజనా।
తనయుఁడుగ్రక్కునం బెటికె-దల్ సికతామయలింగమేనురా।
ప్యాఁగమునుండితెచ్చి,స-మంచితలింగమునిందునిల్పెదల్।
వినకరిలింగసైకతవి-ఛేదనముంబనియేతలంపఁగన్॥ ౪౫॥

సీ. అనివిచారముచేసి-హనుమంతుఁడంతటఁ,
దమకంబుమదినిసం-దడిగొనంగ।
సురలునుమునులువా-నరులుదైత్యులురఘు,
స్వామిసౌమిత్రియు-జానకియును।
గనుఁగొనుచుండసై-కతలింగమూర్తినిఁ,
గరమునఁగొనియత్న-గౌరవమున।
లావునవటునిటు-లాడిచలింపంగఁ,
జేయఁ మఁగదలంగఁ-జేయలేక।

గీ. కిలకిలధ్వనిసేయుచుఁ-గేశవఘుఁడు।
తోకనిగుడించిరెండుచే-తులునుబొదివి।
యూచిబెరికియుఁబెకలింప-నోపఁడయ్యె।
నవనిఫలయుక్తమగునెదు-రాగ్రహంబు॥ ౪౬॥

వ. అంత. ౪౭॥

మ. అమితోదారబలుండువాయుతనయుం-డాలింగమున్వాలపా।
శమునంజుట్టిబిగించితీవ్రముగహ-స్తంబుల్ భువిన్మోపి వే।
గమునిండారఁగనభ్రవీధికెగసెన్-గాఢోద్ధతిన్ భూమిచ।
క్రము శైలంబులతోనరణ్యములతోఁ-గంపంబునొందింపుచున్॥

ఆ. ఇట్లుగగనవీధి-కెగసిరాఘవలింగ।
మునకుఁగ్రోశమాత్ర-మునననరుండు;

పుడమిఁ ద్రెళ్ళి మూర్ఛఁ-బొందె వడఁకుచు।
శివవిరోధి మేలుఁ-జెందువాఁడె॥ ౪౯॥

ఆ. పుడమిఁబడియెగాఢ్వ-కొడుకుముక్కునోటఁ।
గన్నుదోయివలనఁ-గర్ణరంధ్ర।
ములనపానమార్గ-మునఁ జాల నెత్తురు।
గురిసి నిండె రక్త-కుండమయ్యె॥ ౫౦॥

వ. అంత దేవదానవ తపోధన నరవానరులు హాహాకారంబుఁ జేసిరి. రామలక్ష్మణులు సీతాదేవియు నంతరంగంబుల నెంతయుఁ జింతింపుచు శోకవ్యాకులత్వంబు నొందిరంత నందఱు నాజని ఘూర్ణితగాత్రుండై ధాత్రిం బడి రక్తంబుఁ గ్రక్కుచు మూర్ఛిల్లియున్న మహినందనుం జూచి కపులు పుడమిం బడిరి. జానకీదేవియు వాత్సల్యంబునం గరపల్లవంబులం దదీయ దేహస్పర్శనంబు సేసి తండ్రీ నీకిట్టి దుర్దశ వాటిల్లెనే యని వగచె రాఘవుండు బాష్పధారాకులలోచనుండై తనతొడమీఁద నతని నిడుకొని కరకమలంబుల నెమ్మేను నిమురుచు నిట్లనియె.

క. ఊనులమగుమాముజంపా।
కాననమునఁ జూచి మేలుఁ-గావించుటకై।
భానుజునితోడ సఖ్యము।
మానుగఁ జేయించితివిస-మంచితవృత్తిన్॥ ౫౨॥

క. అ ఘూరిన్నుఁ గనుంగొని।
జననీజనకులను బంధు-జాతములను చే।
రొన్ని తలఁచమునీయుపకృతి।
గొనకొని యెంతనిపచింతు-గుణరత్ననిధీ॥ ౫౩॥

సీ. బహుయోజనంబైన-పాథోనిధానంబు।
తివిరి నాకై దాటి-తివి మహాత్మ।
తలపాతము ఘనోట్టి-దట్టించితివి వీక,
నాకై నగేంద్రము మై-నాకు నసఘు।

సురగణంబులు మెచ్చ-సురసను నాగిమా,
త్సకసునా పైగెచ్చి-తివిగుణాఢ్య!
ఛాయాభిధానరా-క్షసి నిరీక్షించి తీ,
వధికదోశ్శక్తి నా-శైహారీశ!

ఆ. దినసమాప్తసమయ-మునను వేళము జేరి।
లంక పొంక మెఱుఁగి-శంక లేక।
పద్మముఖుని కళి-భవనంబులోనికి।
సరిగి తపిమదర-మనిలతనయు॥ ౫౪॥

క. వెళి వెతిఁగి నయిలలంకా।
పురిలో పలసీత వెదకి-పొడగానక మే।
దురము గునశోకవనమున।
కరిగి కనుంగొంటి వచట-నవనీపుత్త్రిన్॥ ౫౫॥

చ. కనుఁగొని సాగి మ్రొక్కి మణి-కల్పిత ముద్రిక యాన వాలుగా।
విలయ మెలర్ప నిచ్చి మన-వేణి యొసంగిన మానికంబుఁ జే।
కొని సుకుమారచారుసుమ-గుచ్ఛవిరాజదశోక కాననా।
వనిరుహ భంజనంబు బుధ-వత్సల సేయవె నా కమే లగాన్॥ ౫౬॥

వ. అంత. ౫౭॥

ఉ. శంక యొకింత లేక బహు-సైన్యుల రావణతుల్యులన్నిరా।
తంక బలాఢ్యులన్విజయ-ధాటికశీతిసహస్రవీరులం।
గింకర నామ దైత్యులని-క్ష్త్రిమ దైత్యుల సంగరక్షితిం।
బొంకమడంచి యంతకుని-ప్రోలికిఁ బంప వెవానరోత్తమా॥ ౫౮॥

చ. అని మునజంబు మాలిని-బహస్తకుమారుని సప్తమంత్రినం।
దనుల వధించి పంచప్రుత-నాపతులం బోలియించి దక్షున।
క్షునిఁ దెగటార్చి యంతట న-కుంరి తశక్తినిఁ దాళ్ళిఁ గట్టిగ।
కొన్నఁ గొని పో వరావణుని-కొల్వునకుం జని తీవ్రపావనీ॥ ౫౯॥

ఉ. ఆసభ లోన నిల్పి దను-జాధిపువాక్కుల ధిక్కరించి దు।
ష్టాసురు లెల్లఁ దల్లడిల-నాదట రావణు వీడు తండ్రి కెం।

తేసఖుఁడైనవహ్నికిన-త్రిప్రమదంబుగఁ గాల్చి క్రమ్మరన్।
ఖ్యాపురశక్తి నాటించి-పావనినీవు మహాపయోనిధిన్॥ ౭౦॥

గీ. అంతవచ్చితి యిబ్బుక్క మూఁ-కాద్రిపదకు।
నిష్టార్థంబున నాకైయ-నేక గతుల।
ననుగవింపి ఖేదమో-యాంజనేయ।
నాకసివంటిచుట్టము-న్నాఁడె యెందు॥ ౭౧॥

గీ. నీవునిడుకింపు చున్నావు-నేలమీఁద।
నాకుఁ బరిమితంబగు శోకమొందనఁ।
ప్రాణమొల్కొండవగు నీవు-బ్రతుకవేనిఁ।
ప్రాణములు నిల్చునే నాకుఁ-బవనతనయ॥ ౭౨॥

క. ఏమిపని నాకు సీతా।
సౌమిత్రులచేత భరత-శత్రుఘ్నులచే।
నేమి మహారాజ్యముచే।
నేమి భవద్రహిత సుఖము-లేటికి వత్సా॥ ౭౩॥

క. లెమ్ము హనుమంత భూమిత।
లమ్మున నిదురింప నేల-లలిఁ బల్లవపుం।
జమ్ముఁ జేయుము నిద్రా।
రమ్మిప్పుడు నాకు నొక్క-తల్పము వత్సా॥ ౭౪॥

సీ. స్నానంబు సేయంగఁ-జని యొదని ప్పుడు,
కౌని తెమ్ము చీరయుఁ-గుండికయును।
సురపూజనమునకు-సురభిపుష్పము లేర్చి,
పోసఁగఁ గోయుము పత్ర-పుటమునందుఁ।
గానలో కేగి-కందమూలంబులా,
హారమునకును దె-మ్మాదరమున।
వజినదర్భాంశుక-వ్రజసమాహరణంబుఁ,
గావింపువనాచార-మావహిల్ల।

గీ. జగములభినుతి సేయనో-షధులు తెచ్చి।
యన్నదమ్ములమమ్ము బ్ర-హ్మాస్త్రబంధ।
ముక్తులను జేసినాడవు శక్తిమెఱయ।
దాతవునులక్ష్మణప్రాణ-దాతవీవ॥ ౧౫॥

క. కేసరిసుతయని మౌనీ।
బాసటచే రావణాది-బలముల దైత్యా।
గ్రేసరుల గెల్చి లీలన్।
భూసుత నతిసాధ్వి మఱలఁ-బొందితి సుఖివై॥ ౧౬॥

ఆ. అంజనాకుమార-హనుమంత జానకీ।
శోకమునను సకల-లోకవినుత।
యుచితవృత్తిమమున-యోధ్యకుఁ దోడ్కొని।
చనక విడిచి నీవు-చనుట దగునె॥ ౧౭॥

క. ఓపౌలస్త్యమదాంతక।
యో పవనకుమారయోమ-హోన్నతబాహో।
టోపవిరాజితయోకరు।
ణాపరయోవత్సలేదిఁ-నన్గనుఁగొనుమీ॥ ౧౮॥

క. అనిబహుభంగులను పలా।
లనవచనము లాడి రఘుకు-లప్రవరుండా।
తనినోటిమాట లేమికి।
వనరుచుఁ గన్నీటఁ దడిపె-వాయుతనూజున్॥ ౧౯॥

వ. అంతఁ గొంతసేపునకు మూర్ఛ-విడనాడి ప్రబోధంబునొంది. ౨౦.

మ. కనియెన్మారుతి సర్వలోకపరిర-క్షాదక్షునంభోజలో।
చనులీలాధృతమానవాకృతి నివి-శ్వధ్యేయు నారాయణున్।
మునివంద్యున్ రణధూళిధూసరతనుం-భోవాహసంకాశు భూ।
తనయాలక్ష్మణవానరాన్వితు మహో-దారున్ హరిన్ రాఘవున్॥

క. కనిరఘువరకరసంస్ప।
ర్శనపరిపూర్ణాంగుఁడగుట-జగతీస్థలినో।

య్యనజాగి మ్రొక్కి మారుతి।
ఘనభక్తి దలిర్ప నిటల-ఘటితాంజలియై॥ ౭౨।

గీ. సారివలలాము తారక-బ్రహ్మనామ।
జానకీరాము జలధర-శ్యాము నతఁడు।
శ్రుతిమనోహారిగంభీర-సూక్తిగుంభ।
దోహాలంబుగ నుతిసేయ-నొడఁగెనిట్లు॥ ౭౩॥

దండకము.

శ్రీరామ విశ్వస్వరూపా హరీయాదిదేవా పురాణాగమాహస్తదేవా మహాపుష్ప కాశీనవార్ష్ణోల్ల సద్ధ్యానరానీక సంజుష్టపాదాబ్జ నిష్పిష్ట దుష్టాసురేంద్రా జగద్వాంఛితార్థప్రదానిర్మలాత్మా సహస్రోత్తమాంగా సహస్రాంఘ్రిపద్మా సహస్రాక్షనారాయణా! రాఘవాభక్తలోకార్తిహారీ మహీనందనావల్లభా నారసింహా సురారాతిరాడ్భంజనా హే త్రిమూర్తీ, నిశాతాగ్రదంష్ట్రోద్ధృత క్షోణిచక్రా అవక్రోజ్జ్వలద్విక్రమాశాంబరీ వామనాసిద్ధవంద్యా బలింద్రారియాగాంతకా మందరగ్రావధారీ మహాకచ్ఛపా వేదసంరక్షకా మత్స్యరూపా జితక్షత్రియా భార్గవ శ్రీస్థిరా రాత్రించరధ్వాంత సంతానపంకేజినీబాంధవా రాఘవా చండకాండాక్ష కోదండనిర్భేద నాపారివధ్వంసకృద్భార్గవత్రాసకారీ, అహల్యాసతీశాపసంతాపహృత్పాదపంకేజ నాగాయుతోద్దారసత్త్వోజ్జ్వలత్తాటకాప్రాణహృత్సాయకా వాలివక్షశ్శిలాఖండలా ప్రౌఢనోర్దండ మాయాసువర్ణాంగ సారంగసద్దర్పహారీ దురంతాఘసంతాపహారీ, దశస్యందనోర్వీశ దుఃఖాబ్ధిసంశోషణాగస్త్యరూపా, అనేకోర్మి మాలావలీఢాఖిలాశాంత దుర్దాంతవారాశిగర్వాపహా మైథిలీమానసాంభోజ మార్తాండవిశ్వైకసాక్షీ శరాక్షేక్షణాభక్త సంరక్షణాసక్త రాజేంద్రసీతాపతీ తారకబ్రహ్మరూపా పరేశ్యాచిదానందమూర్తీ ప్రపన్నార్తిహారీ జగన్నాయకా రామచంద్రా కృపాసా

గరాగాశ్రితత్రాత్రి ధ్వరతాత్రిణజక్షా శరత్కాలచంద్ర ప్రసన్నాననా
నీలజీమూతసంకాశపుణ్యాకృతీ, పద్మగర్భాదిబృందారకానంద సంధా
యిలీలావతారా హతారాతి బాహాబలోత్సేక కాకాసురైకాంబకా
దానత్రస్తాంబకా శారదారంభరాకా నిశాకాంతసాహస్ర శోభాతి
రస్కార కారిస్ఫురత్కీర్తి సందోహసంఛన్న దిఙ్మండలామండలాగ్ర
ప్రచండాహి రాజోపహాసీకృతాశేషదోషా చరప్రాణవాతా మహా
తాపసస్వాంత హృద్దివ్య సౌందర్య లీలారసాసార సాస్త్రాత్రిజాశేష
కీశాధిరాజ్య ప్రదా వేదవేదాంత సంవేద్యనిర్మాయరూపా, మహీతో
యశుష్మానిలాకాశభూతోద్భవా విర్జిత విద్యయోగీశ్వరోపాస్య ఓం
కారమంత్రార్థ విజ్ఞేయభక్తప్రియానంత కళ్యాణచారిత్ర షడ్భావ
దూరాకృపాధార పత్రాంబుజా చండరుఙ్మండలీమధ్యవర్తీ సుధాభా
నుమూర్తీ భుజంగేశశాయీ చతుర్వ్యూహదేహా అనంతావతారా శ
తానందముఖ్యామర ప్రార్థితా విశ్వవిశ్వంభరా భారకృద్దైత్య సం
హారకామాది కాంతర్గతారాతివైతాత్రి సమస్తాశ్రితా రామచైతాత్రి
సీతాంభోజ నేత్రా ధరిత్రీకుమారీ కళత్రా మనోజ్ఞాతసీపుష్ప సం
కాశగాత్రా పవిత్రా గుణామృత కాకుత్స్థవంశాగ్రణీభక్త చింతా
మణీ నీకు దండంబు నీకుంబ్రణామంబు నీకున్నమస్కారముల్ నీకు
జేజే నమోవాకముల్ నీకు కారుణ్యదృష్టిం బ్రసన్నుండవై నన్ను గక్షిం
పవే నిన్ను సేవించెదన్ నిన్ను భావించెద న్నీపదాంభోజ దాస్యంబు
గావించెదన్ మ్రొక్కెదన్ రామచంద్రా మదీయాపరాధంబు క్షం
తవ్యమో స్వామి నామీఁద నీమేదురాంచ త్కృపాపాంగప్రసాదంబుతో
రంబుగాఁజేసి చేపట్టవే రాఘవా మజ్జనార్చాది భుక్తిక్రియా జాగరూ
కత్వ నిద్రాసుషుప్త్యాద్యవస్థా విశేషంబులన్నన్ను రక్షింపుమీ జానకీ
కాంత వేదాంత వాక్యంబులన్నిన్ను వాక్రుచ్చఁగాలేవు లోకత్రయి
న్నిన్ను వర్ణింపనెవ్వాఁడు శక్తుండు నీతోర్యస్సవా నీమహత్త్వం బపిం
త్యంబనంతంబు సర్వజ్ఞకా నీకచంబుల్ మహా మేఘముల్ లోక

శాఖా సుధాభానుభానుల్ భవన్నేత్రముల్ శేషభృత్కర్ణశాయీ దిశల్నీకుఁ గర్ణంబు లానందకందా కృశానుండునీమోము దేవేశ్వరా శారదాదేవి నీజిహ్వ శాణాసనామ్నాయ పారీణ నీప్రాణము ల్వాయువుల్జ్ఞానవిద్యానిధీ వారిధుల్నీకుఁ గుక్షిప్రదేశంబు రాజీవపత్త్రేక్షణా యంతరిక్షంబునీనాభి యోగీశ్వరధ్యేయపాదా భవత్పాదముల్ భూమిశ్రీకేశవా నీశరీరంబు విశ్వంబు శ్రీరామచంద్రా సముద్రంబునన్ ఫేనపుంజోర్మికా బుద్బుదశ్రేణిచందంబునన్ దేవతిర్యఙ్నరాదిప్రపంచంబు నీయందు జన్మించు నీయంద యేకీభవించున్ జగజ్జీవనారత్నబృందంబు సూత్రంబునందుం బోలె సర్వంబు నీయందగున్ సూత్రమై పొల్చుధర్మాకృతీ నిన్ను నిర్మోహులున్ విరక్తాత్ములధ్యాత్మనిత్యుల్ మునీంద్రుల్ నివృత్తాభిలాషుల్ జితస్వాంతులత్యంత నిష్ఠానిధుల్ భక్తియుక్తుల్ వివిక్తస్థలాసీనులాచారవంతుల్ బుధుల్గాంతు రాదిత్యకోటిప్రభా తారకాదిత్యచంద్రాగ్ని విద్యుత్సమూహంబు లెచ్చోట తేజంబు వాటింపఁగాఁజాల వెద్దానధీరుల్ ప్రవేశించి శోకించ రచ్చోట నీదివ్యధామంబు శ్రీరామచంద్రా కృపాసాంద్ర నీతత్త్వమెవ్వారికిన్ నిర్ణయింపఁగ శక్యంబుగాకుండు నేనేమి వర్ణింపఁగా నేర్తు లోలాత్ముడన్ బాలుఁడ న్గర్వశీలుండ నానేరము ల్పెక్కు లెంచన్ సహించందగున్ మ్రొక్కెద న్నిన్ను బ్రార్థించెద వేఁడెదన్ దివ్యపాదారవిందద్వయీ దాస్యయోగ్యత్వుఁగాఁ జూచి నన్నుం గటాక్షించి రక్షించవే యిందుమందాగు మందార భూమీరుహారామ రాముం బ్రశంసించి నిర్వంచనప్రౌఢభక్తిన్ జగత్ప్రాణసూనుండు శ్రీజానకీదేవి నీరీతిఁ గైవారము ల్సేసె శ్రీమైథిలీ నీకు దండప్రణామంబు సర్వాఘసంహారిణీ నీకుఁ జేమోడ్పు దారిద్ర్యవిచ్ఛేదినీ నీకు జేజే ఋణధ్వంసినీ నిన్ను సేవింతు భక్తప్రజాభీష్టసంధాయినీ నిన్ను భావింతు ధన్య న్విదేహక్షుమాధీశకన్య న్బ్రశంసించెద న్రాఘవానందదాత్రి క్ష్మాపుత్రిక న్విద్య నాద్య న్బ్రధానస్వరూప న్భవానీ శివైశ్వర్య సంహర్త్రి భూతిన్ సతి న్భారతిన్ జానకిన్గొల్చెద న్సత్కృపాదివ్యమూర్తిన్ హరిప్రేయసి న్బ్ర

హ్మావిద్యం ద్రయీరూపిణిం బార్వతీరూప నాత్మందలంతు ప్రస
న్నవదనాంభోరుహన్ లక్ష్మి దుర్గాబిపుత్రిన్ బవిత్ర న్భజింతు
నృశాంకషష్వన న్బూజగావింతు సర్వాంగసౌందర్య సంశోభిని
న్నిన్నువర్ణింతు ధర్మస్వరూపన్ దయామూర్తి సావిత్రి గాయత్రి
బద్మాలయన్బద్మపాణి న్సరోజాక్షువక్షస్స్థలీమందిరం జంద్రబింబా
నన న్జంద్రబింబాననాక్షీర వాహ్లాదరూప న్మహాసిద్ధసాధ్వి న్సుభ
ద్రప్రదాత్రిన్ ద్రిలోకైకధాత్రిన్ ధరిత్రీకుమారి న్జగత్పావని
న్సీత సర్వానవద్యాంగినంభోజగంధి న్మహాదేవి వాక్పుష్పపూజా
విధానంబున న్సేవగావింతుమాతల్లికి న్రాఘువస్వామిదేవేరికి న్సీత
కు న్భక్తజాతంబు మీఁదం గృపాశీతలాపాంగవీక్షాసుధాసార
ముం జిల్కువిద్యాణికి న్నిత్యకల్యాణికి న్నీలజీమూతరేఖాతిర
స్కారకృద్వేణికి న్పారిజాతప్రవాళోల్లసత్పాణికిం దమ్మిపూమే
డలం గీడ గావించు వాల్గంటికి న్వేల్పుపోఁడియాళ్ళు చే మొగి
డ్చుకొన్నట్టి రాణి న్నడుం। జాలువాపోవు గుజ్జొంపంబు డాల్తెక్కు
లం జిల్కగాఁ జామ నెమ్మేనిచాయం జగంబెల్ల నిండించుసీతా
మహాదేవికి న్నీకుఁ బల్మాఱు నే మ్రొక్కెదన్. ౭౪॥

గీ. ఇవ్విధంబునహనుమంతుఁ-డింపు వెలయ।
రామచంద్రుని సీతను-బ్రస్తుతించి।
సమధికానందసందోహ-జనితబాష్ప।
వారిపూరితహృదయుఁ డై-యూరకుండె॥ ౭౫॥

క. మునులారపఠనసుతకృతి।
జనకసుతారామచంద్ర-సంస్తవపఠనం।
బొనరించునరుఁడు గాంచును।
ధనధాన్యగజాశ్వసంప-దలు మోక్షంబున్॥ ౭౬॥

వ. ఈసీతారామస్తోత్రంబు భక్తిపూర్వకంబుగా నేకవారంబు విను
వారికిం బఠించువారికి నాయుర్విద్యాపుత్త్రవనితాసౌఖ్యంబులు

సిద్ధించు బ్రహ్మవధాది ఘోరపాతకంబులు నశించు. నరకదర్శనం
బులేదు. సకలమనోరథంబులు ఫలించు. సమస్తక్రతుఫలంబుదొ
రకు నిట్లు వాయునందన ప్రార్థితుండై కౌసల్యానందనుం డతని
కిట్లనియె 22॥

క. ఎఱుఁగక కావించితివి।
ప్రతిసాహసమీవుహరివి-ధాత్రాదిసుర।
ల్వోఱుపరిమత్కృతలింగముఁ।
జెలుకఁగనోపుదురెయుసుర-భీకరమూర్తీ॥ 2౩॥

గీ. హరునికపరాధ మొనరించి-యవనిమీఁదఁ।
బ్రదల్చిమూర్ఛిల్లితివిగదా-ధీరవర్య।
యింక నెన్నటికిని బార్వ-తీశునెడల।
ద్రోహ మొనరింపకుముగంధ-వాహతనయ॥ 2౪॥

వ. భవత్పతనస్థానం బగు నేతత్కుండంబు నీనామంబున నిదిమొదలు
గ ముజ్జగంబుల నతివిఖ్యాతం బైవర్తిల్లు దీనియందు మజ్జనమాత్రం
బున మహాపాతకసంఘాతంబు నశించు నని మఱియు నిట్లనియె॥

గీ. శివజటాఘాతసంజాత-శీతలార్తి।
గౌతమీనదిసరిదగ్ర-గణ్యకీర్తి।
యశ్వమేధాఖ్యయజ్ఞస-హస్రఫలమె।
సంగుఁదననీట మునిఁగిన-జనులకెల్ల॥ ౩౧॥

గీ. దానికంటెనుశతగుణం-బైనఫలము।
మనుజవరులకొసంగువి-స్తృతతరంగ।
యమునయుసరస్వతియు రెండు-నమరతటిని।
కరణిఫలమీయఁగా నేర్చు-నరులకెందు॥ ౩౨॥

గీ. భువనపావనులీమూఁడు-పుణ్యనదులఁ।
గలసిప్రవహించునిచ్చోటఁ-గపివరేణ్య।
యచటనవగాహనమునస-హస్రగుణిత।
ఫలముసిద్ధించుజనులకు-నలఘుమహిమ॥ ౩౩॥

క. ఇష్మాఁడునదులనవగా।
హామ్మునఫలమెద్దిగలుగు-ననఘూజనబృం।
దమ్ము౽కీహానుమత్కుం।
డమ్మునఁదత్ఫలముమజ్జ-నంబునదొరకున్॥ ౧౪॥

మ. మనుజాండైవసుధన్ జనించియుహనూ-మత్కుండతీరంబునన్।
ఘనభక్తింబితృకార్యమర్రిసలుపం-గానొల్లఁడేవ్వాఁడునో।
పనులైపోదురువానిఁజూచిపితరుల్-పాకారిముఖ్యామరుల్।
మునులున్సిద్ధులునోపమూనుదురుద-న్మూఢాత్ముపైనెంతయున్॥ ౧౫

గీ. హానుమతకుండసన్నిధి-ననఘులార।
జపముహోమముదానంబు-సలుపఁడేని।
జననిజీవితమప్రయో-జకముదుఃఖ।
భాజనంబగుగదువిష్ట-పద్వయమున॥ ౧౬॥

క. హానుమతకుండసన్నిధి।
సేనరుఁడుతిలోదకంబు-నీడునియతుండై।
వానిపితరులాజ్యనదీ।
పానముసేయుదురునిజము-పలికితిమిత్రా॥ ౧౭॥

వ. ఇట్లు శ్రీరామచంద్రుండు పలికిన పలుకులు విని సంతుష్టస్వాంతుండై హనూమంతుండు వెండికొండనుండి తన తెచ్చినలింగంబు రఘుపుంగవు నాజ్ఞాక్రమంబున రామనాథేశ్వరు నుత్తరంబునం బ్రతిష్ఠించి కృతార్థుండయ్యెహనుమద్వాలవేష్టితసంజాతంబగు వలిత్రయంబు రామనాథేశ్వరుండు ధరించు నిట్లు సేతుమధ్యంబున గంధమాదనగిరి శృంగంబున శ్రీరాఘవుండు శివలింగప్రతిష్ఠాపనంబు చేసిన తెరంగు మీకెఱింగించితి నిది పఠించువారును, విన్నవారును, దురితంబులం బారద్రోలి శివలోకంబునం బూజవడయుదురని సూతుండు వివరించిన శౌనకాదిమహర్షుల మ్మహాత్మునకిట్లనిరి. ౧౧॥

గీ. జలజహితతేజ రోమహ-ర్షణతనూజ।
రావణుఁడు బ్రాహ్మణుఁడు గాడు-రక్కసుండు।
వానిఁ దునిమిన నెటువలె-వచ్చె భువన।
కర్తయగు రఘువరునకు-బ్రహ్మహత్య॥ ౮౯॥

క. ఇది తెల్లగ వచియింపుము।
మది సంశయ మెల్లఁ దీర-మాకిప్పుడు దయా।
హృదయా సమస్తార్థవిశా।
రదుఁడవు నీవనఘ బాద-రాయణ కరుణన్॥ ౯౦॥

వ. అని యడిగిన సూతుం డిట్లని చెప్పందొడంగె. ౯౧

క. వనరుహభవునకు సుతుఁడై।
జనియించెఁ బులస్త్యుఁ డధిక-శాంతాత్ముండా।
తనికుద్భవించె విశ్రవుఁ।
డన విశ్రుతుఁ డైనపుత్త్రుఁ-డసమానుండై॥ ౯౨॥

క. మునిపుంగవుఁడు పులస్త్యుని।
తనయుండగు విశ్రవుండు-ధర్మాత్ముండై।
యనిమిషులకు దుష్కరమగు।
ఘనతప మొనరించె నజుఁడు-కౌతుక మొందన్॥ ౯౩॥

వ. అతండు తపంబు సేయుచున్న కాలంబున నంగాలాంబుద సంకాశదేహుండును, హేమనిష్కాంగదధరుండును నగు సుమాలి యను రాక్షసుండు పాతాళస్థానంబువలన నిర్గమించి నెత్తమ్మికేలం బూనని పాలమున్నీటికన్నియం బోనితనచిన్ని ముద్దుకన్నియం దోడ్కొని భూలోకంబున నన్నియెడలం గ్రుమ్మరుచుండె నయ్యిందుముఖి సౌందర్యంబు వర్ణింప నరవిందసంభవునకైన నలవిగాదు.

చ. మినుకుగ డాసి పైఁడిజిగి-మించు మలచాయయు సంగ్రహించి కో।
న్నునఁ గల సౌకుమార్యము ఘ-నంబగు పద్మసుగంధసారమున్।
గొని వనజాతసంభవుఁడు-కోమలి మేను రచించె వీనికిం।
గనుఁగొనఁగాని దత్పవము-కాంతి మృదుత్వసుగంధసంపదల్॥ ౯౪

గీ. తరుణినెమ్మోముతోడసు-ధాకరుండు।
సాటిగాలేకజనితల-జ్జాభరమునఁ।
శివజటాజూటవనదుర్గ-సీమఁజేరి।
నబ్జమునుముకుళీభావ-మాశ్రయించె॥ ౯౬॥

క. ముక్కుతిలకుసుమముపురా।
చక్కెరకెమ్మోవిభళిరె-జక్కవలేపో।
చిక్కనిచనుగవచొక్కపు।
చెక్కులజిగిలెక్కసేయ-శేషుఁతరమే॥ ౯౭॥

క. కుందంబులుగదనములర।
విందంబులుకరములలరు-వెంద్రుకలళినీ।
బృందంబులునడకలుకదు।
మందంబులుమాటలెన్న-మకరందంబుల్॥ ౯౮॥

క. తమ్ములునయనములళిపో।
తమ్ములుచికురములుపర్వ-తమ్ములకమఁగుం।
దమ్ములుగుబ్బలుమరుకుం।
తమ్ములపాల్గారెబుధులు-దానింగన్నన్॥ ౯౯॥

క. మంజులతనమరికెంపుల।
కెంజాయకుజాఁట్టమైయ కృత్రిమరుచులన్।
రంజిల్లితొగరువాతెర।
క్రొంజిగురుటనమేలుగూర్చెఁ-గొమ్మకుభళిరే॥ ౧౦౦॥

గీ. మేలుగలవాలుగలగెల్వఁ-జాలువాలు।
వాలుగన్నులునిజరుచి-జాలకలనఁ।
దరుణహిమకరరేఖను-ద్ధతినిగ్రమ్ము।
తరుణిఫాలంబునవఘన-స్ఫురణమహిమ॥ ౧౦౧॥

సీ. మాలూరఫలముల-మేలుచూరలుపట్టి,
కందుకంబులతీరుఁ-గ్రిందుపరచి।

నెత్తమ్మిమొగ్గల-బిత్తరంబుక్రమించి,
చక్రవాకస్ఫూర్తి-నాక్రమించి।
కుసుమగుచ్ఛంబుల-పసహసింపఁగఁజాలి,
భర్మకుంభములఁజే-పట్టనేర్చి।
మత్తవారణకుంభ-మహిమంబుభేదించి,
యలఘుపర్వతలీలఁ-జాలకఁజూచి॥

సీ. బాహుమూలంబులారయుచు-బలసిపొగరు।
కొనివిజృంభించియుప్పల కుప్పలగుచు।
మేలువట్రువసిబ్బెంపు-మెఱుఁగుగుబ్బ।
చన్నులలరారెనలశర-చ్చంద్రముఖికి॥ ౧౦౨॥

క. లలితాధరమధురసుధా।
రలుగ్రోలఁగఁదలఁచిసుంద-రంబగునాభీ।
బిలమువెడలివచ్చెనాఁచీ।
మలబారనరోమరాజి-మగువకుఁదనరెన్॥ ౧౦౩॥

క. సురకన్యలసురకన్యలు।
గరుడోరగయక్షరాజ-కన్యలునరకి।
న్నరకన్యలెందరైనను।
గరిగమనకుదనుజరాజ-కన్యకుసరియే॥ ౧౦౪॥

క. మొగముసిరిగళముతీరును।
బిగిగుబ్బలబెడగునడుము-పేదరికమహో।
తగనింతింతనితెలుపఁగ।
నగునేనలుమోముసెప్పు-లయ్యకునైనన్॥ ౧౦౫॥

క. అనిపొగడఁదగినచక్కని।
తనకన్నియతోసుమాలి-తగభూలోకం।
బునమెలఁగుచునొకచోటం।
గనుగొనివైశ్రవణుఁబుష్ప-కస్థుఁగుబేరున్॥ ౧౦౬॥

ఆ. కనికుబేరసముఁడు-తనయుండుమనలకు।
దొరికెనేనివేరపు-దొరఁగిబృద్ధిఁ।
జెందఁగలమటంచుఁ-జింతించితినకూఁతుఁ।
బిలిచియిట్టులనియెఁ-బ్రేమగలుగ॥ ౧౦౭॥

గీ. అమ్మకైకసిసంప్రాప్త-మయ్యెనీకు।
నిందుజవ్వనమటు గాన-నిమ్నపయున।
కవ్వనికినైనఁదగువాని-కీయవలయు।
నెవ్వఁడుతరింపుమజో కాని-యెఱుఁగరాదు॥ ౧౦౮॥

క. తగుమగనికిఁబడుచునిడం।
దగునిట్టిడకున్నఁగన్న-తండ్రికిదుఃఖం।
బగుఁగానవాడుబడుచుల।
జగతింగను వారికెల్ల-సౌఖ్యముగలదే॥ ౧౦౯॥

ఆ. అఖిలలక్ష్మికరణి-నన్ని తెరంగుల।
దొడ్డదానవమ్మ-బిడ్డనీవు।
తగరుమీరాతలనుచుఁ-దగడుడునని యొట్టి।
వారువెరచియడుగ-రారువిన్న॥ ౧౧౦॥

ఉ. కావునపస్మునింగనక-గర్భనిశాత్రుఁబులస్త్యపుత్రుఁభూ।
దేవునివిశ్రవుంబరమ-ధీరుగుణాకరునీవయోగిప।
ద్భావమునన్వరింపుముశు-భంబుగనీకుఁగుబేరసన్నిభుల్।
శ్రీవెలయంగుమారులుప్ర-సిద్ధులుగల్గెదరబ్జలోచనా॥ ౧౧౧॥

క. అనిపలికినవాక్యము।
వినికైకసిమందహాస-విలసితముఖియై।
వినయమునన్నట్లయగుఁగా।
కనిమనమునసమ్మతించి-యంచితబుద్ధిన్॥ ౧౧౨॥

వ. అంత

క. బాలారత్నముసాయం।
కాలంబునజనకునాజ్ఞఁ-గైకొనిలతగన।

పౌలస్త్యబర్హిశాలకు।
లీలావతిఛనియెహంస-లీలాగతులన్॥ ౧౧౪॥

క. ధనిముని చెంగటలజ్జా।
వనతాననకమలయగుచు-నని తామణిరో।
య్యనఘచరణాంగుష్ఠాగ్రం।
బునవనిలిఖించు మందే-మునదమెదగదురన్॥ ౧౧౫॥

క. ఆసమయంబుననంబురు।
హాసనకులదీపకుడుహు-తాశనవిభతే।
జోసహ్యుడగ్నిహోత్రము।
సాసించెన్ విశ్రవుండు-దంచితనిష్ఠన్॥ ౧౧౬॥

వ అనంతరంబ ౧౧౭॥

మ. కనియెం జెంగటవిశ్రవుండపుడురా-కాచంద్రబింబాననన్।
ఘనవేణిం బికవాణిసుందరరద-న్నవ్యప్రవాళాధరం।
దనుమధ్యన్మదకుంభికుంభపృథులో-ద్యద్వక్షోజాలంకృత।
స్తనభారానమితాంగిహంసగమనన్-దైతేయకన్యామణిన్॥ ౧౧౮

క. కనిసొగసులగనియగున।
ద్దనుజేంద్రకుమారిచక్క-దనమునకెంతే।
మనమునవచ్చెరువడియా।
ముని మొగమునవలతినగవు-మొలుచంబలికెన్॥ ౧౧౯॥

క. లలనా తెలియంబలుకుము।
పాలయులుకవహించివల్ల-భున్ మొరగివను।
స్థలిలోనద్దాగవచ్చిన।
వలరాయునిసతివో కాక-వనదేవతవో॥ ౧౨౦॥

గీ. తరుణిరో వ్వానిముద్దుకూ-తురవునీవు।
వచ్చితెచ్చటినుండినీ-వచ్చటికిని।
యేమి కార్యంబు దలచిని-ధింపనిలచి।
తెలుపగ బల్కుమునిజముగా-నిందువదన॥ ౧౨౧॥

ఉ. నావినియావినీలకచ-నమ్రమతనంజలిసంఘటించిమ।
ద్భావమెఱుంగఁజాలుదువు-భవ్యతపోమహిమంబునన్ జగ।
త్పావనయేముకైకసినిఁ-దథ్యముసుమ్ముసుమాలికాఁతురన్।
వావిరినీదుసన్నిధికి-వచ్చితిమద్గురునాజ్ఞచొప్పునన్॥ ౧౨౨॥

క. మిగిలినకార్యంబెఱుఁగం।
దగుదువునీదివ్యదృష్టిఁ-దాపసయనియా।
మ్మగువవచించినవల్లా।
త్మగతంబునెఱిఁగితపసి-మానినికనియెన్। ౧౨౩॥

సీ. కైకసినీమనో-గతవాంఛయెఱిఁగితి,
పుత్త్రలాభముఁగోరి-పొసఁగనిపుడు।
ననుఁజెందితివినీవు-ననబోఁడితెలియంగ,
వివరింతులెస్సగా-వినుముక్రూర।
మైనసాయంసమ-యమునవిప్పుడునన్ను,
వరియించితివిపుత్త్ర-వాంఛఁగాన।
దారుణాకారుల-దారుణశీలురఁ,
గ్రూరకర్ములఁబాప-కుటిలమతుల।

గీ. దారుణాభిజనప్రియ-తములసుతుల।
రక్కసులఁగాంతువనిపల్క-మ్రొక్కెకేలు।
దమ్ములుమొగిడ్చినొసలనం-దముగనిలిపి।
పలికెనిట్లనితపసితోఁ-గలువకంటి॥ ౧౨౪॥

క. మునికుంజరనీవలనం।
దనయులనీదృశులఁగాంచఁ-దగునేయనన।
మ్మునియునిరోమత్కులోచిత।
ఘనమతియగుకొడుకుగలుగుఁ-గడపటనీకున్॥ ౧౨౫॥

గీ. వాఁడుధార్మికుఁడతిసాధు-వర్తనుండు।
సర్వశాస్త్రార్థతత్త్వవి-శారదుండు।

శాంతచిత్తుండుసద్గుణ-శాలియతఁడు।
కంబువిభకంఠిమదిసంశ-యంబువలదు॥ ౧౨౬॥

వ. ఇట్లు దివ్యజ్ఞానసంపన్నుండును, మహానుభావుండును, బ్రహ్మర్షిశేఖరుండును, షడ్గుణైశ్వర్యశాలియునగు విశ్రవుండు సుమాలికన్యయగు నక్కైకసికిం జెప్పి దానిం బరిగ్రహించె నవ్వరారోహయు సౌహార్ద్దతియు, సౌందర్యవతియు, సౌభాగ్యవతియునై విశ్రవుని డెందంబునకానందంబు సంపాదింపుచు నభిమతసముచితోపచారంబులు గావింపుచుండె నంత నయ్యింతికిం గతిపయకాలంబునకు గర్భంబునిల్చిన. ౧౨౭॥

సీ. ఎనలేనివలిగుబ్బ-చనుమొనల్నలుపెక్కె,
సాగినుసైకపుగౌను-జాడనయ్యెఁ।
గలికికన్నులయందుఁ-దలిడాలురెట్టించె,
వెలిదమ్మిపోలికె-నలరెమోము।
కడునల్లనగు మనే-ర్పడియెలేనూగారు,
తరుచుకోరికలుడెం-దమునమొలిచె।
నోపికలేకని-ట్టూర్పులగ్గలమయ్యె,
నెమ్మెనఁజెమటలు-గ్రగమ్మెసారె।
గీ. పొదలెనెంతయునలయిక-నిదురమించె।
నడరెఁగూర్కులునడకలు-జడనుపడియెఁ।
దళుకుఱెప్పలుసోమరి-తనముఁబూసె।
నెగడెనోకచెల్వపొత్తిద్దులు-నిండెసలికి॥ ౧౨౮॥

వ. అంత ౧౨౯

మ. కనియెంగైకసిపుత్త్రియున్నదుమహా-కాయున్ మహోగ్రున్ దశా।
ననువింశద్భుజకాండుఁగృష్ణవదనం-దామ్రాధరున్ భీకరున్।
ఘనదంష్ట్రాన్వితుభూమిభారకరుర-క్తశ్మశ్రుకేశున్నదాం।
ధునిలోకాంతకునాదితేయవిరుతున్-దుర్వృత్తున్ రాక్షసున్॥

గీ. వాఁడు రావణుఁడను దశ-వదనుఁడనఁగ।
నామము వహించెనంతన-న్నలినముఖికిఁ।
గుంభకర్ణాహ్వయుండైన-కొడుకువొడమె।
నంతరాకాశిశూర్పణఖాఖ్యవుట్టె॥ ౧౩౧॥

క. అంతటనుదయించెను గుణ।
వంతుఁడు శాంతుండు ధర్మ-వర్తనుఁడు దయా।
వంతుఁడు విభీషణాఖ్యుఁడ।
నంత సమాఖ్యుండు పశ్చి-మాత్మజుఁడగుచున్॥ ౧౩౨॥

వ. దశగ్రీవాదులైన వీరు విశ్రవుని పుత్త్రులది కారణంబుగ రావణకుంభకర్ణ వధంబున నక్లిష్టకర్ముండైన రామునకు బ్రహ్మహత్య ఘటించెనది గావున నందద్దోషశాంతికొఱకు రామేశ్వరలింగ ప్రతిష్ఠాపనంబు గావించి శ్రీరామచంద్రుండు కృతార్థుండయ్యె నిట్లు రామునకు నెచ్చోట బ్రహ్మహత్యా మోక్షంబయ్యెనది బ్రహ్మత్యా విమోచనంబను తీర్థంబయ్యె నందున నవగాహనంబుఁ గావించిన బ్రహ్మహత్యా వినాశనంబగు రావణుండు ఛాయారూపంబున నచ్చోట నేటికిం గానంబడుచుండు. ౧౩౩॥

గీ. దానిముందట నొక మహా-త్తరబిలంబు।
గలదు పాతాళమార్గమా-బిలమునందు।
రావణవధప్రసక్తయా-బ్రహ్మహత్య।
యుండునట్లుగఁ జేసెర-ఘూద్వహుండు॥ ౧౩౪॥

ఆ. ఆబిలంబుమీఁద-నమరంగ దుట్వోపం।
బొక్కటి చెవియందు-సుచితరీతి।
కాలభైరవుని న-ఖండితశాసను।
నిలిపె రక్షకొఱకు-నృపవరేంద్ర॥ ౧౩౫॥

గీ. భైరవుని శాసనంబున-భయముఁ జెంది।
దారుణోద్యోగ మెడలియుం-తయుఁ గృశించి।

యాగభీరబిలంబున-నణఁగియుండె।
బ్రహ్మవిదులార రావణ-బ్రహ్మహత్య॥ ౧౩౬॥

సీ. శ్రీరామనాథుని-క్షీణమునవనిశంబు,
నిందు వేడుకతోడ-నుండు గౌరి।
యుభయపార్శ్వములందు-నుండి సేవింతురు,
భక్తిచేఁ జంద్రుండు-భాస్కరుండు।
బ్రేమలవహ్ని వసించు-ముదమునఁదూరుపు,
మొదలైనదిశలందు-గడిపివరుస।
నమరనాయకముఖ్య-లష్టదిక్పాలకుల్,
వర్తింపుదురుహృష్ట-వదనులగుచు।

గీ. భవునితనయులు గణనాథ-బాహులేయు।
లిద్దఱు భజింపుచుందుర-హీనభక్తిఁ।
బరమమాహేశ్వరులు వీరభద్రముఖులు।
తగినయెడలవసింతురా దరముతోడ॥ ౧౩౭॥

భుజంగప్రయాతము

సురల్ పన్నగుల్ దాప-సుల్ చారణుల్ కి-।
న్నరుల్ సిద్ధసాధ్యాది-నాకౌకసుల్ ద।
త్పరత్వంబునన్ సంత-తప్రీతి రామే।
శ్వరుం గొల్తురిష్టార్థ-సంసిద్ధికిన్ ॥ ౧౩౮॥

క. సరయూయమునాగంగా।
సరస్వతుల్ రామనాథు-జగదారాధ్యుం।
బరమేశు సేతువునఁ ద।
త్పరతభజింతుర్ స్వకీయ-పాపక్షయకృతికిన్॥ ౧౩౯॥

గీ. భువనగురు రామనాథునిఁ బూజసేయు।
పూజకులశ్రోత్రియులు విప్ర-పుంగవులను।

నెమ్మి రామేశ్వరంబున-నిలిపి రాముఁ।
డొసఁగె వారికిఁ గ్రామంబు-లును ధనంబు॥ ౧౪౦॥

శా. నైవేద్యార్థము రామచంద్రుఁ డొసఁగెన్ - నానావిధగ్రామముల్।
దేవగ్రామమణిరామలింగమునకున్ - దేదీప్యమానంబులౌ।
గ్రైవేయాంగదరత్నకుండలపరిష్కారావళుల్ చంద్రికా।
ధావళ్యాపహసద్దుకూలపటముల్ - దాల్పంగ నిచ్చెంగదున్॥ ౧౪౧॥

వ. ఈయుపాఖ్యానంబు వినినవారికిఁ బఠించినవారికి సకలపాపక్షయకరంబగు. శరీరాంతంబున హరిసాయుజ్యంబు సిద్ధించు నని సూతుండు శౌనకాదిమహర్షులకు వివరించె॥ ౧౪౨॥

మ. కరుణాసాగర కామదర్పహర లో-కత్రాణదీక్షాధురం।
ధరగర్వాంధజలంధరాంధకమహో-దైదేయసంహారని।
ర్జరసంసేవితపాదపద్మ మునిరా-జస్వాంతరాజీవసం।
చరదిందిందిర యిందుశేఖర సదా-చారప్రియాపాపకా॥ ౧౪౩॥

క. పుష్కరలోచనలోచన।
పుష్కరపూజావిధాన-భూషితచరణా।
పుష్కరభవముఖమందుర।
పుష్కరనిధిరాజతూణ-భువనధురీణా॥ ౧౪౪

పృథ్వీవృత్తము.
ధరాధరసుతాపయో ధరవివిక్తకస్తూరికా:
స్ఫురత్ప్రమరవాసనా·సురభితోరుదోరంతరా।
శరశ్చరదసత్సంఘా-శరదరేందుమందాకినీ।
సురద్రుమమరాళభా సురశరీరగౌరీస్పృహీ॥ ౧౪౫॥

గద్య:— ఇది శ్రీమదుమామహేశ్వర కరుణాకటాక్షవీక్షాపాత్ర,
యేనుగ లచ్చయామాత్యపౌత్ర తిమ్మనామాత్యపుత్త్ర,
వివిధ విద్వజ్జనవిధేయ, లక్ష్మణకవినామధేయ ప్రణీ
తంబయిన రామేశ్వరమాహాత్త్యంబను
మహాప్రబంధము నందుఁ
ద్వితీయాశ్వాసము.
శ్రీ. శ్రీ శ్రీ
శ్రీరస్తు.

---

# రామేశ్వరమాహాత్మ్యము

## చతుర్థాశ్వాసము.




మల్లనమంత్రిమనః।
కామితఫలదాయికల్ప-కద్రుమశుభకృ।
న్నామగురుజానపల్లీ।
ధామా మల్లేశలింగ-ధరణీశతాంగా॥ ౧॥

వ అవధరింపుము శౌనకాదిమహర్షులకు సూతుండిట్లనియె. ౨॥

క. అవనిసురులారయిప్పుడు।
వివరించెద నేనుమీకు-విస్పష్టముగా।

భవహరమగు రామేశ।
స్తవరాజం బిది వినుండు-శ్రద్ధాయుక్తిన్॥ ౩॥

క. శ్రీపతి రాముఁడు లింగ।
స్థాపన మొనరించియందు-సర్వేశ్వరుగా।
రీపతినిఁ బాపహరుఁ గరు।
ణాపరు రామేశుఁ బొగడె-భక్తి దలిర్పన్॥ ౪॥

గీ. మఱియు సౌమిత్రియును లోక-మాన్యజాన।
కియును సుగ్రీవముఖులైన-కీశవరులుఁ।
గమలజాదిసుపర్వుల-గస్త్యముఖ్య।
మునులు వేర్వేఱఁ బొగడిరి-ల్లను ముళివుని॥ ౫॥

వ. రాఘవుండిట్లనియె. ౬॥

క. మ్రొక్కు-మహాత్మునకజునకు।
మ్రొక్కు-మహామాయునకున-మోఘచ్ఛునకున్।
మ్రొక్కు-త్రిశూలికి భవునకు।
మ్రొక్కు-మహేశునకుఁ బంచ-ముఖునకు నీకున్॥ ౭॥

క. హరిభుజంగమపరివృఢ।
హరికి నిజకింకరార్తి-హరికి హిమరు।
గ్ధరికి సుమాయాధారికిఁ।
జేరి ప్రణామములు నీకుఁ-జేసెద నభవా॥ ౮.

సీ. అఖిలరూపునకు దే-వాదిదేవునకు శా,
శ్వతునకు సాక్షికి-శంకరునకు।
వేదాంతవేద్యున కాదిశూన్యునకుని,
జ్ఞానదాయకునకు-శంభునకును।
నందివాహునకా నందపూర్ణునకుని,
శ్వాధీశ్వరునకుఁ బ-రాకృతికిని।

భక్తభయచ్ఛేద-పరమకారణపాద,
పద్మరేణువకుస-ద్బాంధవునకు।
గీ. భగ్నువకుఘోరపాతక-భంజనునకుc।
గాలకాలునకద్భుత-శీలునకును।
గాలునకుశర్వునకునీల-కంధరునకు।
రామనాథేశునకునీకుc-బ్రణుతిసేతు॥ ౯॥
వ అవిద్యానిహంతకుం బాపహారునకు, సంసారసంతాప శాంతి హేతునకు మదీయబ్రహ్మహత్యావినాశకిం బార్వతీ నాథునకుం గైలాస నిలయునకు, గంగాధరునకు, విరూపాక్షునకు నిరాకృతరసాపదునకుం బినాకపాణికి, మదనహరునకుం బునఃపునఃప్రణామంబులుగావింతు. ౧౦.
వ. లక్ష్మణుండిట్లనియె॥ ౧౧॥
సీ. రామనాథాయపు-రచ్ఛిదేశంభవే,
పరమేశ్వరాయతు-భ్యంనమోస్తు।
పర్వతకన్యకా-పతయేనమోస్తుతే,
నాగేంద్రముఖగుహ-నందనాయ।
రవిశశివహ్ని నే-త్రాయకపర్దినే,
దేవాయసోమాయ-తేనమోస్తు,
కరుణార్ణవాయమా-ర్కండేయభవభిదే,
విభవేనమస్తేక-విస్తుతాయ।
గీ సాక్షిణేనమఉగ్రాయ-శంకరాయ।
నీలకంఠాయభీమాయ-నిర్మలాయ।
శూలినేసకలజ్ఞాయ-సుధిరాయ।
మదనవీర్యహరాయన-మశ్శివాయ॥ ౧౨॥
క. క్రతుపురుషాయగణాద్యధి।
పతయేవరదాయదుర్గ-భాయవసానాం।

పతయేచతస్ర-రాణాం।
పతయేరుద్రాయసాధు-పతయేస్తునమః॥ ౧౩॥

గీ. కర్తవశమునకెక్కు-డై-కన్నజనింతు।
నచటనచ్చట నాకునీ-యంఘ్రికమల।
భక్తిసిద్ధించుగాతగో-పతితురంగ।
యిందురేఖోత్తమాంగ రా-మేశలింగ॥ ౧౪॥

క. వేదాచారాభిరతియు।
వేదావ్య విరుద్ధమార్గ-విముఖతయునుసం।
పాదింపుము నాకుఁగృపా।
మేదురవీక్షణము చేత-మీనాంకహరా॥ ౧౫॥

పంచచామరము.
హరాసురాద్రిచాపపాప-హారినామధేయశం।
కరాకరాంచితత్రిశూల-కాలకాలనీలకం।
ధరాధరాశతాంగతార-తారహారతారకా।
సురాళిహిందగౌరధీర-మాన్యనీకుమ్రొక్కెదన్॥ ౧౬॥

గీ. పరమకారణశంకర-ఫాలనయన।
గిరిసుతాకుచకుంకుమాం-కితసువక్ష।
విశ్వనాయక రామేశ-విపమబుది।
మాన్పిసన్మతియొసఁగుము-మదనమదన॥ ౧౭

మత్తకోకిల.
నీలలోహిత పార్వతీప్రియ-నిమ్నగాధరధూర్జటీ।
ఫాలలోచనదాససంసృతి-బంధమోచనసంస్మృతీ।
శూలహస్తనిరస్తమాయవి-శుద్ధరూపకృపానిధీ।
బాలచంద్రకిరీటనీపద-భక్తినాకునొసంగుమీ॥ ౧౮॥

వ. సీతాదేవియిట్లనియె. ౧౯॥

తోటకవృత్తము.
దితిజాంతకవిశ్వప-తీశరణా।

గతపాలకనిత్యవి-కాసనిష్ఠ।
వతిసీకురచించెద-నాకెపుడుం।
బతిభక్తియొసంగుము-భవ్యమతీ॥ ౨౦॥

వ. హనుమంతుం డిట్లనియె ౨౧॥

గీ. దేవదేవజగన్నాథ-దీనపాల।
రామనాథకృపాధార-రాజమకుట।
తావకీనపదాంబుజ-ద్వయమునందుఁ।
బట్టువడుగాతనిశ్చల-భక్తి నాకు। ౨౨॥

క. నానాప్రపంచసత్తా।
భానములెవ్వానివిడిచి-భాసిల్లవుత।
ధ్యానాత్మురామనాథును।
మానాయకుఁగొల్తునెపుడు-మానసవీథిన్॥ ౨౩॥

వ అంగదుఁ డిట్లనియె ౨౪॥

గీ వెలుఁగునెవ్వానివెలుఁగున-విశ్వమెల్ల।
వెలుఁగదిజగమెవ్వాని-వెలుఁగులేక।
అట్టిరామేశునకుభయ-హరునకమర।
వంద్యునకుశంభునకునీకు-వందనంబు॥ ౨౫॥

వ జాంబవంతుం డిట్లనియె. ౨౬॥

క. మానుగనేపరమేశ్వరు।
నానందముగనుటచేస-మస్తానందం।
బైనెగడునమ్మహాత్ముస।
దానందునిరామనాథు-నాత్మభజింతున్॥ ౨౭॥

వ. నీలుండిట్లనియె. ౨౮॥

ఆ. దేశకాలభేద-దిగభిన్నమేవస్తు।
వది౽తీయమగుచు-నమరునెద్ది।
అట్టిభేదవిరహి-తాత్మునీశ్వరురామ।
నాథునభవులోక-నాథుఁగొల్తు॥ ౨౯॥

వ. నలుండిట్లనియె ౩౦॥

క. జలజాసనహరిరుద్రులు।
వలనుగ నెవ్వానిమాయ-వర్తింతురని।
ర్మలరూపునతనిమాయా।
విలసనవిరహితునిరామ-విభునిఁదలంతున్॥ ౩౧॥

వ. కుముదుండిట్లనియె. ౩౨॥

క. నానాజగదుద్గతికిఁబ్ర।
ధానము కారణమటంచుఁ-దగఁజెప్పిరియె।
వ్వాని నెఱుంగక బుధులుని।
దానాత్మునివానిఁదలఁచె-దన్ రామేశున్॥ ౩౩॥

వ. పనసుండిట్లనియె. ౩౪॥

గీ. పాసఁగ నెవ్వానిమాయచేఁ-బొడమె జాగ్ర।
దాదివిశ్వప్రపంచమ-త్యద్భుతముగ।
నతనివిజ్ఞానఘనుజాగ్ర-దాదిరహితు
రామనాథుని సేవింతుఁ-బ్రేమ మెసఁగ॥ ౩౫॥

వ. గజుండిట్లనియె. ౩౬॥

గీ. కారణాత్మను నెవ్వనిఁ-గానలేక।
కడగిపరమాణువులు జగ-త్కారణమని।
తార్కికులుగలహింతు రా-తనిసుఖాత్ము।
నాత్మరూపుని రామేశు-నాశ్రయింతు॥ ౩౭॥

వ. గవాక్షుండిట్లనియె ౩౮॥

గీ. పటుతరాజ్ఞానపాశని-బద్ధనరులఁ।
బాశముక్తులఁగావించు-పరమగురుని।
రామనాథునిశాంతుశ-రణ్యుశివుని।
రక్షకునిఁజేరికొల్తుని-రంతరంబు॥ ౩౯॥

వ. గవయుండిట్లనియె ౪౦॥

ఉత్సాహము

ధ్వస్తపురనిశాచరున్ సు-ధాకరార్కమౌళి స్వా।
ద్యస్తవిశ్వవిశ్వనాథు-నాగమాంతవేద్యున।
భ్యస్తయోగసుజనగమ్యు-నాదిదేవునీశ్వరుం।
బ్రస్తుతింతు రామనాథుఁ-బార్వతీమనోహరున్ ॥ ౪౧॥

వ. శరభుండిట్లనియె ౪౨॥

ఆ. పరమరేణువాత్మ-పరమార్థమనుచు నె।
వ్వాని మోహశక్తి-వశముఁ జెంది।
పల్కుదురు విరుద్ధ-భావు లప్పరమాత్ము।
రామనాథునమిత-ధాము నెంతు॥ ౪౩॥

వ. గంధమాదనుండిట్లనియె

భుజంగప్రయాతము

సమస్తాఘసంఘాత-శాంత్యర్థమున్ బా।
సమేతున్ గణాధీశుఁ-జంద్రార్ధమౌళిన్।
రమానాథబాణున్ సు-రత్రాణదక్షున్।
నమత్స్వధీన్ రామ నాథున్ భజింతున్॥ ౪౪॥

వ. సుగ్రీవుండిట్లనియె ౪౫॥

సీ. జన్మజరామృత్యు-సలిలప్రపూరంబు,
సంతాపబడబాగ్ని-సంకులంబు।
దారపుత్రక్షేత్ర ధనవీచినికరంబు,
దుష్టరోగవ్యాళ-దుస్సహంబు।
కామాదిపరిపంధి-గణఘోరమకరంబు,
విషయస్పృహాఫేన-విలసనంబు।
బహుళదారుణవిప-త్పాఠీనవారంబు,
మజ్జదజాండకుంభ వ్రజంబు।

గీ. భవదుదారపదాంభోజ భక్తిపోత।
మునఁగఁదగుభవజలరాశి యందు మునుఁగు।

చున్ననన్నుద్ధరింపుము-తూర్జితాంగ।
వృషభరాజతురంగ రా-మేశలింగ॥ ౪౬॥

వ విభీషణుం డిట్లనియె. ౪౭॥

మ. జననవ్యాఘ్రము పాపసింహమతిదు-ష్టవ్యాధిచోరంబు నా।
తనసర్పాకులమింద్రియాదవగమీ-ర్ష్యాపర్ణముల్ బాల్యయా।
వనకూపంబును భీతికంటకముదు-ర్వారోగ్రసంసారకా।
ననముం జొచ్చితిధర్మమార్గము జగ-న్నాధా కృపం జూపవే॥ ౪౮॥

వ సర్వవానరులిట్లనిరి.

శా. పాపంబెల్లెడఁ గూర్చి ఖేదము జనిం-పక్షి యోనులం బుట్టికుం।
భీపాకాదిదురంతదుర్గతులనొ-ప్పిం జెందియాపిమ్మటం।
బాపోత్కృష్టనికృష్టయోనితతులం-బల్మారు జన్మించిని।
త్యాపన్నత్వమునం గృశించితిమి దే-వా మమ్ము రక్షింపవే॥ ౫౦॥

గీ. ఘోరగంభీరసంసార-కూపగతుల।
జడులవివశులదీనుల-చపలమతుల।
కడునవాధులమము నీవు-కరుణఁ జూచి।
కావవే యీశ రామేశ-గగనకేశ॥ ౫౧॥

స్రగ్విణీమిళిత భుజంగప్రయాతము.

హరా। భక్తమందార-యా-పన్నరక్షా।
పరా। ముక్తసంగాకృ-పా-ముగచర్మాం।
బరా। శుక్తిముక్తాప్ర-భా-శోభితాంగా।
పరా। వ్యక్తచిన్మాత్ర-భా-వాపురీశా॥ ౫౨॥

క. రక్షింపుము కరుణార్ణవ।
రక్షింపుము దీనపాల-రాజకిరీటీ।
రక్షింపుము భువనేశ్వర।
రక్షింపుము మమ్ము దేవ-రామేశశివా॥ ౫౩॥

వ బ్రహ్మ యిట్లనియె ౫౪॥

గీ. కవిజనస్తుతయేణాంక-కలితచూడ।
యీశలక్ష్మీశసఖహరి-డీశవంద్య।
సగుణకలిహారహాల్యా-సర్వకామ।
సకలభవప్రణవాత్మక-శరణుశరణు॥ ౫౫॥

వ. ఇంద్రుండిట్లనియె ౫౬॥

గీ. ఏమహాత్మునిశక్తిభ-క్తిప్రధాత్రి।
విశ్వమాతయుమాదేవి-వేదమూర్తి।
యతనిజగదేకనాయకు-నమితతేజు।
శంకరునిరామనాథుని-సంస్మరింతు॥ ౫౭॥

వ. యముండిట్లనియె. ౫౮।

క. నూనులుగజముఖగుహులె।
వానికివృషభేశ్వరుండు-వాహనమతనిక్।
శ్రీనిధిరామేశ్వరున।
జ్ఞాననివృత్తికిభజింతు-జగదేకగురున్॥ ౫౯॥

వ. వరుణుండిట్లనియె. ౬౦॥

క. పూనిమృకండునిసుతుఁడె।
వానింబూజించివైభ-వమునఁగృతాంతా।
ధీనుఁడుగాడద్దేవున।
దానందునిఁదలఁతుమృత్యు-హరురామేశున్॥ ౬౧॥

వ. కుబేరుండిట్లనియె ౬౨।

క. లాక్షారుణదేహునకుం।
జక్షుశ్రుతికుండలునకు-సర్వేశునకున్।
రక్షకునకురామేశున।
కక్షరునకుఁబ్రణుతిసేతు-నచలితభక్తిన్॥ ౬౩॥

వ. ఆదిత్యుండిట్లనియె. ౬౪।

గీ. రామనాథమహాదేవ-సోమచూడ।
దక్షయజ్ఞవినాశన-ధర్మరూప।

నీకున౦జలిఁగావింతు-నిష్ఠతోడఁ।
గరుణఁజూడుము భువనేశ-కలుషనాశ॥ ౬౫॥

వ. సోముండిట్లనియె. ౬౬।

క. శూలికిగుణశాలికిఫణి।
మాలికిశశిమౌళికిన్స-ముంచితభ సితో।
ద్దూళితునకుఁబాలితది।
క్పాలకునకు రామనాథ-భవున కుజేజే॥ ౬౭॥

వ అగ్ని యిట్లనియె. ౬౮।

మాలిని హరిహయముఖదిక్పా-లావళీభర్మమౌళి।
స్ఫురదురుమణితేజః-పుంజనీరాజితాంఘ్రిఁ।
దరుణశశిరభానూ-త్తంసుదిగ్వాసునీశుఁ।
నిరతముమదినుంతు-న్నిష్ఠతో రామనాథుఁ॥ ౬౯॥

వ వాయువిట్లనియె. ౭౦।

క. హరునకుహరిరూపునకుం।
బరమాత్మకువ్యాఘ్రపాదప-క్ష-పటునకు రామే।
శ్వరునకునీకుఁబ్రణామం।
బుసుకృపతో నాకభీష్ట-మొసఁగుమురుద్రా॥ ౭౧॥

వ. బృహస్పతియిట్లనియె. ౭౨।

క. చింతాతీతాత్మునకుఁ।
హంతాసాక్షికినిఁబ్రత్య-గద్వయునకుమా।
కాంతునకువందనంబులు।
భ్రాంతినివృత్తికినొనర్తు-రామేశునకుఁ॥ ౭౩॥

కందమిళితమణిగణనికరవృత్తము.

జలరుహభవనుత-చరణక । మలని।
ర్మలగుణమణిగణ-మదనమదహరా।
వలయితవిషధర-వరగిరి । నిలయా।
సెలకొనికొలిచెద-నినుమదినభవా॥ ౭౪॥

లయగ్రాహి.

కేశవనుతుస్ఫురసు-రేశనుతపాదయుగ-పాశహరవిస్ఫురద-కేశరవినుత్య।
త్రేశశిఖిలోచనగి-రీశకుసుమాయుధవి-నాశమునిమానసని-వేశజననాది।
క్లేశభయకాననహు-తాశనజటాధరజి-తాశవలయాకృతిబిలేశయపతీరా
మేశ్వరదిదంపుఘను-కాశనిభదేహపల-లాశమదభంజనని-రీశ నినుగొల్తున్

వ. శుక్రుండిట్లనియె ౨౬॥

ఆ. సుకృతియోగిలభ్య-సనుమహామాత్రాణ।
రూపునకు సదాగ్ర్య-పాలనునకు।
క్ష్వేలహీనునకును-నాశ్రితునకు రామ।
నాథదేవునకు నో-నర్తనలులు॥ ౨౭॥

వ. అగ్ని దేవుండిట్లనిరి. ౨౮॥

ఆ. పరమయోగిహృదయ-పదములవాత్మభా।
వమున వెలుఁగుచున్న-వానిశివుని।
విభునవన్యభాస-వేద్యునీశ్వరు రామ।
నాథుఁగొల్చెదము బ్ర-హ్మామకలన॥ ౨౯॥

వ. అగస్త్యుండిట్లనియె ౩౦॥

గీ. ఆదిదేవమహాదేవ-యనఘవిశ్వ।
నాథయవ్యయశివరామ-నాథదేవ।
యంబికానాథవృషభాంక-హర క్షమింపు।
మస్మదపరాధసాహస్ర-మనురవంగ్య॥ ౩౧॥

క. దారాపత్యక్షేత్రా।
గారద్రవిణములయెడన-ఖండితకరుణా!
ధారయహంకారము మమ।
కారము లేకుండ నాకుఁ-గరుణింపఁగదే॥ ౩౨॥

వ. సుతీక్ష్ణుండిట్లనియె ౩౩॥

చ. ధనములురత్నసంతతులు-ధాన్యములున్సుతమిత్రవర్గముల్।
వనితలుగోగణంబులును-వస్త్రచయంబును క్షేత్రగేహముల్।

గము, గోపమోక్షహేతువులు - గావటుగాన విరక్తిఁ గోరదగ్।
ఘనకృపనాకొసంగుము జ - గచ్ఛుభదాయక రామనాయకా॥ ౧౪॥

వ. విశ్వామిత్రుండిట్లనియె. ౧౫॥

చ. మదిఁ జొరవిన్న శాస్త్రమత - మర్మములుం జదువంగఁ బట్టఁబ్రా।
జదువులు నిష్ఫలంబులగు - సత్యము మస్తు ల్వసకొన్నెస్ప్ప వ।
త్పదజలజాతనిశ్చలిత - భక్తిమహత్వము లేనివానికిన్।
సదమలబోధరూపశివ - శర్వమహేశ్వర రామ వేశ్వరా॥ ౧౬॥

వ. గంధర్వులిట్లనిరి ౧౭॥

శా. ఆనందాత్మక రామనాథ భవదీ - యాంఘ్రిద్వయీసంపన।
ధ్యానాసక్తులు గాని మానవులకుం - దధ్యంబుగా నేరికిన్।
దానంబుల్ మఖముల్ తపోనియమముల్ - ధర్మంబులున్నిష్ఠలున్।
స్నానాతీర్థనిమజ్జనప్రముఖపు - ణ్యంబుల్ గడున్వ్యర్థముల్॥ ౧౮॥

వ. వసిష్ఠుండిట్లనియె ౧౯॥

ఉ. పాపములాచరించియును - బాయక మర్త్యుఁడు రామనాథని।
న్నోపికఁ జేరిభక్తిభర - ముల్లసిలం బ్రణమిల్లె సేవితే।
త్పాపసమూహమంబుసహ - బాంధవబంధుపదీప్తిపుంజని।
ర్వ్యాపితఘోరసంతమస - రాశిగతిన్ లయమొందుగొబ్బునన్॥ ౨౦॥

వ అత్రియిట్లనియె ౨౧॥

క రామేశ నిన్నుఁ జూచి ప్ర।
ణామముఁ గావించి కొలుచు - నరుఁడుగు బాధా।
ధామము సమాతృగర్భగు।
హోమధ్యమును గుహఁ జొరక - నమృతము జెందున్॥ ౨౨॥

గీ. జనుఁడు నినుఁ జేరి మ్రొక్కి - మఱందనదుబంధు।
వర్గముల నెవ్వఁడుఁ దలంచు - వారిదురిత।
వినహితులఁ జేయునంచఁ గన - న్నరుఁడు ధన్యుఁ।
డగుట చిత్రమె రామేశ - యభ్రకేశ॥ ౨౩॥

వ. గౌతముండిట్లనియె. ౯౪॥

మాలిని. ఇదిపరమరహస్యం-బెప్పుడుం దావకాంచ
త్పదకమలసపర్యా-తత్పరుం డైనవానిం
జెదరనిదృఢభక్తిం-జేరి సేవించువారుం
బొదలుదురుకృతార్థీ-భూతులై రామనాథా॥ ౯౫॥

గీ. ఎఱుఁగఁదగునిన్ను నిర్మల-హృదయులైన
వివిధ వేదాంత వాక్యార్థ-విమలచేత
శ్రాంతిదేరంగ సర్వశా-స్త్రములు విడిచి
కొల్వవలెనిన్ను రామేశ-సుధరచాప॥ ౯౬॥

వ. భృగుండిట్లనియె ౯౭।

రథోద్ధతావృత్తము.
దీనపాలభవ-దీయసత్పద
ధ్యానసంహృతస-మస్తపాపుఁడై
మానవుండజును-మాయుతుస్వయుఁ
భానుఁజెందుముని-భావితున్నినున్॥ ౯౮॥

చ. వ్రతములనోచనేలయును-వాసములుండఁగనేలశాస్త్రిప
దతులెఱుఁగంగనేలనిర-తంబునుగంగమునుంగనేలస
త్క్రతువులుసేయనేలఫణి-రాజవిభూషణరామనాథశా
శ్వతునకుబోధకారణభ-వత్పదసేవకులైనవారికిన్॥ ౯౯॥

గీ. రమ్యభోగాపవర్గవ-రప్రదంబు
ఘోరపాదికనరకని-వారకంబు
తారకంబిట్టినీపాద-ద్వంద్వభజన
మేలవిడువాఁడురసికుఁడ-హీనభూష॥ ౧౦౦॥

వ. అంగదుండిట్లనియె. ౧౦౧॥

గీ. విశ్వనాయకమత్ప్రాణ-విలయవేళ
గౌరితోఁగూడనీవుశీఘ్రముగవచ్చి

నన్నుఁ జేర్చుము సచ్చిదా-నందమయమ
రాజితనిజాంఘ్రికమలంబు-రామనాథ॥ ౧౦౨॥

వ. గంధర్వులిట్లనిరి. ౧౦౩॥

గీ. దుఃఖకల్లోలమాలికా-దుస్తరోగ్ర
పారరహితభవాంబుధిఁ బడినమాకుఁ
దావకపదాంబురుహభక్తి-తెప్పగాక
నన్యగతిలేదు రామేశ-పాపనాశ॥ ౧౦౪॥

వ. కిన్నరులిట్లనిరి. ౧౦౫॥

క. ఆమయశాస్త్రాలభ్యమ
ద్దామభవాటవిని వెతలఁ-దగిలినమాకున్
రామేశ్వరలింగ మౌని
స్తోమార్చిత మంచిత్రోవఁ-జూపుము కరుణన్॥ ౧౦౬॥

వ. యక్షులిట్లనిరి. ౧౦౭॥

గీ. రామనాథేశ యింద్రాదిగా-రాతులనేక
దర్పమున నేచుచున్నారు-తాళలేము
వారి నణఁగించి జయమొందఁ-బలయుఁగాన
గరుణఁ దీపింపఁ బాసటఁ-గమ్ము నీవు॥ ౧౦౮॥

వ. నాగేంద్రులిట్లనిరి. ౧౦౯॥

గీ. నీమహత్త్వమచింత్యంబు-నీలకంఠ
యల్పమతులము మేము మ-హానుభావ
యెట్లు నుతిసేయఁగలము ని-న్నిందుచూడ
ప్రణుతిఁ గావించె వేదము నీకు-రామనాథ॥ ౧౧౦॥

వ. కింపురుషులిట్లనిరి. ౧౧౧॥

క. కట్టువడి వివిధరోగములఁ
బుట్టుచుఁ గిట్టుచును వెతలఁ-బొందితిమహహా

పుట్టువుచావునుమాన్పము।
మట్టుగ రామేశలింగ-మధితానంగా॥ ౧౧౨॥

చతుర్విధకందము.

శ్రీరామనాథసరసవి।
హారాకరుణాసముద్ర-యాశ్రితవరదా।
గౌరీశ సౌమ్యవదనప్రు।
రారీహారశరణుశరణు హరినుతచరణా॥ ౧౧౩॥

వ విద్యాధరులిట్లనిరి ౧౧౪॥

క శతధృతిసారథికిశివా।
పతికినసంగునకువృషభ-పతి కేతునకున్।
శితికంఠునకును నీకును।
నతులొనరింతుము రామ-నాథమహేశా॥ ౧౧౫॥

వ వసువులిట్లనిరి. ౧౧౬॥

క గణబృందపూజితాంఘ్రికి।
గణనాథునకమరనిమ్న-గాధరునకునీ।
ర్గుణునకు రామేశ్వరునకుఁ।
బ్రణామములిడనీకుమమ్ముఁ-బాలింపశివా॥ ౧౧౭॥

వ. విశ్వదేవతలిట్లనిరి. ౧౧౮॥

గీ. జప్తిమాత్రైకనిష్ఠులౌ-సంయములకుఁ।
బునరుదయశూన్యమగునట్టి-భూయమిచ్చు।
వానికినిహంబునకునీకు-వందనంబు।
ప్రేమమునమమ్మురక్షింపు-రామనాథ॥ ౧౧౯॥

గీ. తత్త్వములకెల్లను త్రిమ-తత్త్వమనుచు।
వస్తుతత్త్వస్వరూపుఁడౌ-వానిసాధ।
సాంతరావేక్షశేకస్వ-యంప్రకాశుఁ।
డైనరామేశుఁగొల్చెద-ననుదినంబు॥ ౧౨౦॥

వ సాధ్యులిట్లనిరి.

గీ స్వాతిరిక్తవిహీనునా-ద్యంతరహితు।
విశ్వసత్తాప్రదాయకు-విగతమోహు।
సేవకాజ్ఞానభేదను-దేవునభవు।
స్వామినర్చించెదముభక్తి-రామనాథు॥ ౧౨౧॥

విద్యున్మాలావృత్తము.

శ్రీరామేశా-చిన్మాత్రాత్మా।
ధీరోపాశ్యా-ధీమధ్యస్థా।
గౌరీనాథా-కంఠేకాలా।
శ్రీదమ్యాంగా-జేజేనీకున్॥ ౧౨౨॥

వ వారలిట్లనిరి. ౧౨౩॥

సీ సచ్చిదానందుని-శ్చలునద్వితీయున,
ఎంగునిబ్రహ్మాత్ము-సంగశూన్యు।
నవికారునాదిమ-ధ్యాంతవర్జితుఁబరి,
శుద్ధుసనాతను-బుద్ధునంత।
క్ష్మాదిజగదేక-సాక్షిననంతుఁబ,
రామృతరూపుస్వ-యంప్రకాశు।
నప్రమేయునచింత్యు-ననఘునావిర్భావ,
సంకోచరహితువి-జ్ఞానకరుని।

గీ. నిత్యునిర్లేపునిష్క్రియు-నిరుపమాను।
విగతకర్మభూమానందు-విభుమహాత్ము।
దేవురామేశునెపుడుఁజిం-తించెదముస।
మస్తపాపక్షితికిమాన-సాబ్జసీమ॥ ౧౨౪॥

స్రగ్ధర.

శ్రీరామేశున్ రమేశా-ర్చితచరణుఁగృపా-సింధుబళ్ళల్లలాటున్।
గౌరీవక్షోజలిప్తా-గరుసురభితవ-క్షస్థలున్ వ్యోమకేశున్।

రారాజజ్జహ్నుకన్యా-ప్రవిమలకుసుమ-ప్రస్రఙ్మనోహారిమాళిన్।
క్షీరస్వచ్ఛాంగసర్పం-చిదముహృదయరా-శివమస్త్యుపవిష్టన్॥

కందగర్భితగీతము.

ధరణీధ్రశైలకార్ముక।-పరమపురుష।
నాగభూష-పర్వతీశర-ణా। సురవర।
సదయహృదయమృగ। ధరని-శ్చలగుణగణ।
శశి-ధరసుకిరీటా॥ వృష-స్వామితురగ॥ ౧౨౬॥

మ. మునిహృత్పద్మవిహారహారశరదంభోదస్ఫురత్కాయకా।
ఘనదైతేయవిశాలఫాలశిఖినే-త్రాస్త్రేక్షుకోదండదం।
జనభీవర్జితభృత్యభృత్యధికరూ-ధస్వాంతరాజీవశీ।
వనదాంచద్గళభాసభాసముదయ-వ్యాప్తాఖిలాశాంతకా॥ ౧౨౭।

సీ. రామేశమేశని-రంతరపూజిత,
జితపురాసురసు రా-ర్చితసుచరణ।
రణభయంకరకర-ప్రవిలసత్సారంగ,
రంగద్గవేంద్రతు-రంగ రాజ।
రాజశేఖరఖలా-రాతిదోషవిదార,
దారసంత్యక్తశ-రీరభాగ।
భాగమనీరుద్ధ బహుసూర్యసూర్యగబ్జ,
దివక్షరకరటేకృ-త్తికృతవసన।

గీ. సనకముఖమునిరంజన-జనవరహిత।
హితసదాచారచారణ-స్తుతవిహార॥
హారదహిపాలపాలనా-యత్తచిత్త।
చిత్తభవభూతివిలసిత-సితనిజాంగ॥ ౧౨౮॥

వ. దేవా! నీవు నిత్యముక్తుండవు నవిక్రియుండవు నద్వితీయుండవ వయ్యును నిజమాయాసమావేశంబున నవ్యాక్తాత్ముండవయితివి యట్టి నీవలన శబ్దగుణకంబగు నాకాశంబుపుట్టె, నాకాశంబు

వలన శబ్దస్పర్శగుణకంబగు వాయువు జనించె, వాయువువలన శబ్దస్పర్శరూప గుణకంబగు నగ్నిపొడమె, నగ్నివలన శబ్దస్పర్శ రూపరసగుణకంబగు జలంబుదయించె, జలంబువలన శబ్దస్పర్శ రూపరసగంధగుణకంబగు పృథివీభూతంబు జనించె నిట్టి పంచ సూక్ష్మభూతంబుల సత్త్వగుణసమష్టిభావంబున మనోబుద్ధిచిత్తాహం కారాత్మకంబగు నంతఃకరణంబు సృజింపంబడియె. సత్త్వగుణవ్య ష్టిభావంబున శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణంబులన శబ్దస్పర్శ రూపరసగంధగ్రాహకంబులగు పంచజ్ఞానేంద్రియంబులుద్భవించె. రజోగుణసమష్టిభావంబునం బ్రాణాపానవ్యానోదానసమానంబు లనం బంచప్రాణంబులు జనించె రజోగుణ వ్యష్టిభావంబున వాక్పాణి పాద పాయూపస్థంబులన వచనాదాన గమన విసర్గానంద విషయకంబులగు పంచ కర్మేంద్రియంబులు సంభ వించె నిట్టి జ్ఞాన కర్మేంద్రియ దశకంబును, ప్రాణ పంచకం బును, మనోబుద్ధిద్వయంబును, సప్తదశకం బగు లింగశరీ రం బయ్యె. సూక్ష్మ భూతంబు లైదునుం బంచీకృతంబులై స్థూలంబులనంబరగి నీస్థూల భూతపంచకంబువలనం జతుర్దశ లో కసహితంబును, సమస్తద్వీపసమన్వితంబును, మేరుమందరహిమవ దాది పర్వత సంయుక్తంబును, దేవ దానవ నర పశు పక్షి మృ గాది జంతుసమేతంబును, బహువిధ స్థావర సంకులంబును, విచి త్రంబునునగు బ్రహ్మాండంబుసంభవించె. రజోగుణంబున బ్రహ్మనై సృజియింతువు సత్త్వగుణంబున విష్ణుండనై పాలింతువు త మోగుణంబున రుద్రుండవై హరింతువు. నీవ జాగ్రత్స్వప్నసుషు ప్త్యవస్థాత్రయంబును, స్థూలసూక్ష్మ కారణ దేహాభిమానంబువహిం చి విశ్వతైజసప్రాజ్ఞ నామంబులు ధరించి క్రీడింతువు. పారా వారంబునం దరంగంబుల చందంబున, గగనంబున మేఘంబులతె రంగునం బతంగబింబంబునం బ్రభలకరణి ననేక నామరూపచరా

చర భూతంబులు నీయందుజన్మించి వెండియు నీయంద యేకీభావంబుఁ బొందు. అణువుకంటెఁ నణుతరుండవు మహత్తుకన్న మహత్తరుండవు. దూరంబునకు మాఁపోదుండవు సర్వంబుఁ గ్రహించున పాణివి. శబ్దంబు వినువ కర్ణుండవు. రూపంబుఁ జూచు చక్షుండవు. సర్వతఃపాణిపాదుండవు సర్వతోక్షిశిరోముఖుండవు సర్వతశ్శ్రుతిమంతుండవు. సర్వంబు నావరించియున్నవాఁడవు. నిత్యుండవు. సత్యుండవు నిష్కళుండవు. నిరంజనుండవు. నిర్లిప్తుండవు నిర్వికారుండవు నిర్వాణనిధివి నిస్తరంగబోధసముద్రుండవు. సచ్చిదానందఘనుండవు అమలుండ వజుండవ నఘుండవు. సర్వభూతాశయస్థితుండవు. గతివి. భర్తవు ప్రభుండవు సాక్షివి నివాసంబవు. కర్తవు. ఘనుండవు. ఉన్నతుండవు. శరణంబవు సుహృత్తవు నిర్హేతుకబంధుండవు దయాపరుండవు. భూతభావనుండవు. సర్వవ్యాపివి సర్వాద్యుండవు సర్వభూతాంతరాత్మవు. కేవలుండవు నిర్గుణుండవు. షడ్గుణైశ్వర్యసంపన్నుండవు. సనాతనుండవు. యోగిధ్యేయుండవు ద్వితీయవస్తుశూన్యుండవు. ప్రత్యగాత్మవు, శ్రోతవ్యుండవు, ద్రష్టవ్యుండవు, మంతవ్యుండవు, నిదిధ్యాసితవ్యుండవు, ప్రణవగమ్యుండవు, నీతత్వంబు బ్రహ్మాదులెఱుంగరు. సూర్యచంద్రాగ్నిప్రకాశకంబు నీతేజంబు. సమస్తప్రపంచంబు నీస్థూలశరీరంబు. నీనిశ్వాసంబులు వేదంబులు నీవు భూమియందావేశించి భూతంబులం దాల్తువు. వైశ్వానరుండవై ప్రాణుల దేహంబులాశ్రయించి ప్రాణాపానవాయుసమేతుండవై చతుర్విధాన్నపచనంబు సేతువు. రసాత్మకుండవై సోమరూపంబున నోషధులం బోషింతువు. సూర్యుండవై జగంబుల వెలింగింపుచు ప్రజోత్పాదనారంబు వర్షింతువు. స్మృతిజ్ఞానాపోహనంబులు నీవలనం బొడము. నీవు సకలోపనిషద్వేద్యుండవు వేదాంతకర్తవు వేదవేత్తవు నీ

నపూజన దాస్యంబులం గొందఱు, నిన్నారాధించి నిత్యా భియుక్తులై సిద్ధివడయుదురు. సమలోష్టాశ్మకాంచనులు, శత్రుమిత్రసములు. నిందాస్తుతితుల్యులు, సంగవివర్జితులు, నిశ్చలచిత్తులు హర్షామర్షభయోద్వేగముక్తులు, యదృచ్ఛాలాభసంతుష్టులు, నిర్మత్సరులు నైన భక్తులు నీకుం బ్రియతములై వెలుంగుదురు. ఫలజలపుష్పపత్త్రిమాత్రసమర్పణంబునం దృప్తుండవై దాసులం గృతార్థులఁ గావించు పరమకృపాపాదరుండవు నీవ యింద్రుండవు, చంద్రుండవు, బ్రహ్మవు, హరివి, శివుండవు, కాలుండవగ్నివి, విరాట్టువు, స్వరాట్టువు, అక్షరుండవు. మరుదశ్వవసురుద్రాదిత్యప్రజాపతిగంధర్వవరుణాదిమూర్తివి, నీవ భూతభవ్యప్రభుండవు, నీవ పరమగతివి, నీవు సర్వంబు నై యుండుదువు. నిన్నెవ్వరెఱుంగరు. జపాకుసుమాదిసంయోగంబున శుద్ధస్ఫటికంబు నానాత్వంబు భజించుతెఱంగునం బ్రకృతిసాంగత్యంబునం జేసి బహుప్రకారంబులం గానంబడుదువు గాని నీ వొక్కరుండవు నీయందె సర్వంబు జనించె. నీయంద నిలిచె నీయంద లీనంబగు నీవ సర్వబ్రహ్మాండవ్యాపి గగనగతుండగు తపనుండు పెక్కు జలఘటంబులం బెక్కు మూర్తులు వహించి చూడంబడు వడువున నీ వొక్కరుండవయ్యు నభోవాతాగ్నిసలిలపృథ్వీదేవనరతిర్యగాది నానోపాధుల ననేకప్రకారంబులం గనుంగొనంబడుదువు. నీవ సర్వక్షేత్రంబుల క్షేత్రజ్ఞసంజ్ఞవూని వసింతువు నీవ షడ్వింశతముండవై ప్రకృతివిలక్షణుండవై ప్రకాశింతువు ప్రాణాయామపరాయణులగు యోగులకు లభ్యుండవై నాదబిందుకళాతీతుండవయి రాజిల్లుదువు. రజ్జువునందు సర్పంబును, శుక్తి యందు రజతంబును, మరుమరీచిక యందు జలంబును, మిథ్యాభూతంబై తోఁచు పగిది నీయందు విశ్వంబు భ్రాంతికల్పితంబయి తోఁచుటసత్యంబు గాదు. నేతి నేతి వాక్యంబుల

నిఖిలోపాధినిషేధం బొనరించి సర్వాధిష్ఠానంబవగు నిన్ను తత్త్వమస్యాది మహావాక్యార్థవేత్తలు సోహంభావనాపరులయి యెఱుంగుదురు. గురువేదాంతవిశ్వాసంబులు లేనివానికి నీతత్త్వంబు తెలియనలవిగాదు సర్వప్రకాశకుండగు సూర్యుని వికలచక్షుండు దర్శింపనేరని విధంబున నవిద్యామోహితుండు సర్వవ్యాపకుండవయిన నిన్నెఱుంగనేరక పుట్టుచుం జచ్చుచునుండు క్షణమాత్రంబయిన నీవు తోచనితలంపు సుకృతికి, కృతకృత్యుండగు- కృష్ణపింగళుండవు విరూపాక్షుండవు ఊర్ధ్వరేతస్కుండవు- నీలకంఠుండవు- ఉమాసహాయుండవు- పరమేశ్వరుండవు నయి లోక సంరక్షణంబుకొఱకు విశుద్ధోర్జితదివ్యమంగళవిగ్రహంబు ధరించి కైలాసశిఖరంబున విహరింతువు నీవు వటవిటపిమూలభాగంబున వీరాసనస్థుండవయి యువదేశధురీణుండవయి పరమగురుండవై వయోవృద్ధులగు శిష్యులకు నిస్సంశయంబుగా బ్రహ్మతత్త్వంబు మౌనముద్రను ఉపదేశింతువు వారిహిరణ్యాగ్న్యాది దేవతలచేతం బూజలు గొనుచు వారియభీష్టంబులు కృపసేతువు- భక్తులకు భక్తుండవయి వినోదింతువు- దిగంబరుండవయ్యు సకలైశ్వర్యశాలివి, ఉగ్రుండవయ్యు ప్రశాంతుండవు, అర్ధనారీశ్వరుండవయ్యు నిస్సంగుండవు, విషధరుండవయ్యు నమృతప్రదుండవు, అద్వితీయుండవయ్యు ననేకమూర్తివి, అత్యద్భుతప్రభావుండవు, నీతత్త్వంబు నీవె యెఱుంగుదువు- నీగుణకథనంబు సేయ మేమెంతవారము- జడమతులము, అజ్ఞులము, విషయాసక్తులము, చపలస్వభావులము. దుస్తరంబగు సంసారసాగరంబున మునుంగుచుం దేలుచుం దరిగానక బహుక్లేశంబు లనుభవింపుచున్నారము- మమ్ము రక్షింపుము- ప్రసన్నుండవగుము- మాదుఃఖంబు నివారింపుము- మమ్ముం జేకొనుము- నిదాసులంగా భావించి కటాక్షింపుము- మా మొఱాలకింపుము మా విన్నపంబు చిత్తగింపుము మా నేరంబులు క్షమింపం జేయుము- మాయుపరా

శ్రీరస్తు.

# రామేశ్వరమాహాత్మ్యము

## పంచమాశ్వాసము.



క. మహ్యాగ్రద్వ్యజనా।
హేమునికులతిలకభీమ దయాగ్రతనూజా।
క్షేమస్రాండమల్లేశ్వర।
స్వామీగురుజాని. ల్లి-నగనవిహారా॥ ౧॥

వ. అవధరింపుము శౌనకాదిమహర్షులకు సూతుండిట్లనియె. ౨॥

క. శ్రీవిశ్రుతరామేశ్వర।
దేవునివిఖ్యాతకథను-ద్విజులారా।
నేవివరింతువినుండని,
భావంబునగురునిదలంచి-పలుకదొడంగెన్। ౩॥

క సిరివిరిబోడికినెళ్లై।
మరకతకురువిందవజ్ర-మయభవనంబై।
నిరుపమవిభవంబైమణి।
పురమొప్పుం బాండ్యదేశ భూగణమగుచున్॥ ౪॥

క పరగాపహ్యాన్నిజనాయక।
సురక్షితంబగుచు మరియు సుప్రజవిద్యా।

ధరవిబుధసురమణీభా।
సురమైమమణిపురముదనరు-సురపురముగలిౕ॥ ౫॥

సీ. వివిధవజ్రశిలాది-నిర్మితాభ్రంకష,
ప్రాకారవలయవి-భ్రాజితంబు।
సలిలప్రపూరసం-తోషితాతలలోక,
గంభీరతరపరి ఘాపయోధి।
అనిమిషయువతిది-వ్యవిమానమార్గావ,
రోధకృద్దివ్యశుకాంత-సౌధరాజి।
భువనగోపురాగ్రసం ఘటితహాటకకుంభ,
కలితహీరత్తోర-కాగణంబు।

గీ. ...న్మరాగోపలాబద్ధ భవనవేది।
బహుళసౌభాగ్యశోభిత-పణ్యవీధి।
రతిమనోభవవిభసతి-పతియుతంబు।
మహికినూపురమనఁబొల్చు మణిపురంబు॥ ౬॥

సీ. రంభోర్వశీముఖ్య-రమణీవిలాసంబు,
లంగనారత్నంబు-లందుఁగూర్చి।
ధురవైజయంతివి ఖ్యాతసౌభాగ్యంబు,
ప్రాసాదపఙ్క్తుల-పదిలపరచి।
కమనీయసురదీర్ఘి-కాగభీరత్వంబు,
పరిఘాపయోరాశి-దిరముచేసి।
దివిషద్ద్రుమాణిక్య-ధేనుదానవినోద,
శైలిరాజులయందు-సంగ్రహించి।

గీ. పద్మభవుఁడమరావతీ-పట్టణంబు।
సారమువారించియమ్మహి-దారపురము।
కౌశలంబొప్పనిర్మించెఁ-గాకయున్న।
కలదెతాగ్ర్యక్పనిదిశ్యం-గారలక్ష్మి॥ ౭॥

గీ. దిటముగా నిందుసుడిగట్టు-తియ్యవీటి।
కదలిని వ్వలనవ్వలఁ-గానొనర్చి।
నలువతెనవేర్పు నెగడంగ-నిలిపెనవఁగ।
వీటఁగోటయుఁ బరిఘయు-విమతిఁ గాంచు॥ ౮॥

గీ. ఆగలుదిగులొందుతన పుత్త్రి-డైనరాజు।
తమ విమిన్నందిచనపు-దాకునను చు।
నెట్టుకొని వారి వెసకోట-జొట్టుకొనిరొ।
నను చుజములాముకొనఖేయ-మమరుఁబురిని॥ ౯॥

గీ. పురము నెంతయు నొక్కశిరం-బునవహించె।
జిత్రమని చిల్వ జేసిద-ర్పం బుపాంఛ।
పడఁగిపాతాళమున కేగ-నరఁగఁబురిని।
బహుళగంభీరనీరమై-పరిఖ దనరు॥ ౧౦॥

మ. జలఖేలత్ఫణికన్యకాకుచతటీ-సంఘట్టనోద్ధూతచం।
చలకల్లోలవిధూతహాటకసరో-జశ్రేణినిర్యద్రజః।
కలితంబై విహరన్మరాళకులరం-గత్స్వాగతోపేతమై।
యలరుం దత్పురియందు ఖేయావలయం-బంభోధిగంభీరమై॥ ౧౧।

గీ. అతులకలధౌతరత్నవి-శ్రితములగుచు।
మిన్నొరయుచున్న యవ్వీటి-మేడగములు।
పద్మినీబాంధవునిఁగ్రిందు-పరచునన్న।
పూనిమిత్తిందనితలంచి-మానెఁగాక। ౧౨।

చ. అనిశము దిత్పురంబునను-హాటకనిర్మితహార్మ్యసీమలం।
దనుపమ కామసంగరభ-రాలసనీలసరోజలోచనా।
జనముల సేవదీర్చు సుర-శైవలినీకనకారవిందబృం।
దనవపరాగగంధసము-దంచితమందమరుత్కిశోరముల్॥ ౧౩॥

ఉ. కూరిమిఁ గిన్నరుల్సభలఁ-గూడి వియజ్ఝరతీరకుంజముల్।
చేరియనూనగానములు-సేయఁగ వీణలు మేళవించిత।

మ. అలవీటన్నెలకొన్న వైశ్యులుయిలా-భాపేక్షదీప్తాంతరం।
బులసుంబోయి సువస్తురత్ననికరం-బుల్ నావలం దెచ్చుచోఁ।
జెలువొప్పన్వెలిదీవికేగికొనిల-క్ష్మిం దెచ్చుటంజేసివా।
రలయిండ్లంగమలావధూటిసరినై-రాజిల్లునెల్లప్పుడున్॥ ౨౦॥

ఉ. శ్రీయువతీ ప్రియాంఘ్రిసరసీజభవుల్ జనరక్షణక్షమో।
పాయవిచక్షణుల్ భువన-పావనదేవనదీసహోదరుల్।
న్యాయపథప్రవర్తనుల-నారతభూసురపాదభక్తిశో।
భాయుతులుగ్రసత్త్వబల-భద్రులుశూద్రులువొల్తురప్పురిన్॥ ౨౧॥

క. సుడివడబెడిదపుపిడుగుల।
నడరుచుఁ బెనుచేతనడఁచు-రలమృధుఁ బుడమిం।
బడవైచినకవ్వడివడి।
కడజడవనినగుదురందుఁ-గలవీరభటుల్॥ ౨౨॥

మ. కరమొప్పంబురిప[illegible]వంశం-బుగ్రీవికల్ కుంచబ్బం।
దరదల్నీలకచాళికల్ మకరప-త్రీభాగిజిగండస్థలుల్।
వరమాలూరకుచల్ ముకుందపదభా-స్వన్మధ్యముల్ దివ్యభా।
స్వరశృంగారనిధుల్ దనర్తురచట-న్వారాంగనారత్నముల్॥ ౨౩॥

చ. మరునిమదంపుటేనుఁగులు-మారునిపెంపుడిలేండ్లుశంబరా।
సురరిపుగేళికీరములు-సూనకదంబుఁదుబోఁడిదిసేయుబం।
గరుసునుబువ్వుదీవలుఁజ-గన్నుతియానకటాక్షమాధురీ।
పరిచితభాషణాంగరుచి-భాసినులప్పురిలోవిలాసినుల్॥ ౨౪॥

చ. అరయఁగ నారదభ్రమక-రాలకలైశుకమోహనోక్తిబం।
ధురతదనర్చిపర్వతిమ-నోహరతుంగకుచావనమ్రులై।
పరగినవేశ్యలందుసిరి-బర్వియతిస్పృహణీయమూర్తులై।
కరమువసుంధరన్విమతిఁ-గాంచుటచిత్రమెయెంచిచూచినన్॥

సీ. వనితనీదంపతై-వలసివచ్చినవాఁడ,
విలువెంతచెప్పిన-వేగనిత్తు।

నిచ్చలు విరిబంతు-లిచ్చిమన్నింతుమీ,
ననవద్దుమాకునో-వనజగంధి।
మగువరో నీ సరక-మానమమ్మె దెసర,
యతను సౌఖ్యవినోద-మాచరింతు।
వవలక నేగొని-వచ్చినప్పుడునీవి,
విడిపోకయుండు నే-విద్రుమోష్ఠి।

గీ. యనుచుఁదమతోడ నెరజాణ-తనము మీఱ।
జాణశేఖరులాడెడు-సరసవర్త్మ।
వచనరచనలకలరిభా-వజునితూఁపు।
లమ్ముదురు పుష్పలావిక-లప్పురమున॥ ౨౬॥

గీ. స్తబకములఁబోల్చి విస్ఫుర-త్స్తనులఁబొసఁగి।
భ్రమరవిలసితవృత్తసం-పదలఁబోదలి।
యతులమృదుకలికామంజు-లతలఁదనరి।
చాటుకృతులట్లు వీటఁబూఁ-దోటలమరు॥ ౨౭॥

గీ. వీటనీటగు మిన్న పూఁ-దోటలందుఁ।
గ్రొవ్విరులతావి మిన్నంది-కొనఁగనందుఁ।
దిరుగుతెరగంటియున్న లే-తేంచి కాంచి।
భళిభళీయనొప్పుచు-నిలుతురెపుడు॥ ౨౮॥

మ. కరిముఖ్యైకకోటిపూజసేయఁగను మా-కాంతుండు దా మెచ్చితే।
త్వరతం దా ననుమెచ్చఁ గాంచుమనిశుం-భత్పౌరకుంభీంద్రముల్।
హరుమూర్త్యంతరమక్కుఁడౌ బెటఁగి పూ-జార్థంబు హస్తంబునం।
గరముల్చాచి పెకల్చు నిర్ఝరసరి-త్కంజాతపుంజంబులన్॥ ౨౯॥

మ. నలువొప్పన్ ద్విజరాజు గావునని దా-నందియ్యనోషట్పదీ।
కలితాకాశతరంగిణీజలజం-కంబట్టి తెయ్యంగనో।
పిలసత్పట్టణగంధసింధురపతు-ల్వేమాను నేకాంకమం।
డాలపర్యంతము జామహాస్తములు క్రీ-డాలంపటత్వంబునన్॥ ౩౦॥

చ. అలపుర రాజబృందముల-కప్పవమానుఁడమిత్రవృత్తుఁడై ।
బలసినవారివాహములఁ-బాయఁగఁ ద్రోలఁగ నేర్పెతాతఁడు ।
జ్వలజవవిద్య నేర్చుకొని యాసక్తిని సంతతమభ్యసించుచున్ ।
బలిమిఁ జరించ నాతనికి-భవ్యసదాగతిసంజ్ఞవర్తిలున్ ॥ ౩౧॥

మ. హరినీలోపలకౢప్తగతిప్రథ స్వేచ్ఛసిగా-జాంచజ్జయశ్రీపద ।
స్ఫురదార్తీయసులక్షణంబులు బహు-స్తోమంబులగ్గించి చూ ।
డరహిన్ సింధువులందు దేవమణితో-డంబుట్టియుచ్చైశ్శ్రవ ।
స్తురగశ్రేష్ఠము కన్నఁ బెద్దలవలెన్ శోభిల్లుఁ బౌరాశ్వముల్ ॥ ౩౨॥

ఉ. ఏదెసఁ జూచినన్ గజము-లేదెసఁ జూచిన వాజిమండలం ।
బేదెసఁ జూచినన్ రథము-లేదెసఁ జూచిన సైనికవ్రజం ।
బేదెసఁ జూచినన్ రుచిర-హేమధరాధర సార్వభౌమ దా ।
యాదములట్ల శోభిలుము-హార్యహిరణ్మయరాసులప్పురిన్ ॥ ౩౩॥

చ. చలువలుగట్టుహారములు-చక్కఁగఁ జైచి మెఱుంగు మేనులం ।
గలపముఁ బూసి వాసనలు-గ్రమ్ము సరుల్ ధరియించి కస్తురిం ।
దిలకము దిద్ది యొద్దికల-నెచ్చెలులం జతగూడి వేడ్కవే ।
శ్యలసొగసుల్ గణింపుచన-యంబు విటుల్ విహరింతురప్పురిన్ ॥ ౩౪॥

చ. మలయసమీరుఁడన్నగరి-మాపటివేళ విలాసదీర్ఘికా ।
జలముల నీదులాడి వికస-త్సుమపుష్పలతాంగనాళికిన్ ।
మెలకువ నట్టువల్ గఱపి-మేలుగ వచ్చి శ్రమంబుఁ దీర్చఁగాఁ ।
బలుమరు నివ్వటిల్లుఁ గల-పౌరులకున్ సురతప్రసంగముల్ ॥ ౩౫॥

వ. మఱియు నప్పురంబు కప్పురంబువోలె సదామోదజనకంబై, యు
ద్యానంబువోలె సుమనోమనోహరంబై, త్రిదివంబుఁబోలె సానో
త్కర్షవిశ్రుతంబై, కాసారంబువోలెఁ బద్మాకరంబై, రఘువంశంబు
వోలె రామాలంకృతంబయి, సముద్రంబువోలె వాహినీసంకులం
బయి, నృపసైన్యంబువోలె బహుళధార్మికంబై, రామాయణంబు
వోలె శోభనకాండంబయి, మహాప్రసాదంబువోలె బహువసుస

వృూర్ణంబయి, భారతంబువోలె సుశ్లోకంబయి, కుబేరదిగ్భాగంబువోలె సార్వభౌమనివాసంబయి, శంకరశరీరంబువోలె సర్వమంగళాధారంబయి, ద్వారకాపురంబువోలె నచ్యుతాగ్రజ సత్త్వకలితంబయి, వైకుంఠంబువోలెఁ బురుషోత్తమశోభితంబయి, శరత్కాలంబువోలెఁ బ్రసన్నరాజరుచిరంబయి, సువర్ణశైలంబువోలె లోకాద్యుషితంబయి, అంతరిక్షంబువోలెననంతరత్నప్రభాంచితంబయి, సత్కావ్యంబువోలె నలంకారప్రమరంబయి, పూర్ణిమాచంద్రమండలంబువోలెఁ గళానిధియయి, యొప్పు నప్పట్టణంబునకధీశ్వరుండు. 3౬॥

సీ. తనమహావిమలచి- త్తము పార్వతీమనో,
హరునకుఁ గేళిమం-దిరము గాఁగఁ।
దనధర్మమార్గవ- ర్తనచరిత్రము క్షత్రి,
జాతికమూల్యభూ-షణము గాఁగఁ।
దనఘనాద్భుతనిరం-తరదానవిభవంబు,
కల్పభూజాదుల-గణనమాన్పఁ।
దనవితాంతిపమృద్ధ-ధనవిజృంభితమైన,
సిరికుబేరునకైన-సిగ్గొనర్పఁ।

గీ. దనయశంబుదిగంతదం-తావళీంద్ర।
దంతకాంతులకధికపాం-డరతఘటింప।
నమరునిత్యప్రతాపని-రస్తకోటి।
లెరణివిభుఁడైనశంకర-ధరణివిభుఁడు॥ 3౭॥

మ. దిగిభశ్రేణిదశావశత్వమునవ- ర్తించె న్మహాశేషప।
న్నగుఁడిచ్చందిరిగాంగుటాద్రులలమై-నాకుంగనంబోయెనో।
ప్పగశ్రీదేవిఁగాఁగిలించెఁగుహనా-పాత్రీశ్వరుండాదటన్।
జగతీభారముశంకరుండురుభుజా- స్తంభంబునందాల్చుటన్॥3౮॥

సీ. రాజమౌళియనంగఁ - బ్రఖ్యాతి చేమించి,
జితకాముఁడనఁగఁ బ్ర - సిద్ధిఁ జెంది
సర్వజ్ఞుఁడితఁడనఁ - జాలగౌరవమంది,
సంతతంబును శివా - శ్రయతఁ దవిలి
అహితపురచ్ఛేద - నాసక్తి విలసిల్లి,
భూతపరాయణుఁడై పొగడు గాంచి
అక్షయతూణీరుఁ - డైయాజి జయ మొంది,
లోకపాలశ్రేణి లోన హెచ్చి

గీ. సామజాంతక విక్రమ - శాలియగుచు
భూతినలరారునమ్మహా - పుణ్యమూర్తి
శంకరాహ్వయుఁడగుట కా - శ్చర్యమేల
నతనిఁ దలఁచినఁ బ్రజకు సౌ - ఖ్యంబు గలుగు ॥ ౩౯॥

క. కురధుఁడు విషమేక్షణుఁడ
ధ్వరహరుఁడుగ్రుండుగాని - ధన్యుండాశం
కరుఁడైశ్వర్యము శోభిలఁ
బరగన్ భువి వెలితిలేని - పౌరుషమహిమన్ ॥ ౪౦॥

ఉ. మానుగఁ దివ్యవిల్లువిరి మచ్చికనారియుఁ దావితూఁపుంబుంజముం
బూనినవాఁడతండు మఱి - పూనినవాఁడితఁడింతమాత్రమే
కానిమఱియ్యిద్దియుంగొలఁత - గాదు మనోభవశంకరక్షమా
జానులకున్ జగత్త్రితయ - సన్నుతరూపవిలాససంపదన్ ॥ ౪౧॥

చ. ఇలపయి శంకరక్షితిత - లేంద్రుఁడు కల్పతరుత్రపాకరో
జ్జ్వలమగు దానశీలతన - జస్రము శోభిలుచుండఁ బైఁడిగు
బ్బలి వెరచెన్ ధనాధిపులకుఁ బంచియిచ్చుండమనంచు దేవతా
నిలయము గానమానుసని - నిర్భయవృత్తి వహించు వెండియున్ ॥ ౪౨॥

ఉ. వేమఱుఁ బుణ్యకాలముల - వేడుక శంకరరాజు ప్రాజ్ఞుఁడై
హేమము నూఁబరంబులు మ - హీశుగురించి చిత్తహీసుపర్ణను

గ్రామములకిచ్చుచుండఁగను-దంచితసస్త్రిసమృద్ధశాలియై।
కామవిరోధిమాన్పెఁజిర-కాలికనైజదిగంబరత్వమున్॥ ౪౩॥

చ. అనిమొనవైరిరాజులుభ-యానకభూరితరానకధ్వనుల్।
వినిపఱవెత్తియెత్తియుట వీపథకంటకకుంఠితాంఘ్రులై।
పనిచెడిఖిన్నులైపతగ-భావముభావములందుఁగోరుచున్।
వనదుహసంభవుంబరుష-వాక్కులనిందయొనర్తురెంతయున్॥ ౪౪॥

గీ. అనృతవాదియుఁబాపచిం-తావిలుండుఁ।
బరధనాపేక్షియును నెవ్వఁ-డబడిన వాఁడు।
రోగియును నెందు లేఁడొక్క-రుండుఁదలఁప।
శంకరుండేలునిఖిలరా-జ్యంబునందు॥ ౪౫॥

గీ. గోవులెల్లప్పుడును బాలు-గురియుచుండుఁ।
బుష్పఫలసంపదలనొప్పు-భూరుహములు।
బహుళసస్యంబుముక్కారు-బండుచుండు।
నతఁడు పాలింపధాత్రిపు-ణ్యంబుకలిమి॥ ౪౬॥

క. పానీయశాలికలును।
ద్యానంబులుఁ సలిలపూరి-తములగు చెరువుల్।
నానామణిమయదేవ।
పానములున్నప్పుడు నిలిపె ధరఁదగ నెపుడున్॥ ౪౭॥

చ. ఫలఘృతశాకపంచవిధ-భక్ష్యసశర్కరపాయసాంచితో।
జ్జ్వలకిలమాన్నదానము-సత్రిసహస్రములెల్లచోటుల।
న్వలనదలిర్పనిల్పిహిమ-వన్మలయాచలమధ్యతీరముల్।
లలిభజియింపనేగుద్విజు-లందనుపుణ్యుఁశంకరుండొగిన్॥ ౪౮॥

మ. చతురంభోధిపరీతభూతలపతు-ల్సమ్యక్ప్రకారంబునన్।
నుతిభద్రేభతురంగహేమమణిసం-దోహంబులర్పించియా।
నతులైకొల్వఁగనేకహేళినివహా-నందంబుతో శంకర।
క్షితిపాలుండుధరిత్రియేలెవిలస-త్కీర్తింబ్రతాపోన్నతిన్॥ ౪౯॥

క. ఈవస్తువిపుడుతనకుం
గావలెనిమ్మనుచునొరునిఁ-గని వేఁడెడువాఁ
డేవంక లేఁడుశంకర
భూవరురాజ్యమునఁబ్రజలు-బొరిసిరిఁగనుటన్. ౹౹ ౫౦

సీ. ఆనృపాలుఁడుగావించు నధ్వరముల
నిజహవిర్భాగభోగసం-తృప్తులగుచు
మనుగుడుపు పెండ్లికొడుకుల-మాడ్కిఁ బుషిత
గాత్రులైరింద్రుఁడాదిగాఁ-గలుగుసురలు ౹౹ ౫౧

క. ఏనుజులహతిపరిశాంతవ
మనుజేంద్రులగెలిచి దివిజయ-మహనీయుండై
ఘనభూచక్రము దాల్చెను
తనసిరిబుధనుతముగాన-తంపతులభృతిన్ ౹౹ ౫౨

క. కావలసినయుప్పుడెయా
భూవరపుర పురరాష్ట్ర-ములఁబర్జన్యుం
డావిర్భవమొందిసుభి
క్షోపహముగ వానగురియు-నంచితవృత్తిన్ ౹౹ ౫౩

క. నగరంబులు రాష్ట్రంబులు
నగణితధనధాన్యయుతము-లైయభయములై
సెగవడఁగ్రబ్రముదితమానసు
లగుమనుజుల్ దన్ను బొగడ-నానృపుఁడలరెన్ ౹౹ ౫౪

వ. మఱియు నప్పుడమిఱేఁడు మూఁడుగన్నులవేల్పుం బోరిసతోడం గూడిపోరాడి యోడించిమించిన క్రీడియుం దమకునీడు గాడని వాఁడిమెరసిపలుకు విలుకాండ్రందఱ్ను గొలువ బలువడిం బరిఘవిల్లి యొల్లకడలుగెలిచి కొలిచినిలిచిన రాచపట్టంజేపట్టిమట్టుపరచిబెట్టిదంబగుకినుకంగనుపట్టియని యొనరించిన ఱేనిందునిమి యొనిముడి కపెలుగడలుకొను నెలుంగుల బలుకంబంబులగెలుపువ్రాలు వ్రా

యుంచి జింకనెఱు నెఱ్ఱటిగోమిఱుటంబుగా నెకసక్కెం
బులాడువడిగలమేలుజక్కి పౌజులడెక్కలతెరవునం గ్రమ్మి ముమ్మ
రంబుగా నెగయు నెలదుమ్ము కడలుంజడి యడుసుకొలుపదాడియా
డిపుడమిచేడియ ఘనదానయొడయండై యడిగెడువారికోరిక కెఱ్ఱ
డు గావిడిముడియిడుచుంగడుంబొడవగుపొగడుఁగాంచి పుడుకు
దోడుకుం దెగడి నెగడికవలి రాయనివడుగుపరచి బుడుత నెలదారిం
గేరి పెట్టుచెట్టుచట్టులరట్టుపాలుజేసి పాసింబేర్చి నేర్చినవాఁడై
జన్నంబులెన్నియునోనర్చి వేన్నుండు మొదలగు జన్నంపుతిండి
పిండులకుఁబండుగ సేయుచు నఱజంబగు చఱదనంబు సంజా
ఱ్ఱల కీలికిం జఱ్ఱరవిలుకానికి నెఱవయ్యెపఱ్ఱజఱ్ఱరాహుత్తు
పెఱ్ఱరక్కసులం జఱ్ఱాడుకరణి వెఱ్ఱసపుటఱ్ఱరులనుఱ్ఱ
డంచి జలయొడ నిఱవంపుమఱువ నెరపుచు మిఱ్ఱలివన్నెక
ఱ్ఱమఱ్ఱంటె మెడనుందోడవగు పడగదారివడువునుడువవలం
తిరై తనయానపునికానినడకలుమాని మానికంబులు కానుకలో
సంగిదొరలందరు శరణని మ్రొక్కుచుంగొలువ విలువలేనికలిమి
యుంబలిమియు నెలకొని తనయందునింపొందచందమామచందం
బున నందతికవిందై యొందునుంగొఱంతలేక చెందొవవిందుతాల్ప
రియడుగు కెందమ్మిదోయి డెందంబునంబొందుపరచి హత్తుకొన్న బ
త్తింబు త్తిడివిరులగుత్తులుం దామరపువ్వుమొత్తంబులిడి కొల్చుచు
నె త్తమ్మివిడిదిపడంతుకం దన వెడందరొమ్మున నిమ్ముగానిడుకొన్న
కొ్రన్నవిలుకానితండ్రియుంబోలె సిరులనిరవొందుచు నొయ్యా
వనయెక్కిమీఁదు జగంబేలుచుండె నంత. ౫౫॥

ఉ. కోకిలపంచమస్వరవి-ఘూర్ణితకర్ణవధూవియోగిహృ|
ద్భీకరపుష్పగుచ్ఛమఘ-బిందుఝురీవిచరన్మధువ్రతా|
స్తోకసురభ్రుంక్రియానినద-శోభితసర్వజనోత్సవప్రద|
శ్రీకలితంబువొల్చెవన-సీమలయందువసంతమెంతయుఁ॥ ౫౬॥

గీ. చైత్రయాత్రోద్యతానంగ-పార్శ్వధాము।
సచివకృతరక్తరాంకవ-చటులపటము।
టీరములనంగ వనులవిం-పారెబాల।
పల్లవాంచితభూరుహ-పంక్తులపుడు। ౫౭॥

క. అవనీచ్యుతపత్రములై।
నవపల్లవలక్ష్మి చేఁగ-నందగమహిరు।
ణ్ణివహములు లేమిదొలఁగిన।
భువిలోసిరిచేత వెలయు-పురుషులకరణిన్॥ ౫౮॥

క. శుకచంచూపుటనిభకిం।
శుకముకుళవ్రజములపుడు-చూడఁగనొప్పెన్।
మకరధ్వజతేజోగ్ని।
ప్రకటప్రభలచటనచటఁ-బర్వనంగన్॥ ౫౯॥

గీ కలితదక్షిణదిగ్వధూ-గర్భమునజ।
నించినసమీరశిశువుమ-న్నించిలతలు।
చిగురుటుయ్యెలనుంచిపో-షింపఁబెరిగ।
భీతివిరహులకాత్మలోఁ-బెరుగుచుండ॥ ౬౦॥

సీ. సహకారమంజరీ-సౌరభ్యవిభవంబు,
మాధవీమంటప-మండితంబు।
వ్యాకోచకేసర-వాసనానిలయంబు,
మల్లికాస్ఫుటదినాం-తోల్లసితము।
మలయమారుతపోత-మానితభువనంబు,
స్మరశరోల్లేహన-సాధనంబు।
డోలికాకేళీవి-లోలబాలారత్న,
మఖిలర్తుగణమస్త-కాభరణము।

గీ. కేళివనవాపికాతీర-ఖేలనార్హ।
మంజుకుంజగృహాంతర-మదనకదన।

పరవశాక్షీణసుఖవధూ-వరవిహార।
కాంతమగుచువసంతంబు-ఘనతఁ జూపె॥ ౨౧॥

గీ. సామవేదంబుఁ జదువుచు-సాధువృత్తి।
మాధవస్తుతిఁ గావించు-మానులేమొ।
పికములటుగానిచో వన-ప్రియములగుచు।
సద్ద్విజఖ్యాతిచే నెట్లు-సంచరించు॥ ౨౨॥

చ. ప్రమదమునంబికాంగనలు-పాటలువాడమగుల్లసల్లఁగా।
ప్రమదలులాస్యముల్సలుప-భవ్యవనీవనితావివాహసం।
భ్రమసమయంబునందలరి-మాధవుఁడోయనమాధవుండుతీ।
విమెరయసత్ఫలంబులను-విప్రకరంబులకిచ్చె హెచ్చుగన్॥ ౨౩॥

సీ. పృథులపల్లవితపుష్పితఫలితోర్వీజ,
రాజరాజితవన-భ్రాజితంబు।
ప్రసవాసవానూన-పానమాద్యద్భృంగ,
సంఘఝుంఝుక్రియా-సంక్రమంబు
సహకారభూరుహాం-చలఫలాస్వాదనా,
పేక్షాతిశయచలత్పక్షికులము।
ఘనసమ్మదాకులకలకంఠకులకంఠ,
కాకలీకలకలో-త్కలితంబు।

గీ. కుసుమమంజులవంజుల-కుంజపుంజ।
మదనకదనపరిశ్రాంత-మతవతిలక।
శాలభవనారికణహార-బాలపవన।
మగుచుసంపొందెఁ జైత్రస-మాగమంబు॥ ౨౪॥

సీ. తతములైవిభ్రమాం-చితములైమనుపాన,
మదమునమిక్కి-లి-బొదలిరొదలు।
గడురనింపులనింపు-తోదమమ్మదలచేఁ,
దనరుచు-ఘనరుచు లొసరఁగొరల।

గురులతాగ్రహాముల-విరులతావులపాను,
పులుఁగుందుఁబతులతోఁ గలసియతుల।
రతులఁడస్సినమద-వతులచక్కనిచెక్కు,
లనుగ్రమ్ముచెమటలింపునహరించు।

గీ. కమ్మనీసుదుమ్ములరజమ్ము-గ్రుమ్మరించి।
వలపు మొలపించిచలువయు-మొలవఁజేసి।
యలయికలణంచి మెల్లన-మొలఁగిచెలఁగి।
తెమ్మెరలుమధువేళవ-నమ్ములందు॥ ౬౫॥

వ. ఇవ్విధంబున మవ్వంబైనివ్వటిల్లు నవ్వసంతసమయంబున నవ్వసుమతీశ్వరుండొక్కనాడుమంజుల సాలభంజికాకుంభస్థరకిత స్తంభసంభారంబును నత్యుత్తమచంద్రకాంతభిత్తివిరాజమానంబును వజ్రకీలితలాలితద్వారచారుతరంబును నభినవస్ఫటికరత్ననిర్మిత సోపానశ్రేణీరమణీయంబును పురుహూతనీలనిర్మితవాతాయన స్ఫీతంబును పద్మరాగమణికుట్టిమంబును మృదులభాసుర కాస్తుభాస్తరణసముంచితంబును నృపోపాయనద్విరదమదజలపంకిలాంగణంబును అసాధారణసౌభాగ్యసాకల్యకల్యాణంబును విచిత్రవిభవశేషవిలసితంబునునగు సభాభవనంబున నవరత్నమయసింహాసనంబున నాసీనుండై కాంతికాంతాకరకలితులస్ఫురత్కనీదండమండితచారుచామరమరుద్వీజ్యమానుండగుచు వైదికమీమాంసకతార్కికనైయాయికవైశేషికాలంకారిక జ్యౌతిషకపౌరాణికసుకవీశ్వరమంత్రిసామంత పురోహితగాయక విదూషక వైణిక వాంశికమారటీక వందిమాగధవైతాళికనర్తకసైనిక వ్యావహారిక వారాంగనాదిజనులు యథాస్థానంబులనుండి యుచితగతులంగొలువఁ గొలువుకుంజీలువదొరకైనంబలుకనలవిగాని చెలువంబునంగొలువుకలువరాయని పాదుపులతిరింబొలుపగు చెంగల్వకొలనువోలె నిండుకొని కన్నులపండువయ్యె సొంపుసంపాదింపవేసంబులు చ

ర్చింపుచు శాస్త్రివాదంబులుపరీక్షింపుచు పురాణేతిహాసకథలి
చ్ఛగింపుచు చంపూనాటకోదాహరణాది చాటుప్రబంధంబులా
లోచింపుచు సంగీతమాధుర్యరసప్రవాహంబులందేలుచు నృత్యగీ
తిప్రకారంబులు విలోకించిమెచ్చుచు ప్రణతనరపాలురంగృపా
శీతలకటాక్షవీక్షణంబులంజూచుచు సకలవిద్యాప్రసంగ గోష్ఠివి
నోదంబుల నుల్లసిల్లుచు శంకరమహీవల్లభ శేఖరుండు పేరోలగం
బున్న సమయంబునః॥ ౬౬।

సీ. శార్దూలనఖములు-చమరవాలంబులు,
గోరోచనంబును-జారపప్పు।
సెలవిండ్లుపీలిపు-వ్వులఝల్లులును జున్న,
జవ్వాదిపిల్లులు-శారికలును।
కస్తూరిమృగములు-కరటిదంతములును,
నెరవైనడేగలు-నెమ్మిపురులు।
వేణుముక్తాఫలశ్రేణులు పునుఁగును,
కలితకాలాగరు-ఖండతతులు।

గీ. మఱియునరవులుగలుగుస-మస్తశస్త।
వస్తువులు కానుకలిచ్చియ-వ్వసుమతీశ।
సింహాలనొయ్యవఁబొడగాంచి-చెంచుదొరలు।
ముదముగదురంగవటసాగి-మ్రొక్కిరపుడు॥ ౬౭॥
ఆ. మ్రొక్కిలేచికేలు-మోడ్చినెన్నొసలను।
టించిపలికిరిట్లు-చెంచుదొరలు।
సామిచిత్తగించు-చక్కగామాసేయ।
విన్నపంబుతప్పు-లెన్నకీవు॥ ౬౮॥
క. విసుగులుమేముమునీదయ।
సనిబొప్పడనడవిఁగడుపు-చల్లగదలకా।

గ్గసఁబొ్రిద్దువొడుచు-బెలుఁగక।
రొుసపరిగీములను కించి-యుంటిమి సామీ॥ ౧౯॥

క. నీ వేలిక లెంకలమై।
కావల సినపనులు సేయఁ-గాఁజాలుదుమో।
దేవా నీయడుగులు గనఁ।
గా వేడుక వొడమి వచ్చి-కంటిమి నెమ్మిన్॥ ౨౦॥

క. మాసత్తువ మావడిమా।
చేనూటియు మాకడింది-సిరి వేటకువి।
చ్చేసిక నుంగొని వన్నె యు।
వాసియు మాకబ్బఁ జేయు-వలదే నీకున్॥ ౨౧॥

క. కానల మెకాలు కన్నులఁ।
గానవు కదుఁ బోతరించి-కావరమునఁ గా।
లూనవు రంకెలు వేయుచు।
మానుగఁ బొదలీగుఁ బంట-మానులు చెలువున్॥ ౨౨॥

క. కదువాడి కోరలార వ్రులఁ।
బొడిదైయెదట్టం వుటిసుక-పోలిక రాలన్।
గదుసు పడియొక టొకటిలో।
బడిబడి పొరాడుఁ గొ్రివ్వి-పందులు కినుకన్॥ ౨౩॥

క. ఎల్లెడఁ జూచిన తానై।
పెల్లుగ నజ్జాడు మున్ను-బిల్లులు డొంకల్।
కేళ్ళు చుకు మరొావ నేయుచుఁ।
ద్రుళ్ళుచుఁ ద్రెళ్ళుచును తేచి-దుముకుమనచటన్॥ ౨౪॥

ఆ. ముబ్బురొదల కంటె-నిబ్బడిగొనుచునా।
సబ్బతిల్లవరిది-బొబ్బలిడుచు।
సింగములు చెలంగి-చంగునవురికియో।
నుంగు మొత్తముల-నణంగి త్రుంచు॥ ౨౫॥

వ. అనిమఱియు నన్యవన్యమృగమదోద్రిక్తవ్యాపారంబులఁగ్గడించి అదరుంబగనైయున్నదిప్పుడు వేటకువిచ్చేయందగునని చెంచులు విన్నవించిన నాకర్ణించి దుష్టమృగనిగ్రహంబు కర్తవ్యంబనినిశ్చయించి శంకరమహీపాలుండు ధనురస్త్రశస్త్రప్రవీణులగు మృగయుల వేటకురమ్మని చాటంబంచి యారాత్రిగడపి ప్రభాతంబు నంగాలోచితకరణీయంబులునిర్వర్తించి రక్తోష్ణీష పరిచ్ఛదుండును దృఢగోధాంగుళిత్రాణుండును మహాకోదండపాణియు కచ్ఛాబద్ధమండలాగ్రుండును మృగయావిహారసముచితవేష ధారియుం బాదుకాగూఢచరణకమలుండును సన్నద్ధుండునై॥ ౨౧॥

ఉ. మానసవైనతేయపవ-మానసమానసమజ్వలద్రయ।
శ్రీనిలయంబుశారదశ-శిప్రతిభాదవిభాంచితంబునౌ।
మానితవాజినెక్కిరిపు-మర్దనుఁడానృపమౌళివిక్రమా।
నూనమహోపబాతిమృగ-యుల్ దనుగొల్వఁగనేగవేటకున్॥ ౨౨॥

సీ. వెంటమాణిక్యంబు-విశ్వాసిబంటుఁడు,
పాలసంద్రంబుతు-పాకిగుండు।
భైరవిజోళంగి-బలుబంతిజవ్వాది,
వియ్యాలదాడివి వేకజోగి।
యురిగోలవలిచీమ-గరుడపైఁడిసలాక,
భూతనాథుఁడుకూన-బొడ్డుకంటు।
నీలమేఘముపైఁడి-నిగ్గుజేవునుగొండ,
రాముబాణంబువా-రణముసురటి।

గీ. పుణ్యతీర్థముచేమంతి-పోతురాజు।
సాళువముపాగభేర్వడ్డ-జాగిలములు।
సరభణులఁబట్టికొని తెచ్చు-సాగినడచి।
రవనిపతిమోలిమృగయుల-యవసరమున॥ ౨౩॥

తరళ. వలలుబోనులుచిక్కములు బెను-వాతికత్తులుబల్లెముల్।

బలుతుపోతులు వాగురుల్ మిడి-బద్దలీటెలు దీములం।
బులపొదుల్ తడవిల్లు నారస-ముల్ గుదెల్గొని వేటకాం।
డ్రెలమిఁ గొల్వఁగ వచ్చె భూమిత-లేంద్రుఁడున్నతి మీఱఁగన్ ॥౭౯

మ. అవనీశుండనుయాయిసైనికసువీ-రాలాపవార్తాశ్రుతి।
ప్రవణుండై చని కాంచె దుర్గదవద-ద్భల్లూకవ్యాళోగ్రశ।
ల్యవరాహద్విపఖడ్గసింహశరభ-వ్యాఘ్రాదినానామృగో।
గ్రవిహారాకులభీకరంబగు మహారణ్యంబు దౌదవ్వులన్। ౮౦॥

వ. వెండియు మందారమాకందమాలూరమాతులుంగమధూకమాధవీ మాలతీమల్లికాసాలతమాలకృతమాలభూర్జరఖర్జూరసర్జకార్జున హరీతకీక్రముకామలక మాగధసింధువారబదరీకాకేసరకురువకకురంటకాదిపాదపవిటపాగ్రనిరర్గళవిహరమాణకీరశారికాకోకిల పారావతప్రముఖనిఖిలశకునినికరనినాదపూరితంబును పథికజనశ్రవణరంధ్రనీరంధ్రమహోత్సవసంపాదన చతురసదాగతిపూరిత కీచకధ్వానసంగతనిర్ఝరిణీసంజనితకమల ఖేలద్రోలంబగానమృదుల నిస్వనభాసురంబును సహస్రకిరణ పరంపరాదురవగాహంబును నగు నరణ్యంబు దరిసి మృగంబులు సంచరించితావుల రసిములు తారువేయించి పొంగువారించి వలలు బరపించి తెరలెత్తించి బోనులొడ్డించి దీములు ఘటించి తెరవులరికట్టించి వాకలువంపించి మచ్చుమందులు చల్లించి వాకట్టుకట్టించి॥ ౮౧॥

శా. చాపంబెక్కిడి యర్గళోపమభుజా-సారంబెలర్పన్ మహా।
శాసారధ్వనిధిక్కరించుగుణని-ర్ఘోషంబు గావించియా।
టోపంబొప్ప మృగంబులుర్విఁబడ నై-ష్ఠుర్యంబుగా నేసెసా।
భూపాలేంద్రుఁడు చండకాండచయముల్-పుంఖానుపుంఖంబుగాన్

క. నరపతి యీగతి నిష్ఠుర।
శరములు బరపుటయు నచల-సాధ్వసపరతన్।
గిరికరికేసరికాసర।

తరక్షుముఖమృగములరచి-ధరణీంద్రుఁదెల్పెన్॥ ౮౩॥

గీ. ధరణినాధపృషత్కని-ర్దళితమృగని।
కాయఘనకాయగళితర-క్తప్రవాహ।
చయముప్రవహించెగైరిక-శైలసాను।
భాగసంజాతనిర్ఝర-పఙ్క్తిపగిది॥ ౮౪॥

క. ఆనరనాధునియానతిఁ।
బూనిభటుల్ చెంచుదొరలు-భూరిగుహలఁబ్రతి।
ధ్వానములీనఁగనార్చుచు।
మానితశునకములనేర్పు-మరవిడిచిరొగిన్॥ ౮౫॥

ఆ. అవియుఁరూపవీర్య-జవసత్త్వములసింహ।
శాబకములఁబోలఁ-జాలుఁగాన।
మృగమృగసమూహ-నిగ్రహంబొనరించె।
నతులనఖరదంష్ట్రి కాయుధములఁ॥ ౮౬॥

ఉ. అంతట వారలున్ మృగప-దాండము వెంబడి వేగిఁ కుంజపుం।
జాంతరసీమఁబొంచినమృ-గావళిఁగ్రుంచియురజ్జుజాలసం।
క్రాంతినిలోఁగిచిక్కిన మె-కాలవధించియుదీములొడ్డవి।
భ్రాంతివహించికేళ్ళురుకు-వానినిఁగూల్చియుఁబెక్కు-భంగులన్॥

వ. ఇవ్విధంబున నాఖేటచాతుర్యపాటవ నిరాఘాట చటులాటవి కవీరభటశ్రేష్ఠులు గరిష్ఠవిక్రమాకుంఠ మృగయావినోదాయత్తచిత్తులై మత్తేభంబులఁద్రుంచియు లులాయంబులఁగూలించియు శార్దూలంబులమర్దించియు గండకంబుల ఖండించియు శరభంబులంబరిమార్చియు శల్యంబులం దెప్పించియు నన్యవన్యమృగనికరంబులం దెగటార్చియు తెరవేటగంటివేటమొనలయిన వేటలన్నియు ఘటియించియు తన డెందంబునకానందంబు సంపాదింపుచుఁ దోడంజనుదేర మఱియు నాధరణీశ్వరుండు ధనుర్ధరుండై కాంతారంబులం బర్వతంబులం గుహాంతరంబులం దగినయెడల

మృగంబుల నన్వేషింపుచు గిరిశిఖర నిర్గతనిర్ఝరిణీసంజనిత కంజా
తపుంజమంజులపరాగభరిత సౌరభ్యధురంధరగంధవాహకిశోర
ప్రసారమహితభారనిరస్తాయాసుండగుచుఁ జనిచని యొక్క విపి
నోద్దేశంబున. ౮౮

గీ. గిరిగుహామధ్యవాసునిఁ-బరమశాంతు
వ్యాఘ్రచర్మావృతాంగుద-యాంతరంగు
వానినొక్కనివ్యాఘ్రముగ-మతినెఁదుని మె
మనుజనాయకుఁ డొక తీవ్ర-మార్గణమున. ౮౯

గీ. శంకరన్నృపప్రయుక్తమా-సాయకంబు
శీఘ్రగతితోడవచ్చియా-చెంతనున్న
యమ్మునీంద్రునిపత్నిమ-హాపతివ్ర
తాశిరోమణి దెగటార్చె-దైవగతిని. ౯౦

వ. ఇట్లు శంకరన్నృపాలప్రయుక్తబాణనిహతులైన జననీజనకులఁ జూచి
తత్సుతుండు జాంగలుండను వాఁడప్పుడు భృశదుఃఖితుండగుచు
నెలుంగెత్తి రోదనంబు సేయుచు నిట్లని విలపించె. ౯౧

సీ. ఓ తాతయో మాత-యో దయాంబుధులార,
యిటు నన్ను విడిచి మీ-రెచటికిప్పు
డేగిరి యచ్చోటి-కేగుదు నేను నా,
కెవ్వాఁడు రక్షకుఁ-డెన్ని చూడఁ
జదివించుచున్న బ్రాఁ-జదువులెవ్వాఁడింక,
పటుశాస్త్రములు పఠిం-పంగఁ జేయు
నెవ్వఁ డాచారంబు-లెల్ల శిక్షించునో,
తండ్రి నీవిట్టుదు-ర్దశ వహింప

గీ. అమ్మరో నాకు భోజనం-బరితోనో
సంగ నెవ్వరెయుపదంశ-సంగతముగ

జననియెవ్వతెయిఁక బాల్య-చాపలమున।
బోసవెట్టెడినను(జేరి-బుజ్జగింతు॥ ౯౨॥

గీ. జీర్ణపర్ణంబుపారణ-శిధిలతనుల।
నిరపరాధులవృద్ధతపో-నిష్ఠగలుగు।
వారిమిమ్ములనిపుడుని-ష్కారణంబు।
చంపెనెవ్వఁడుదారుణ-సాయకముల॥ ౯౩॥

వ. అని పెక్కు-భంగుల నమ్మునికుమారుఁడు పెద్దయెలుంగెత్తి రోదనంబు సేయుచుండె నంతం దత్ప్రలపితంబాలకించి శంకరభూపాలుండు శబ్దంబునకభిముఖుండై చని గుహాద్వారంబుఁజేర నచ్చటి మునులందఱు నయ్యాక్రందనంబువిని తదాశ్రమంబునకు సత్వరంబుగా వచ్చి శరనిహతులైన మునిదంపతులంగాంచి ధనుర్ధరుండగు రాజును విలోకించి విలపించుచున్న మునిపుత్త్రుంగని భృశవిహ్వలులై భీతిచేతస్కులైన మునిపుత్త్రు నాశ్వాసింపు మనిట్లనిరి.

క. ధనియెడనిస్వునియెడన।
జ్ఞానియెడఁబండితునియెడఁగృ-శునియెడలందు।
మునియెడలైననంతకుఁ।
డనఘాసమవర్తిసంశ-యములేదుసుమీ॥ ౯౪॥

క. వనముననభమునగ్రామమునం।
బుననగమునెట్టిదేశమునెచ్చటనుం।
డినఁగానియమునివశతం।
జనవలయున్సకలజంతు-సంతతికనఘా॥ ౯౫॥

గీ. బాలకులువృద్ధులగువారు-బ్రహ్మచారు।
లరయగృహమేధులునవిపి-నాలయులును।
యతులునుశరీరములువిడ-నాడియుముని।
వీఁడుజొత్తురుకాలంబు-గూడనేని॥ ౯౬॥

క, విప్రులుక్షత్రియులునవై।
శ్యప్రవరులుశూద్రులితర-సంకరజాతుల్।

విప్రకుమారకయుమలో!
శపాప్తికి నేగవలయుఁ - గాలవశమునన్ ॥ ౯౮॥

మ. సురలున్విప్రులు సాధ్యులున్మనులుయ - క్షుల్ నాగగంధర్వకిం।
పురుషుల్ దైత్యులు మర్త్యులన్యులుజగ - త్పూజ్యాత్ములైయొప్పవా।
క్తరణీనాథమహేంద్రచంద్రధనులుం - గాలక్రమప్రక్రియన్।
విరతింబొందెదరందఱున్ గుణనిధీ - నీకేల శోకింపఁగన్ ॥ ౯౯॥

గీ. అద్వయము సచ్చిదానంద - మాత్రతత్త్వ।
ముఁనిషద్గతముసుబ్రహ్మ - మొకటియావె।
చెడదుపుట్టదు పెరుగదు - జీర్ణభావ।
మొందదు స్వయంప్రకాశమై - యమరుచుండు॥ ౧౦౦॥

సీ. పాపకామక్రోధ - భయమోహమాత్సర్య,
కారణంబత్యంత - కష్టకరము।
పరదారపరవిత్త - పారవశ్యైకలోలంబు,
కలుషప్రాకార - విలసనంబు।
మలమూత్రదుర్గంధ - నిలయంబు సాంద్రపూ,
యాసృగ్వసాపంక - ధూసరంబు।
నవరంధ్రసహితంబు - నానావిధక్రిమి,
సంకులంబు జడంబ శాశ్వతంబు।

గీ. బహుతరక్లేశహింసాది - భాజనంబు।
నిందితంబిట్టి దేహంబు నందునాత్మ।
బుద్ధి గావించితిరమని పాపులు సెప్పఁ।
డతఁడుమూఢుండుదుర్మ - యుతఁడు సుమ్ము। ౧౦౧॥

వ. బహుఛిద్రఘటాకారంబైన శరీరంబునం బ్రాణవాయువు చిరకాలంబు నిలువనేరదు కావున జననీజనకులం గూర్చి శోకంబు సేయకుము. వారు స్వకర్మవశంబునం జేసి కళేబరంబులు విడిచిచనిరి నీవును గర్మవశంబున భూతలంబున నున్నవాఁడవు కర్మక్షయంబగునెప్పుడప్పుడ పరలోకంబునకుం జనఁగలవు శరీరావాసస్థానంబు కర్మ

దీనంబుగావున శోకంబువలదు. ధైర్యబవలంబించి సమాహితుండవై తల్లిదండ్రులకు చేసెడికార్యంబులు వేదోక్త ప్రకారంబున నాచరింపుము. నీ తల్లియుం దండ్రియు శర ఘాతంబున మృతిం బొందిరి గావున వారికి దుర్మరణ దోష నివృత్తి యగునట్లుగా రామేశ్వర క్షేత్రంబునకుం జని యందు పైతృక క్రియా కలాపంబు సర్వంబును గావింపుమని మహామునులుపదేశించిన శాకల్యనందనుండైన జాంగలుండట్లు పితృదేహంబులు సంస్కరించి మరునాడు రామేశ్వర క్షేత్రంబునకుంజని యొకసంవత్సరంబు వసించి తదంతిమ దివసంబున నిశాసమయంబునం గలలోనం దల్లిదండ్రుల హరిసారూప్యంబు వహించినవారిం జూచి సంతసిల్లి మునులకావృత్తాంతంబు వినిపించి సుఖించుచుండె నంతనమ్మహర్షు లారాజుంజూచి కోపించి పరుషభాషణంబుల నిట్లనిరి. ౧౦౨॥

క. మోహాంధపాండ్యభూవర!
బాహుబలోన్నత్త వంశ-పాంసనకుమతీ!
స్త్రీహత్యయుద్విజహత్యయు
వాహసివై చేసితివియ-సన్మార్గరతీ॥ ౧౦౩॥

ఆ. కానవహ్నియందుఁ గాయసంత్యాగంబు
సేయుమిప్పుడిట్లు - సేయవేని
శుద్ధినీకులేదు- సుమ్ము ప్రాయశ్చిత్త
కోటిచేతనైనఁ - గుత్సితాత్మ! ౧౦౪॥

క. దోషాధారిభవత్సం
భాషణమాత్రమునవచ్చు-బ్రాహ్మణహత్యా
దోషాయుతంబుదుష్టము
నీపాపమాపంక నింక-నిలువక చనుమీ॥ ౧౦౫॥

సీ. నావుఁడుశంకర-భూవిభుండటువలె,
నగుఁగాకహవ్య వా-హనునియందు

విడిచెద నెమ్మేను-విప్రహత్యాపాప,
శాంతికై వైభవ-త్సవిధభూమిఁ।
గాయపరిత్యాగ-కలనచే మత్కృతి,
దోషంబశేషంబుఁ-దొలఁగునట్లు।
ఘనులార నాకను-గ్రహము సేయుఁడుమీర,
లనిమునీంద్రులతోడ-నాడి తనదు।

గీ సచివులను బిల్చి పల్కె-వి-చారమెడలి।
చేసితిని బ్రహ్మహత్యదు-శ్శీలపరత।
వెలఁదిఁ జంపితి గావఁద-త్కలుషశోధ।
నార్థమనలంబుఁ జొచ్చి దే-హంబు విడుతు॥ ౧౦౭॥

వ ఇంధనంబులు శీఘ్రముగఁ దెచ్చి వహ్నిఁ దరిఁగొల్పుఁడు. మత్పుత్త్రిని రాజ్యంబునం బ్రతిష్ఠింపుఁడు. శోకంబు మానుఁడు, దైవంబు దురతిక్రమంబని యేలిక పలికిన పలుకుఁ విని దుఃఖింపుచు మంత్రు లిట్లనిరి॥ ౧౦౮॥

ఉ శత్రులకైన మేలెపుడు-సల్పెడివాఁడవు పాండ్యభూపతీ।
పుత్త్రిఁ బోషించినట్లు మముఁ బోషించితి నిత్యము నిన్నుఁ బాసి లో।
కత్రయగణ్య యెట్లు చను-గాఁగలము జ్వలితాగ్నిఁ జొచ్చెము।
ద్గాత్రములుజ్జగించెదము-తథ్యము సుమ్మని పల్కె వారితోన్ ॥౧౦౯॥

వ రాజిట్లనియె. ౧౧౦॥

మత్తకోకిల.

ఓమహామతులార చెప్పెద-నొక్కమాట వినుండు నే।
నేమి సేయుదు ఘోరపాతక మిట్లు చేసితి రాజనై।
భూమి యేలఁగ నాకుఁ జెల్లదు పొందుగొబ్బున వీటికిన్।
మామకాత్మజు రాజుఁ జేయుఁడు-మానుఁ డాత్మలశోకమున్ ॥౧౧౧॥

వ. అనిసాంత్వనపూర్వకంబుగాఁ బలికి మంత్రులనొడంబరచి తదానీతచారు సమేధితంబై ప్రజ్వలింపుచున్న మహాజ్వాలనంబుఁ గనుంగొని ౧౧౨॥

గీ. స్నానమొనరించియాచమ-నంబుఁ జేసి।
శుద్ధమతియయిరోహితా-స్యునకుమౌని।
పుంగవులకుఁబ్రదక్షిణ-పూర్వకముగ।
మ్రొక్కి-ధ్యానసమునసాంబ మూర్తినిలిపి॥ ౧౧౨॥

వ. ధైర్యంబవలంబించి శంకరవసుంధరావల్లభుండు వహ్నిలోనను రుకంబ్రారంభించిన. ౧౧౩॥

గీ. ప్రావృషాంభోధరధ్వని-ప్రతిమభయద।
నాదముసెలంగ మౌనిబృం-దము వినంగఁ।
బాంధవ్యకులరత్నమైనయా-ప్రభునిఁగూర్చి।
యప్పుడాకాశవాణియి-ట్లనుచుఁబలికె॥ ౧౧౪॥

సీ. శ్రీశంకరక్షమా-ధీశవహ్నిప్రదే,
శమునఁగి విప్రుడుసేయు-కుముమహీశు।
పర్వహాత్యాహేతు-పాతకోగ్రభయంబ,
డణఁగదునీకును-జాలవాల।
చెప్పెదనవహిత-చిత్తతవదుఁబదే,
శముపినుసద్వేద-సమ్మితంబు।
దక్షిణాంభోరాశి తటమునగంధమా,
దనమహాధారుణీ ధరమునందు।

గీ. రామసేతువునందుశ్రీ-రామచంద్రు।
సంప్రతిష్ఠితు రామేశు-సర్వగురుని।
శివునిగౌరీశు నాధుని-సేవసేయు।
ముచటభక్తిఁనీవొక్క-హాయనంబు॥ ౧౧౫॥

వ. త్రికాలంబును బ్రదక్షిణనమస్కా-రంబులుఁ సేయుము. ప్రత్యహంబు రామేశ్వరస్వామికిఁ గవ్యఘృతభారద్వయంబునను, ద్విభారపరిసమ్మితంబులైన గోక్షీరంబున ద్రోణపరిమాణంబగు మధురసంబునను, మహాభిషేకంబాచరింపుము. ప్రతిదినంబు చందనాగరు-

కుంకుమకర్పూరంబుల రామనాథునిం బూజింపుము. పాయసాన్నాది వివిధపదార్థంబుల నైవేద్యంబు సమర్పింపుము. తిలతైలంబునఁ బ్రతిదినంబు దీపారాధనంబొనర్పు మిట్లు రామేశ్వరుం గొల్చిన యక్షణంబ నీకు స్త్రీహత్యయుం బ్రహ్మహత్యయు నశింమ రామనాథునిదర్శనంబున భ్రూణహత్యాయుతంబును, సురాపానాయుతంబును, స్వర్ణస్తేయాయుతంబును, గురుస్త్రీగమనాయుతంబును, తత్సంయోగిదోషంబులును, సకలపాతకంబులును దొలఁగు. ౧౧౬॥

గీ. ఎంచ రామేశుసేవల-కింత నేని।
గంగ చేరయు చేఁబ్రయా-గంబు చేత।
నేమివివిధాధ్వరంబుల-నేమిఘోర।
తపము చే నేమినరులకు-ధరణి నాథ॥ ౧౧౭॥

క. కావున సేతువునకుఁజను।
మీవుశివుఁ రామనాథు నీశ్వరునభవుఁ।
సేవింపుమిఁక విలంబము।
గావింపకుమి పుడె నుము-గాధవివేకా। ౧౧౮॥

వ. ఇట్లాకాశ వాణి పలికిన పలుకులు విని॥ ౧౧౯॥

క. మునులందఱు శంకరస్తుపుఁ।
గనుఁగొని సేతువునకాశు-గతి నేగుము నీ।
వనఘా సేవక భవభం।
జనుఁగొల్వుము రామనాథు-సదయస్వాంతుఁ॥ ౧౨౦॥

వ. రామనాథేశ్వరస్వామి మాహాత్మ్యంబెఱుంగక మేమునిన్నగ్నిలోఁ జొరుమంటిమనియమ్మహర్షులాడినవట్లవారిచే ననుజ్ఞాతుండై యాపాండ్యభూమండలాఖండలుండు॥ ౧౨౧॥

క. కరితురగరథపదాతులఁ।
బూమునపంబంపిమునుల బోరివలగొని మొ్రి।

క్కరభసమునఁగ తిపయబల।
పరివృతుఁడై తాను సేతు-బంధంబునకరిగె॥ ౧౨౨॥

సీ. చనిసేతువునవొక్క-సంవత్సరమునిల్చి,
భక్తిపూర్వకముగఁ-బ్రత్యహంబు।
మూఁడుసంధ్యలయందు-ముదమునఁబూజించి,
రామనాథేశ్వర-స్వామినభవుఁ।
గొనకొనియలధను-ష్కోటినిబ్రతివాస,
రంబునుమునిఁగెని-రంతరంబు।
ధరణీసురలకన్య-దానంబుఁగావించి,
యేకభుక్తముజేసి-యింద్రియముల।

గీ. గెలిచెనొప్పఁగదశభార-ములధనంబు।
రామనాథునికొసఁగెనీ-క్రమముచేత।
నభ్రిభారతిచెప్పిన-యట్లపూజ।
నంబుతగసల్పెఁబాండ్య-నరవిభుండు॥ ౧౨౩॥

క. అంతటశంకరనృపుఁడ।
త్యాంతిమదివసమునఁబ్రీతుఁ-డైహైమవతీ।
కాంతునిరామేశ్వరునిన।
నంతునిబొగడంగఁదొడఁగె-నచలితభక్తిన్॥ ౧౨౪॥

శ్లో. నమామిరుద్రమీశానం రామనాథముమాపతిం।
పాహిమాంకృపయా దేవబ్రహ్మహత్యాందహాశుమే॥ ౧౨౫॥

శ్లో. త్రిపురఘ్న మహాదేవ కాలకూటవిషాదన।
రక్షమాంకరుణాసింధోస్త్రీహత్యాం మేవిమోచయ॥ ౧౨౬॥

శ్లో. గంగాధరవిరూపాక్ష రామనాథత్రిలోచన।
మాంపాలయకృపాదృష్ట్యామతోఽపంచింధిశంకర॥ ౧౨౭॥

శ్లో. కామారే కామసంధాయిన్ భక్తానాం రాఘవేశ్వర।
కటాక్షపాతంకురుమే శుద్ధం మాంకురుధూర్జటే॥ ౧౨౮॥

శ్లో. మార్కండేయభయత్రాణమృత్యుంజయశివాన్వయ।
నమస్తేగిరిజారాయనిష్పాపం కురుసర్వదా॥ ౧౨౯॥

శ్లో. రుద్రాక్షమాలాభరణచంద్రశేఖరశంకర।
వేదోక్తసమ్యగాచారయోగ్యమాం కురు తేనమః॥ ౧౩౦॥

శ్లో. సూర్యదంతభిదేతుభ్యం భారతీనాసికాభిదే।
రామేశ్వరాయదేవాయనమోమే శుభదో భవ॥ ౧౩౧॥

శ్లో. అనంతసచ్చిదానందం రామనాథం వృషధ్వజం।
భూయోభూయోనమస్యామి పాతకం మే వినశ్యతు॥ ౧౩౨॥

గీ. ఇవ్విధంబున రామేశు-నిందుధరుని।
వినుతిసేయుచున్న య-మ్మనుజవిభుని।
యానసంబున వెడలెమ-హాభయంక।
రస్వరూపిణియైనట్టి-బ్రహ్మహత్య॥ ౧౩౩॥

ఆ. అట్టిబ్రహ్మహత్య-నతిఘోరమూర్తినిఁ।
జూచి భైరవుండు-శూలహతిని।
సంహరించె రుద్ర-శాసనంబునంత।
రామనాథుఁడనియె-రాజుతోడ॥ ౧౩౪॥

క. క్షితినాథ నీయుదార!
స్తుతులనతిప్రీతమాన-సుఁడనైతిభవ!
త్కృతపూజనమున నమునమొం!
దితినిచ్ఛిదవరము వేఁడు-ధీరవనేశా॥ ౧౩౫॥

వ. స్త్రీహత్యా బ్రహ్మహత్యలవలననైన నీదోషంబు దొలంగ శుద్ధుండ వైతివి. మున్నువోలె రాజ్యంబుఁ బాలింపుము. భక్తియుక్తంబగు హృదయంబున నెవ్వారు నన్నిచ్చోట సేవింతురు వారి బ్రహ్మహత్యలు పదివేలైన నశింపంజేయుదు. మహాపాతకాయుతంబుల నైన క్షణమాత్రంబున విదళింతు నన్ను సేవించుజనులు సంసార క్లేశరహితులై మత్సాయుజ్యంబు నొందుదురు. నీ చేసిన స్తోత్రంబు భక్తికంబుగాఁ బఠించినవారికి మహాపాపసంచయంబు నశించు

నీభక్తితాత్పర్యవిశ్వాసస్తోత్రపూజావిధానంబులం బ్రసన్నుండ
నైతి. యథేష్టంబుగా వరంబు ప్రార్థింపుమని రామేశ్వరుండాన
తిచ్చిన శంకరమహారాజిట్లనియె. ౧౩౬

ఉ. ఇందుకళావతంసపర-మేశనినుం గనుఁగొంటిధన్యతం।
జెందితినింతకంటెనువి-శేషపరస్థితిలేదునామసా।
నందమ్ముకందుపుత్త్రిభయ-నాశకతారకపాదపద్మని।
ష్యందసుభక్తిసంపదయొ-సంగుముపాతకతూలపావకా॥ ౧౩౭॥

ఆ. జననిగర్భగోళ-మునఁబునర్జనినాకుఁ।
దప్పఁగాతమత్కృ-తస్తవంబుఁ।
దగఁబఠించునరుఁడు-ధన్యుఁడైనీసేవఁ।
గలుగుపుణ్యఫలముఁ-గాంచుఁగాత॥ ౧౩౮॥

క. అనివేఁడినఁబల్కుఁగా।
కనియుతనినమ్రగహించి-యలరామేశుం।
డనుపమలింగాకారం।
బుననంతర్హితుఁడయ్యె-భూసురులారా॥ ౧౩౯॥

క. నరపతియు రామనాథుని।
గిరిజావల్లభునిఁగొలిచి-కృతకృత్యతచేఁ।
గరమొప్పమునిజసేనా।
పరివృతుఁడైచనియెనాత్మ-పట్టణమునకున్॥ ౧౪౦॥

గీ. అంతివనవాసులైనమ-హామునులకుఁ।
దనదువృత్తాంతమంతయు-ధరణివిభుఁడు।
విన్నవించినవారుప్ర-సన్నులగుచుఁ।
జెలఁగిపట్టాభిషిక్తునిఁ-జేసిరతని। ౧౪౧॥

మత్తకోకిల.
పుత్త్రదారసమేతుఁడై బహు-భోగియై గుణశాలియై।
శ్రోత్రియద్విజగణ్యుఁడయి-సూర్యసన్నిభతేజుఁడై।

శాత్రవక్షితినాథభూధర-శతఘ్నిఁ గ్రైవిజయంబుఁ గ।
ధాత్రి నియేలెను బాండ్యశంకర-ధారుణీశ్వరుఁ డున్నతిన్॥ ౧౪౩॥

మ. కురిసెన్ వృష్టిఫలించె సస్యవితతుల్ -గోవుల్బహుక్షీరముల్।
గురిసెన్ రోగభయాపమృత్యుజనిత-క్షోభంబడంగెం బ్రజల్।
సిరిచే హెచ్చిరి యజ్ఞకర్మములు బొల్చె-న్నాల్గుపాదంబులం।
బరగెన్ ధర్మము పాండ్యశంకరుఁడు సా-మ్రాజ్యంబు గావింపఁ గాన్

వ. ఇవ్విధంబున సముద్రముద్రితమహీమండలంబు చిరకాలంబు పాలించి పుత్త్రునకు రాజ్యంబొసంగి శంకరమహారాజు శరీరాంతంబున రామేశ్వరమహాదేవునిం జెంతింపుముఁ దత్సాలోక్యముక్తిఁ బడసె నీప్రకారంబున మీకు రామేశ్వరమాహాత్మ్యంబు వివరించితి నీయుపాఖ్యానంబు పవిత్రంబు లక్ష్మీకరంబు పుణ్యంబు దుఃఖహరంబు దుస్స్వప్నదోషనివారణంబు మహాశాంతికరంబు సకలార్థకారణంబు దీనిం బఠించినవారికి విన్నవారికి స్వర్గాపవర్గంబులు సిద్ధించు జ్యోతిష్టోమాదియజ్ఞఫలంబును చతుర్వేదశతావృత్తిఫలంబును సకలతీర్థస్నానఫలంబును షోడశమహాదానఫలంబును లభించును. బ్రహ్మవిష్ణుమహేశ్వరలోకనివాసంబు దొరకును శివసాయుజ్యంబు సంభవించు సకలకామంబులు ఫలించు మనని నిఖిలపురాణవ్యాఖ్యానసమేతుండగు సూతుండు పలికినవిని నైమిశారణ్యనివాసులు శౌనకాదిమహర్షులు సంతుష్టిం జెందిరి. సూతుండు కైలాసంబునకుం జనియె నిమ్మహాప్రబంధంబు వ్రాసిన పుస్తకంబర్చనఁ జేసిన వారాధించిన శ్రీరామేశ్వరుండాయురారోగ్యైశ్వర్యంబులు శాశ్వతమోక్షపదంబునుం గృపసేయు॥ ౧౪౪॥

శా. భక్తారామవసంతశాంతమునిహృ-త్పద్మాంతరాసీనస।
న్ముక్తాహారపటీరహీరశరదం-భోభృద్విశేషాంగ వే।
దోక్తానంతగుణప్రభావపరిపూ-ర్ణోదారకారుణ్యసం।
సిక్తప్రేక్షణవిశ్వరక్షణచణా-శ్రీమత్త్రిశూలాయుధా॥ ౧౪౫॥

క. గురుజానపల్లిపట్టట।
పరిపాలనశీలభక్త-పరతంత్రమతీ।
గిరిరాయకన్యకాకుచ।
పరిరంభణభోగసుఖిత భాసురహృదయా॥ ౧౪౮॥

మత్తకోకిల
భద్రిరాజకులాబ్ధికైరవ బంధుమల్లనమంత్రిరా।
డ్భద్రదాయకపాదపంకజ-పంకజాననసారధీ।
కాద్రివేయసుభూషణోజ్వల-గాత్రగోత్రశరాసనా।
సద్రయోక్షతురంగదైవత-సార్వభౌమమహేశ్వరా। ౧౪౯॥

గద్య:— ఇది శ్రీమదుమామహేశ్వర కరుణాకటాక్షవీక్షాపాత్ర,
యేనుగ లచ్చయామాత్యపౌత్ర తిమ్మనామాత్యపుత్త్రి),
వివిధ విద్వజ్జనవిధేయ, లక్ష్మణకవినామధేయప్రణీ
తంబయిన రామేశ్వరమాహాత్మ్యంబను
మహాప్రబంధమునందు సర్గంబును
బంచమాశ్వాసము
సంపూర్ణము.
శ్రీ.శ్రీ.శ్రీ.